శ్రీవాణీ ప్రసన్నాభవతు





## ప్రార్థన

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

## అంకితము

అంకితంబుగాఁ జేసితి నందుకొనుము
లోక కల్యాణ సిద్ధికై ప్రాకటముగ
సరస సుందర సౌభాగ్య శతకశైలి
నీదు గాథల వినుతించి నీకెయిచట

కడలి జలములఁ గొనివచ్చి కడఁగి మొగులు
మగిడి కడలి కర్పించు నమ్మాడ్కిదోప
దురిత సంహార! తిరుపతి పురవిహార!
రమ్యగుణసాంద్ర! కోదండరామచంద్ర!

శ్రీవాణీ ప్రసన్నాభవతు

# మున్నుడి

*యత్ర యత్ర రఘునాథకీర్తనం - తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।*
*బాష్పవారి పరిపూర్ణలోచనం - మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥*
*మనోజవం మారుతతుల్యవేగం - జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్*
*వాతాత్మజం వానరయూథముఖ్యం - శ్రీరామదూతం శిరసానమామి॥*

ఇది "శతకరీతి పద్యాంధ్ర సంగ్రహరామాయణము". వాల్మీకి రామాయణమునకు సంగ్రహమగు తెలుఁగుసేఁత. భావానువాదక్రమంలో సాగింపఁబడినది. శతకరీతిలో రామాయణము వంటి మహాకావ్యాన్ని అనువదించడం ఇతఃపూర్వం జరుగలేదు. నాకు తెలిసినంతవఱకు ఇట్టి సాహిత్యప్రక్రియకు ఇదే నాందియని భావిస్తున్నాను.

రామాయణానువాదం సుందరకాండంతోనూ-భారతానువాదం విరాటపర్వంతోను ప్రారంభించడం సంప్రదాయమని పెద్దలు చెప్తారు. ప్రప్రథమంగా 1994 సంవత్సరము (శ్రీముఖనామ సంవత్సరం) సుందరకాండాన్ని శతకరీతిలో అనువదించి ప్రకటించాను. తక్కిన బాల-అయోధ్యా - ఆరణ్య - కిష్కింధాకాండానువాదములు ఇప్పడే వెలుగుచూస్తున్నాయి. యుద్ధకాండం అనువదించవలసియున్నది. ఏడుకొండలవాని దయవలన త్వరలో అది కూడా రూపుదాల్చగలదని ఆశిస్తున్నాను.

శ్రీరామభక్తాగ్రగణ్యుఁడైన ఆంజనేయస్వామి ఈ శతకరీతి పద్యాంధ్ర సంగ్రహరామాయణానికి శ్రోత. ఇందులోని ప్రతి పద్యమూ "ఆంజనేయప్రభూ" అనే సంబోధనాత్మక మకుటసంవిధానంతో సాగిపోతుంది.

సుందరముఖ్యుఁడైన హనుమంతుడు సుందరకాండానికి అధినాయకుఁడే గాక బీజం-శక్తి-కీలకమనిగూడా సనాతనులు భావిస్తారు. ముఖ్యంగా ఆంజనేయోపాసకులు సుందరకాండాన్ని పారాయణం చేసేటప్పడు ఆ స్వామి సాధించిన విజయఘట్టాలనే అంగన్యాస కరన్యాసాలతో వినుతించి మ్రొక్కులర్పిస్తారు. ఆంజనేయస్వామి నామోచ్చారణమే సర్వపాపహరమనీ సకల కార్యవిజయసాధకమని వారి దృఢవిశ్వాసం - మీదు మిక్కిలి కీర్తిని - ధనాన్ని - నిర్భయత్వాన్ని - రోగరాహిత్యాన్ని-

సాక్షాత్కారించాలని ఆ స్వామి ప్రసాదిస్తాడని వారి నమ్మకం. కాబట్టి నాయీ రామాయణాన్ని ఆలకించడాని ఆంజనేయస్వామివారికి మించిన శ్రోతయెవ్వరున్నారు? అందులకే నాయీ శతకరీతి రామాయణానికి మకుటాలంకృతుడై ఆంజనేయస్వామి పట్టాభిషేక్తుఁడైనాఁడు.

శతకరీతి రామాయణ మంటూనే దీనిని నూఱు పద్యాలకు పరిమితమైన గ్రంథంగా అందరూ భావించడం సహజం. కానీ, యిది యట్టిదికాదు. భావానువాదం చేసేటప్పుడు ఎన్ని పద్యాలు రూపుదాలిస్తే, సంఖ్యానియమంతో పొత్తు లేకుండా ఆ పద్యాలన్నీ యిందు చోటు చేసుకొంటాయి. అట్లగుటం జేసి బాలకాండంలో 281 పద్యాలు, అయోధ్యాకాండంలో 230 పద్యాలు, అరణ్యకాండంలో 216 పద్యాలు, కిష్కింధాకాండంలో 196 పద్యాలు - తొలుదొల్త వ్రాసిన సుందరకాండంలో 302 పద్యాలు సాక్షాత్కారిస్తాయి. అనఁగా శతక ప్రక్రియలో ఉండే నూఱు పద్యాల నియమం ఇందు పాటింపఁబడలేదనుట సారాంశం. తక్కిన శతక లక్షణాలన్నీ యథోచితంగా ఇందు గోచరిస్తాయి. ప్రతి పద్యం వస్తు - పాత్ర - రచనాశిల్పాలతో నలరారుతూ రసభరితమై విరజిల్లుతూ ఉంటుంది.

ఆంధ్రవాఙ్మయంలో శతకరచనకున్నంత ప్రచుర ప్రచారం తక్కిన సాహిత్య ప్రక్రియలకు లేదని చెప్పడం అతిశయోక్తిగాదు. సంస్కృతంలో శతకాలు అనేకాలున్నా, వానిలో మకుటాలంకృత శతకాలు అరుదనే చెప్పాలి. కవి భావాలు గానీ, ఆత్మీయతాముద్రగానీ నేరుగా శతకంలో ప్రత్యక్షమైనట్లు తక్కిన దృశ్య శ్రవ్యకావ్యాదులలోగానేరదు. వానిలో పాత్రమూలంగా కొంత గోచరించినా అందు స్పష్టత ఉండదు. అందువలన ఆత్మీయతాభావాన్ని వికసింపఁజేయుడానికే శతకరీతిని కవులు చేపట్టారని చెప్పడంలో భిన్నత్వం లేదు.

తెలుఁగులో శతక వ్యాయానికి బీజం నన్నయ కాలానికే పడినా అది పాల్కురికి సోమన్న కాలానికి గానీ, మొలకెత్తి మొగ్గతొడగలేదు. అందువలన సోమన్న రచించిన 'వృషాధిప' శతకమే ప్రథమాంధ్ర శతకంగా విమర్శకులు గుర్తించారు. అనాటినుండీ నేటివఱకు ఆత్మీయతాముద్రకు అగ్రగామిగా నిలిచిన శతకాలు అవిచ్ఛిన్నంగా ఆంధ్ర సరస్వతి నలంకరిస్తున్నాయి. ఆ శతకాలన్నీ భక్తి - నీతి - శృంగార - వైరాగ్య భావోపేతములై యలరారుతున్నాయి. కొన్ని వ్యాజస్తుతి వ్యాజనిందా పరకములై సమాజాన్ని విమర్శించేవిగా ఒప్పతున్నాయి. మఱి కొన్ని వ్యక్తి దూషణప్రాయములైనవిగూడా ఉన్నాయి. కానీ రామాయణం లాంటి మహాకావ్యాన్ని శతకరీతుల్లో ఏ కవీ ఇంతవఱకు చెప్పినట్లు ఆధారాలు లేవు.

వేదాల తర్వాత భారత - భాగవత - రామాయణాలను పరమప్రామాణిక గ్రంథాలుగా హైందవులు భావిస్తారు. ఈ మూడు గ్రంథాల్లో రామాయణాన్ని కావ్యంగా శ్లాఘించి దానికొక ప్రత్యేక స్థానమిచ్చారు. రామాయణానికొక ప్రత్యేక స్థానమున్నట్లే దశావతారాల్లో రామావతారానికి ఒక విశిష్ట స్థానమున్నది. స్థితికారకుఁడైన శ్రీరాముఁడు మానవలోకంలో అవతరించి సాటి మానవులనుభవించు సుఖఃదుఖాలనన్నింటినీ యనుభవించి, (ఒకటి రెండు అంశాలలోఁదప్ప) అతీంద్రియశక్తుల నేమాత్రం ప్రదర్శింపక, ఆదర్శప్రాయుఁడై జగదభిరాముఁడనిపించుకొన్నాఁడు. ముఖ్యంగా పితృభక్తికి, గురుభక్తికి, సోదరప్రేమకు, ఆశ్రితవాత్సల్యానికి, ప్రజాభిమానమునకు, నిష్కళంకరాజ్యపాలనకు, స్నిగ్ధమైత్రికి, సత్యపరాక్రమానికి, సద్ధర్మాచరణమునకు కర్తయై భాసిల్లినాడు. అట్లగుటంజేసి రామాయణ ముదాత్తకావ్యంగానేగాక నిత్య పారాయణగ్రంథంగా గూడా ఆసేతుహిమాచలం భాసిస్తూ ఉన్నది.

ధర్మస్వరూపుడైన శ్రీరామచంద్రమూర్తిని మనసా-వాచా-కర్మణా-అనుసరించి అభినందించి ఆరాధించిన మహాత్ముడు, రామభక్తాగ్రగణ్యుఁడు, ఆంజనేయస్వామి. రామాయణంలో అనేక పాత్రాలున్నా ఆంజనేయస్వామి తారసిల్లేది మాత్రం కిష్కింధా-సుందర యుద్ధకాండాల్లో మాత్రమే. అందులకే పాఠకులు కథాశిల్పాన్ని చక్కగా అవగాహన చేసుకోవడానికి - విషయసూచిక కాండాలవారిగా వివరంగా ఁయివ్వబడింది. ఈ కావ్యానికి శ్రోతగావెలసిన ఆంజనేయఁస్వామికి, బాల-అయోధ్యారణ్యకాండములను వినిపించడం సులభంగా సాగిపోయింది. కానీ కిష్కింధాసుందరకాండాదులను విన్పించేటప్పడు రచనాపరంగా కొంత యిబ్బందినెదుర్కోవలసివచ్చింది.

రామసుగ్రీవమైత్రీసంధాతగా ఆంజనేయస్వామి కిష్కింధాకాండంలో సాక్షాత్కరిస్తాఁడు. ఆయా పాత్రల మధ్యస్థుడైన ఆ స్వామి భాషించిన భాషణములను, గావించిన కార్యకలాపములను, శ్రోతగానున్న ఆ స్వామికే వినిపించవలసి వచ్చినప్పడు రచన చాలా జాగ్రత్తగా అన్వయం తప్పకుండా చేయడం కష్టసాధ్యమే అయింది.

సుందరకాండములో గూడా అంతే! ముఖ్యంగా సుందరకాండలో ఒకే వృత్తాంతం మూడు పర్యాయాలావృత్తమౌతుంది. ఆంజనేయస్వామి సముద్రాన్ని లంఘించి - లంకలో ప్రవేశించి - లంకిణిని మర్దించి - సీతను దర్శించి - ఆమెకు రామలక్ష్మణుల యోగక్షేమాలను దెల్పి - రావణదర్శనార్థం, అశోకవనాన్ని విధ్వంసం గావించి, రాక్షసవీరులను వధించి - రావణునిగాంచి - దౌత్యమును సాగించి - లంకాదహన మొనరించి, ఉత్తరాభిముఖుఁడైవచ్చి సముద్రతీరమున

కాచుకొనియున్న జాంబవంతాదుల గలయు వఱకుగల యితివృత్తాన్ని, వాల్మీకి కవి-తొలి 58 సర్గల్లో వివరిస్తాడు.

అదే వృత్తాంతాన్ని అంగదజాంబవంతాదులకు ఆంజనేయస్వామి ముఖంగా మఱల వివరింపజేస్తాడు.

పిదప ఆ స్వామి, అంగదజాంబవంతాదులతోగూడి, రామసుగ్రీవులకడకేగి, వారికదే విషయాన్ని తెలయపరుస్తాడు.

ఇట్లు మూడు పర్యాయములుగా జెప్పబడిన ఒకే వృత్తాంతాన్ని - రచనా సౌందర్యం చెడకుండా, శ్రోతయైన ఆస్వామికి, వినిపించేటప్పడు కొంత రచనాక్లేశాన్ని చవిచూడవలసి వచ్చింది. ఏది యేమైన ఆ స్వామి కృప వలన రచన నిరాఘాటంగా నిర్విఘ్నంగా కొనసాగింది. పరిపూర్ణంగా కాకపోయినా కొంత వఱకైనా నా యీ కృషి ఫలించుచదని భావిస్తున్నాను.

వాల్మీకి రామాయణాన్ని నాటినుండీ నేటివఱకు, ఎందరో కవులు వివిధ భాషల్లో కావ్యనాటకాది బహురీతుల్లో అనువదిస్తున్నా భారతీయులు ఆదరిస్తూనే ఉన్నారు. సార్వజనీనమై, సార్వప్రాదేశికమై, సార్వకాలికమైనట్టిది రామాయణగాథ. కాబట్టి రామాయణం అజరామరమై విలసిల్లుతూ ఉన్నది.

అరిషడ్వర్గాలతో ఆరాటపడ్తూన్న నేటి సమాజాన్ని సత్పథంలో చైతన్యవంతంగా నడిపించడానికి రామాయణానికి మించిన గ్రంథమేదియున్నది? రామునికి మించిన నాయకుడు ఎవ్వడున్నాడు? సమిష్టి కుటుంబగాథావిలసితమై నాటికీనేటికీ సామాజిక స్పృహనుగల్గిస్తూ అనన్యసామాన్యంగా విరాజిల్లుతూ ఉన్న రామాయణాన్ని మఱలా వ్రాయడంలో తప్పలేదుగదా!

"కట్టి" - "కొట్టి" - "తెచ్చె" అని మూడు పదాల్లో రామాయణగాథ నతిసంగ్రహంగా చెప్పనేర్చినవారు భారతీయులు, కథకోసం కాకుండా రీతి వైవిధ్యాన్ని బట్టి మాత్రమే రామకథాకావ్యలెన్ని వచ్చినా ఎన్ని రూపాలతో నొప్పినా ఆదరిస్తున్నారు. అభిమానిస్తున్నారు ఆస్వాదిస్తున్నారని చెప్పడం సాహసం గాదు. కాబట్టి త్రివిధ శిల్పములకు నిలయమై రసభరితమైన యీ శతకరీతి పద్యాంధ్రసంగ్రహ రామాయణాన్ని సహృదయులు - తప్పక ఆదరిస్తారని అభిమానిస్తారని విశ్వసిస్తున్నాను కవిపండితుల దృష్టి - "ఏమి చెప్పినాడనుటకన్నా ఎట్లు చెప్పినాడనుట మీఁదనే' ఉంటుందనుట సత్యం! దీనినే కవితాదృష్టిగా పేర్కొంటారు.

# శతకరీతి పద్యాంధ్ర సంగ్రహరామాయణము నందలి శైలీ విన్యాసమును దెల్పుటకు కొన్ని పద్యములు

## బాలకాండము

మెరుగుల్‌జిమ్ముచు మేఘముల్ చెదరగా, మిన్వీథిపైనుండి శ్రీ
హరి సంకీర్తన మొప్పఁజేయుచు, మహాహ్లాదంబుతోఁ గూడి చూ
పరులాశ్చర్యము తోడఁజూడ, భువికిన్ బ్రహ్మర్షియౌనారదుం
డరుదెంచెన్నొకనాఁడు మించుగతి నప్పా! అంజనేయప్రభూ!

(నారదాగమనము - బాలకాండము - 4 వ పద్యము)

"ప్రణతక్ష్మాప సమర్పితోత్తమ మహోవాజి ద్విపేంద్రంబులన్
గణుతింపన్ దరమౌనె? శేషునకు, లెక్కన్‌బెట్టఁగావచ్చునే?
కనియాస్రష్టకునైన" నంచు బుధులుత్కర్షాద్భుతస్వాంతులై
వినఁ బేర్కొందు రయోధ్యవైభవము దీప్తిన్నాంజనేయప్రభూ!

(అయోధ్యానగరవర్ణనము - బాలకాండము 33 వ పద్యము)

## అయోధ్యాకాండము

"చతురంభోధి పరీతభూతలము భాస్వద్రీతిఁబాలించి - సం
స్తుతులన్‌గొంటిని, భాస్కరాన్వయము సంతోషంబుతోనొప్ప, స
న్మతులన్‌బుత్రులగంటి, సౌఖ్యములతో మాన్యుండనైయుంటి, భూ
పతులున్‌గొల్వఁగ, నంచు"నెంచె నృపుఁడప్పా! అంజనేయప్రభూ!

(దశరథుని ఆత్మగతము-అయోధ్యాకాండము - 3 వపద్యము)

"అలుగన్నేటికి? ప్రేయసీ! తగునె! నీవావ్యాయతన్‌వీడఁగా,
జలజాక్షీ! దయతోడఁగన్గొనుము నాస్వాంతంబురంజిల్లఁగా,
కలకంఠీ! వచియింపవే! మధువులొల్కంగాఁ బ్రియాలాపముల్
వలదీకోపమ"టంచుఁబల్కె విభుఁడప్పా! అంజనేయప్రభూ!

(దశరథుడు కైక ననునయించుట - అయోధ్యాకాండము - 54 వపద్యము)

## అరణ్యకాండము

"తెరవా! యెవ్వతెవీవు? సంయములతో దీక్షోల్లసద్వృత్తిమై,
కరముగ్రాటవినున్న మమ్మునిటులన్, గామింపఁగాఁజెల్లునే!,
సరిగాదెన్నగ, నీప్రదేశమున సంచారంబుగావించుటల్,
త్వరగా పొమ్మ"ని చెప్పెరాఘవుఁడు శాస్త్రా! అంజనేయప్రభూ!

(రాముఁడు శూర్పణఖను బ్రశ్నించుట - అరణ్యకాండము - 42 వ పద్యము)

చిరునవ్వుల్ దళుకొత్తునేత్రగతి నుచ్ఛేదించి యమ్మాటలన్,
"వరణీయుండవు నామనోహరుఁడ, వీభాషించుటల్మాను, మి
ద్ధరణీచక్రమునేలు రావణుని సిద్ధస్ఫూర్తిమైనేలు సో
దరి, నే శూర్పణఖంచు గాంచు"మనె నంతన్నాంజనేయప్రభూ!
(రాముఁడు శూర్పణఖను బ్రశ్నించుట - ఆరణ్యకాండము - 43 వ పద్యము

## కిష్కింధాకాండము

శిరమున్‌బట్టి మహోద్ధతిన్‌బెనఁగి, ముష్టిస్ఫారఘాతంబులన్
ధరపైబోర్లపడంగఁగొట్ట, రణదీప్తస్వాంతు సుగ్రీవునిన్ -
కరముద్రేకముతోడ లేచి, యతఁడుగ్రస్ఫూర్తిమైఁగ్రుమ్మఁడే!
యురమున్‌జిట్లఁగ, వాలినయ్యెడల, శంభూ! ఆంజనేయప్రభూ!

(వాలి సుగ్రీవుల మల్లియుద్ధము - కిష్కింధాకాండము 69 వ పద్యము)

హతునిన్ వల్లభునార్తిమైఁగనుచు "నాథా! ప్రాణముల్‌బాసితే!
హితమున్ దెల్పఁగ గీటుబుచ్చితివి, నూరేళ్ళింతలో నిండెనే!
పతితుండైతివె! హీనశౌర్యగతి, సద్భావప్రకారాప్తి నీ
సుతునిన్‌జూడు"మటంచు నేడ్చెఁగద! యచ్చోనాంజనేయప్రభూ!

(తారావిలాపము - కిష్కింధాకాండము - 81 వ పద్యము)

## సుందరకాండము

అరయన్నేర్తు - హిమాచలాభముల నభ్రౌన్నత్యసంఘర్షణా
భరసంపన్నతరంగసంహతుల - ద్వద్వక్షఃప్రహారాప్తి న
స్థిరసారంబులుగానొనర్చి - పరమోత్తేజంబుతో లంకకున్
శరవేగంబున సాగునిన్ను - సుగుణేశా! ఆంజనేయప్రభూ!

(సాగరలంఘనము - సుందరకాండము - 7 వ పద్యము)

వరపీనస్తములన్, సమున్నత నితంబాభోగ రంభోరులన్-
సరసాలోలమనోహరాక్షుల - శరచ్చంద్రాస్యలన్ - రావణే
శ్వరు శుద్ధాంతమునందు గాంచియు, హరీశా! భూమిజాన్వేషణా
పరసంకల్పముఁగల్గెనే? మదిని - దేవా! ఆంజనేయప్రభూ!

(అంతఃపుర సందర్శనము - సుందరకాండము - 19 వ పద్యము)

"అసువుల్‌బాసెనో? సాగరానబడి - యాహారంబుగా రాక్షసుల్
కసితోమ్రింగిరో? క్ష్వేళమున్ దినెనో? లంకాపట్టణంబంత నే
వసతుల్ - చెర్వుల - బావులన్ వెదకితిన్ - వైదేహి కన్పింపదే!
యసలీజన్మమదేల?" యంచనవె! దేవా! ఆంజనేయప్రభూ!

(హనుమద్విషాదము - సుందరకాండము - 25 వ పద్యము)

నతులయ్యా! రఘురామచంద్ర! నుతులన్నా! లక్ష్మణార్య! లన
న్నతులమ్మా! పృథివీతనూజ! ప్లవగేంద్రా! వందనంబంచు స
న్మతిపై పూజ్యులకెల్ల జోతలిడి, సంతాపంబుఁ బోద్రోలి - చి
న్మతివైపోవె! యశోకకనిష్కుటము చెంతన్నాంజనేయప్రభూ!

(పునఃప్రయత్నావసరమున నమస్క్రియ - సుందరకాండము - 28 పద్యము)

"నను గుర్తింపఁగ నిచ్చిపంపె - నిదిగో! నా దేవుండు రాముండు దీ
వెనతోడన్ - భవదీయచిత్తనళినప్రేమార్కమున్ - దివ్య పా
వన పాణిగ్రహణోల్లసత్తకర సంపర్కాంగుళీ భూషణం"
బని చూపింపవే! సీతకున్‌దెలియ - దేవా ఆంజనేయప్రభూ!

(అంగుళీయకప్రదానము - సుందరకాండము - 77 వపద్యము)

తనయార్తిన్ వచియించి - రాఘవులసంతాపంబులోనెంచి - బో
రనరోధించి - యిలాతనూజ మనసారన్ మ్రొక్కులర్పించి రా
మునకున్ దానొసగెన్ శిరోమణిని, సంపూర్ణార్ద్ర చిత్తంబుతో
తన చిహ్నంబుగ - నీవు కోరఁగ, మహాత్మా! ఆంజనేయప్రభూ!

(చూడామణిప్రదానము - సుందరకాండము - 91 వపద్యము)

క్షితిజన్ గాంచినరీతిఁగాఁ దలఁచె నక్షీణప్రకారోన్నతిన్
మతిమంతుండగు రామచంద్రుడు శిరోమాణిక్యసందర్శియై,
సతివక్షంబునఁ జేర్చుకొన్నగతి నాశ్వాసిల్లె - చూడామణిన్
తతరాగంబునఁదాల్చి పొమ్మున - కపీంద్రా! ఆంజనేయప్రభూ!

(శ్రీరామ సమాశ్వాసము - సుందరకాండము - 297 వ పద్యము)

ఇట్లు
సరసకవితాభిమాని
శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణగ్రంథకర్త

**పి.వి. శ్రీనివాసమూర్తి**
ఆంధ్రశాఖాధ్యక్షుఁడు (రిటైర్డ్)
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల, తిరుపతి - 517 501.

నివాస విలాసము
18-2-192,
శ్రీ శారదానిలయము,
అశోకనగర్, తిరుపతి
ఫోన్ : 54885

# నివేదన

## శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారు

సంస్కృత శాఖాధ్యక్షులు (రిటైర్డ్)
శ్రీ వేంకటేశ్వరప్రాచ్య కళాశాల మరియు
టి.టి.డి. ధర్మప్రచార పరిషత్ కార్యదర్శులు (Ex.) తిరుపతి.

అద్వితీయ కావ్యరాజమైన రామాయణమునకు సాటిరాదగిన మరొక కావ్యం విశ్వసాహిత్యంలో ఇంతవరకూ జన్మించలేదనడం అక్షరశః సత్యం. కాళిదాసాది కవులలందరూ ఆదికవి వాల్మీకి ననుసరించినవారే. ఒక్క రామచరిత్రమేకాక ఇతర చరిత్రలను వస్తువులుగా పరిగ్రహించిన కవివర్యులు సైతం వాల్మీకి అడుగుజాడలోనే నడచి కృతకృత్యులైనారు.

వేదమే రామాయణంగా అవతరించిందని అభిజ్ఞులమాట. వేదం ధర్మమూలమైనట్లే రామాయణం కూడ సకల ధర్మాలకూ నిలయమై వెలుగొందుతున్నది. ధ్వనిప్రధానమైన కావ్యంగా, నీతిబోధకమైన ధర్మశాస్త్రంగా, రసవత్తరమైన రచనగా రామాయణం సుప్రతిష్ఠితమయింది.

రామచరిత్ర బహుభాషల్లోకి అనువదింపబడింది. బహు పద్ధతులలో చిత్రింపబడింది. బహుజనులు దానిని అనుసంధానం చేస్తున్నారు. ఇలా రామాయణ ప్రశస్తి దినదినానికీ పెరుగుతూనే ఉన్నది.

యావత్ స్థాస్యన్తి గిరయః సరితశ్చ మహీతలే ।
తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి ॥

కొండలూ, నదులూ భువిపై ఉన్నంతకాలం రామాయణకథ లోకంలో ప్రచారంలో ఉంటుందని బ్రహ్మనుడివాడు. ఇక మన బోంట్లు దాని ప్రశస్తిని గురించి చెప్పవలసినదేమున్నది?

“ఉదారచరితనిబంధనా ప్రబంధ ప్రతిష్ఠా” అని ఆలంకారికుల మాట. కావ్యప్రతిష్ఠ అందులో వర్ణించబడే నాయకుని గొప్పతనంపై ఆధారపడివుంటుంది. దశరథ పుత్రుడు మూర్తీభవించిన ధర్మమే. ఆయన సకలకల్యాణగుణ నిలయుడు. కథానాయకుడైన రాముడేకాక సీత, భరతుడు, లక్ష్మణుడు హనుమంతుడు, విభీషణుడు మొదలైన రామాయణ పాత్రలన్నీ ఉత్తమగుణభూషితాలే. ప్రతి నాయకుడైన రావణునిలో సైతం ఎన్నో విశిష్టగుణాలు లేకపోలేదు. అందువల్లనే వీరిని వర్ణించే ఆ మహాకావ్యం నిరుపమాన ప్రతిష్ఠానిలయమై వెలుగొందింది.

రామాయణమూలకాల్లైన రచనలు కోకొల్లలు. ప్రాచీనకాలంలోనేగాక నేటికీ వెలువడుతున్నాయి. అలాంటి కృతులలో 1994లో ఆంధ్రమున శతకరీతి పద్యానువాదరూపంలో వెలువడిన 'సుందరకాండము' ఒకటి. ఈ కావ్యరచయిత ఆత్మీయులు శ్రీ పి.వి. శ్రీనివాసమూర్తిగారు. వీరు హనుమదుపాసకులు. అందువల్ల హనుమంతుడు ప్రాముఖ్యం వహించిన సుందరకాండఘట్టాన్ని వస్తువుగా పరిగ్రహించి 302 పద్యాలలో పరమ రమణీయంగా రచన సాగించారు. పైగా ఆ పద్యాలన్నీ మత్తేభవృత్తాలలోనే సాగాయి. 'ఆంజనేయప్రభూ!' అన్న సంబోధనతోనే ముగిశాయి. ఆంజనేయుణ్ణి సంబోధిస్తూ ఆంజనేయ ప్రధానమైన కథాభాగాన్ని పద్యీకరించిన తీరు శతకరచనా ప్రక్రియను స్మరింపజేయడమేకాక పలువురు సహృదయులకు విస్మయాపాదకమయింది. 'ఇదొక క్రొత్త ప్రక్రియ' అని అందరూ వింతగా ఆ రచనను ఆదరించారు.

శ్రీనివాసమూర్తి గారు వాఖ్యానములగా, విమర్శనగ్రంథాలుగా, కావ్యములుగా, శతకములుగా - మొత్తంమీద ఇంచుమించు చిన్నవీ, పెద్దవీ 30 రచనలు చేశారు. 'ఉన్నమాట వినర చిన్నవాఁడ!', 'కాకారాయా!' 'ఆకాశారామన్నరో!' అన్న మకుటాలతో లోక వృత్తాన్ని చిత్రించే శతకాలను రచించి 'సెబాస్', అని రసజ్ఞుల మన్ననలందుకున్నారు. పైవానిలో ఇంచుమించు 10 రచనలు వెలుగుచూచాయి.

నాటి సుందరకాండరచన వారిలో రామాయణగాథనంతా 'ఆంజనేయప్రభూ'! అన్న మకుటంతోనే ఏల చెప్పరాదు? అన్న ఔత్సుక్యం కల్గించింది. అది క్రమేణ వృద్ధి బొంది కార్యరూపం దాల్చింది. ఆ ఔత్సుక్యఫలమే ప్రస్తుతం పాఠకుల కరకమలాల నలంకరిస్తున్నా "శతకరీతి పద్యాంధ్ర సంగ్రహరామాయణము". ఇందులో శార్దూలాలూ, మత్తేభాలూ పోటీబడి విజృంభించాయి.

బాలకాండంలో 281, అయోధ్యాకాండలో 230, అరణ్యకాండలో 216, కిష్కింధాకాండలో 196-మొత్తం అంతవరకూ 923 పద్యాలయ్యాయి. ముందే వెలువడిన సుందర కాండంలోని 302 పద్యాలను కలుపుకొంటే మొత్తం 1225 పద్యాలు. ఈ సంపుటంలో కిష్కింధాకాండం వరకే కథాభాగం సంగ్రథితమైంది. ఇక యుద్ధకాండ రావలసివున్నది. కవిగారు తద్రచనలో నిమగ్నులైవున్నారు. అదీ పూర్తి అయితే సుందర యుద్ధకాండాలు రెండూ మరొక సంపుటిగా అవతరిస్తుంది. మొత్తం ఇంచుమించు 15 వందల పద్యాలలో రామాయణగాథ రసరమ్యమై రూపొందుతుంది.

పద్యనిర్మాణం గగనకుసుమమైన రోజులివి. కవులందరూ వచనకవితలు వెలయిస్తున్న కాలమిది. పైగా పద్యకవులను చిన్నచూపు చూచే ప్రబుద్ధులు గూడా కొందరు తయారైనారు. జాషువా, జంధ్యాల వంటి ఏ ఒకరిద్దరో తప్ప పద్యనిర్మాణంతో ఆధునిక పాఠకులను రంజింపజేసినవారు దాదాపు లేరనే చెప్పవచ్చు. ఈ పరిస్థితిలో మా శ్రీనివాసమూర్తిగారు ఒక్క పెట్టున రామాయణాన్నంతా శతకరీతి పద్యాలలో బంధింపబూనుకోవడం సాహసమే. అయినా అవధులుమీరిన ఉత్సాహంతో వయసు పైబడుతున్నా లెక్కచేయకుండా వాలీపని విజయవంతంగా నిర్వహించడం

అప్రతిహతమైన వారి ఆత్మవిశ్వాసాన్ని - హనుమద్భక్తినీ - వ్యక్తం చేస్తున్నది. ఈలాంటి రచనలతో అర్థార్జన చేసేవారు ఈ రోజుల్లో లేనేలేరు. పైగా ముద్రణకు రచయితలే ధనవ్యయం చేయవలసి వుంటుంది. అయినా ఆత్మతృప్తికోసం, జీవితమంతా, అధ్యయనం కావించిన సారస్వతం ఈ విధంగా ఫలప్రదంకావడంకోసం శ్రీనివాసమూర్తిగారు ఈ నిర్మాణానికి ఉపక్రమించారు.

రచనా సందర్భంలో పలుపర్యాయాలు నాకు పద్యాలు వినిపించారు. మేమిరువురమూ ప్రాచ్యకళాశాలలో సహాధ్యాయులమేగాక, సహోపాధ్యాయులం గూడా. బాల్యంను ... కవి ... చి గల మా మిత్రులలో శ్రీ మూర్తిగారు అగ్రగణ్యులు. అందువల్ల వీరి రచనను నేను సావధానంగా విని అవసరమైన చోట పద బంధాలలో ఔచిత్యాన్ని చర్చిస్తూ, కావ్యగోష్ఠి ... కొన్నాము. అదొక మరపురాని దివ్యానుభూతి.

శ్రీరామజననా... తరం ... ని వర్ణిస్తూ

అమరేం...దులు చింతవీడి పరమాహ్లాదంబుతో నొప్పచున్ -
దమ... ...ఘువంశదీపకునిపై ధర్మోన్నతిన్నిల్పి రు
త్తమవిద్వాంసు మనోజ్ఞచిత్తమువలెన్ ధాత్రీతలంబొప్పె - నా
గముల్లెల్లన్దలయూచి యాడినవి వీ(కన్నాంజనేయప్రభూ! (బాల 117)

నగముల్లేచి ప్రమోదవృత్తిమెరయన్ నాట్యంబులన్సల్పె - ప
న్నగ గోబృందములెల్లనాడినవి సంతోషంబు(దైవార - చె
న్నగ సంద్రంబులు వాహినుల్గలసి( జిందుల్ద్రొక్కె( దాశోన్నతిన్ -
ఖగముల్వృక్షములుల్లసిల్లినవి - వీ(కన్నాంజనేయప్రభూ! (బాల 118)

అని శ్రీమూర్తిగారు వ్రాశారు. ఈ రీతిగానే ఆయా ఘట్టాలలో పద్యాలు హృద్యంగా, ఉదాత్తమైన శైలిలో హుందాగా సాగిపోయాయి.

రామకథను ఇతివృత్తంగా తీసుకొనడంలోనే ఎంతో ఔచిత్యమున్నది. దానిని అనాదిగా వచ్చిన పద్యరచనతో జోడించడం బంగారానికి తావి అబ్బినట్లయింది. శతకరీతిలో ఆ పద్యాలను నడపడం పైపెచ్చు దానికి మెరుగుబెట్టినట్లయింది. ఆంజనేయుణ్ణి సంబోధిస్తూ ప్రబంధాన్నంతా నిర్వహించడం రామాయణమహామాలారత్నదీప్తిని లోకానికి ప్రసరింపజేసినట్లయింది.

ఇంత మంచి పని చేసి సాహిత్యజగత్తులో శాశ్వతస్థానం సంపాదించుకొన్న మిత్రమణిని ఏమని శ్లాఘించాలో గోచరించడంలేదు. ఈ సుహృద్వర్యుణ్ణీ, ఈయన మైత్రినీ, ఈ కవితనూ, హృదయంలో చెరిగిపోకుండా పదిలపరచుకొంటూ విరమిస్తాను.

**సముద్రాల లక్ష్మణయ్య,** తిరుపతి

# కృతజ్ఞతాంజలి

శ్రీముఖిస్ఫూర్తితో వచ్చిన వైశాఖమాసంలో ప్రారంభమైంది - ఈ శతకరీతి పద్యాంధ్ర సంగ్రహరామాయణము. దానిలోని సుందరకాండం - తొలుదొల్త వెలుగుచూచింది. సహృదకవిపండితుల హృదయాల నలరించింది. మిత్రవరేణ్యుల ప్రోత్సాహంతో-బాల - అయోధ్యా - అరణ్య కిష్కింధా కాండములు గూడా, ఇప్పుడు ముద్రణకు నోచుకున్నాయి. ఇక యుద్ధకాండము రచింపఁబడియున్నది.

అనువదించేటప్పడే ప్రతి కాండమునందలి ప్రతిఘట్టమును విని మిక్కిలి ప్రోత్సహించిన నాకా బాల్యం మిత్రులునూ *విద్వచ్ఛిరోమణులైన శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారికి - ఆచార్య కె. సర్వోత్తమరావు గారికి, ఆత్మీయులును, సాహితీబంధువులైన సహస్రావధాని మేడసాని మోహన్‌గారికి, గురువర్యులైన శ్రీమాన్ ఎన్.సి.వి. నరసింహాచార్యుల వారికి, శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి,* ఇష్టట్టుల మనఃపూర్వాకాభివందనములను సమర్పిస్తున్నాను.

ఈ గ్రంథాన్ని అచ్చుగానించునప్పుడు మిక్కిలిశ్రద్ధతో పరిశీలించి అచ్చుతప్పులు రాకుండా ప్రూపులు దిద్ది యిచ్చి సహకరించిన నా మిత్రవరేణ్యులును, కవిమాన్యులైన *శ్రీ యజమాసుల సుబ్రహ్మణ్యంగారికి* హృదయపూర్వక నమస్కారముల నర్పిస్తున్నాను.

ఈ శతకరీతి పద్యాంధ్ర సంగ్రహరామాయణ గ్రంథానికి సూర్యావలోకనప్రాప్తి గల్గించుటకు వలసినంత ఆర్థిక సహాయం గావించిన *శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల యాజమాన్యంవారికి, కార్యనిర్వాహణాధికారులగు శ్రీ పి. కృష్ణయ్య ఐ.ఎ.ఎస్. గారికి వారి* పరివారమునకు కృతజ్ఞతలు దెలుపుకొంటూ అభివందనములనర్పిస్తున్నాను.

అభిమానంతో ఈ "శతకరీతి పద్యాంధ్ర సంగ్రహరామాయణాన్ని" సర్వాంగ సుందరంగా అచ్చొత్తించి యిచ్చిన *సి.యన్. ప్రింటర్స్ యజమానులకు* వారి సిబ్బందికి కృతజ్ఞతలను తెలియజేసుకొంటున్నాను.

నాకు కావ్యరచనా సామర్థ్యమునుగల్గించి నన్ను కంటికి రెప్పవలె బ్రోచునట్టి మా కులదైవమైన యేడుకొండలస్వామిని మనస్ఫూర్తిగా స్తుతిస్తూ యిప్పట్టుల హృదయాంజలిని ఘటిస్తున్నాను.

సరసకవితాభిమాని

శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణగ్రంథకర్త

**పి.వి. శ్రీనివాసమూర్తి**

తిరుపతి

చిత్రభాను సంవత్సరాది

13-4-2002

శ్రీవాణీ ప్రసన్నాభవతు

# శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణము

## (వాల్మీకి రామాయణమునకు సంగ్రహానువాదము)

## బాలకాండము

### విషయసూచిక


| విషయము | | పుటల సంఖ్య | పద్యముల సంఖ్య |
|---|---|---|---|
| 1. | ప్రార్థన | 1 | 1 |
| 2. | వాల్మీకులవారి యాశ్రమము | 1 | 2-3 |
| 3. | నారదాగమనము | 1-2 | 4-5 |
| 4. | నారద వాల్మీకుల సంభాషణము | 2 | 6-9 |
| 5. | నారదాభిభాషణము | 3 | 10-11 |
| 6. | సచ్ఛాత్రుఁడై వాల్మీకి తమసానదికేగుట | 3 | 12-13 |
| 7. | వ్యాధుని వాల్మీకి మందలించుట | 3-4 | 14-16 |
| 8. | బ్రహ్మసాక్షాత్కరించి కొనియాడుట | 4 | 17-19 |
| 9. | వాల్మీకి రామాయణరచనకుపక్రమించుట | 5 | 20-22 |
| 10. | కుశలవులు రామాయణగాథనాలపించుట | 5 | 23-26 |
| 11. | భానుకుల ప్రశస్తి | 5-6 | 27-30 |
| 12. | అయోధ్యా నగరవర్ణన | 7-8 | 31-37 |
| 13. | కోసల రాజేంద్రులు | 8-9 | 38-40 |
| 14. | దశరథ మహారాజ వివాహము | 9 | 41-43 |
| 15. | దశరథుని రాజ్యపాలనము | 9-10 | 44-47 |
| 16. | రాజదంపతులు పుత్రార్థులై తపించుట | 10-11 | 48-52 |
| 17. | ఆప్తులు దశరథునోదార్చుట | 11-12 | 53-56 |
| 18. | దశరథుఁడు అశ్వమేధయాగ మొనరించుటకు నిశ్చయించుట | 12-13 | 57-60 |
| 19. | దేవేరులామోదించుట | 13 | 61-63 |
| 20. | ఋష్యశృంగముని వృత్తాంతమును మంత్రిదెల్పుట | 13-14 | 64-67 |

| | | | |
|---|---|---|---|
| 21. | దశరథుఁడు ఋష్యశృంగముని నాహ్వానించుట | 14 | 68-69 |
| 22. | అశ్వమేధయాగము | 15-19 | 70-90 |
| 23. | దశరథుఁడు పుత్రకామేష్టిఁచేయుట | 19-21 | 91-102 |
| 24. | రావణాసురుని విజృంభణము | 21-22 | 103-109 |
| 25. | రాణులు పుత్త్రులఁగనుట | 23-25 | 110-121 |
| 26. | వానరవీరులు జన్మించుట | 25-26 | 122-126 |
| 27. | జాతకర్మాదికము | 26-28 | 127-138 |
| 28. | విశ్వామిత్రాగమనము | 28-29 | 139-144 |
| 29. | విశ్వామిత్రుఁడు యాగరక్షణార్థమై రామలక్ష్మణులఁ గోరుట | 30 | 145-147 |
| 30. | దశరథుఁడు విచారించుట | 30-32 | 148-158 |
| 31. | విశ్వామిత్రునిలో రామలక్ష్మణులఁబంపుట | 32-33 | 159-163 |
| 31. | కౌశికుఁడు వివిధాశ్రమములగూర్చిదెల్పుట | 33-34 | 164-167 |
| 32. | చంద్రోదయ వర్ణన | 34-35 | 168-170 |
| 34. | సూర్యోదయ వర్ణన | 35 | 171-174 |
| 35. | విశ్వామిత్రుఁడు తాటకమారీచసుబాహుల వృత్తాంతంబుల దెల్పుట | 36 | 175-179 |
| 36. | తాటకను వధింపుఁడని విశ్వామిత్రుఁడాపిజ్ఞాపించుట | 37-38 | 180-187 |
| 37. | మారీచ సుబాహులఁబ్రహరించుట | 38-40 | 188-197 |
| 38. | విశ్వామిత్రుడు రామాదులతో మిథిలకుజనుట | 40-41 | 198-203 |
| 39. | విశ్వామిత్రుఁడు స్వీయచరిత్రాదులను దెల్పుట | 41-42 | 204-209 |
| 40. | విశ్వామిత్రునికి జనకుఁడాతిథ్యమునిచ్చుట | 43-44 | 210-215 |
| 41. | శతానందుఁడు విశ్వామిత్రుని వృత్తాంతముఁదెల్పుట | 44-47 | 216-233 |
| 42. | శివకోదండగాథను జనకుఁడు వినిపించుట | 47-48 | 234-237 |
| 43. | సీతాస్వయంవరము | 48-51 | 238-251 |
| 44. | రామభరత లక్ష్మణ శత్రుఘ్నుల వివాహము | 51-53 | 252-263 |
| 45. | బంధుజనంబునకు వీడ్కోలు | 53-54 | 252-263 |
| 46. | దశరథుఁడయోధ్యకుఁదరలుట | 54 | 266-267 |
| 47. | పరశురాముఁడడ్డగించుట | 54-55 | 268-271 |
| 48. | వశిష్ఠమహర్షి పరశురాముని శాంతింపఁజేయుట | 55 | 272-274 |
| 49. | భార్గవరాముఁడు శ్రీరామునెఱుంగుట | 56 | 275-277 |
| 50. | దశరథుఁడయోధ్యఁజేరుట | 56-57 | 278-280 |
| 51. | కవి ప్రస్తావన | 57 | 281 |




శ్రీవాణీ ప్రసన్నాభవతు

# శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణము

## (వాల్మీకి రామాయణమునకు సంగ్రహానువాదము)

## అయోధ్యాకాండము

### విషయసూచిక


| | విషయము | పుటల సంఖ్య | పద్యముల సంఖ్య |
|---|---|---|---|
| 1. | ప్రార్థన | 58 | 1 |
| 2. | దశరథుఁడు శ్రీరామునకుఁ బట్టాభిషేకముఁజేయ సంకల్పించుట | 58-59 | 2-6 |
| 3. | దశరథుఁడు శ్రీరామునిఁ బిలిపించుట | 59 | 7-9 |
| 4. | పట్టాభిషేక విషయంబును రామునితో దశరథుఁడు చెప్పుట | 60-61 | 10-16 |
| 5. | దశరథుఁడు పట్టాభిషేకావసరమును నిర్దేశించుట | 61-62 | 17-24 |
| 6. | శ్రీరామ పట్టాభిషేక సంరంభము | 63-64 | 25-33 |
| 7. | కైకకు మంథర దుర్బోధగావించుట | 64-68 | 34-51 |
| 8. | కైకయలుఁగుట - దశరథుఁడనునయించుట | 68-69 | 52-55 |
| 9. | కైక వరద్వయంబును గోరుట | 69 | 56-57 |
| 10. | కైక వరద్వయంబును, విని దశరథుఁడు దురపిల్లుట | 69-70 | 58-63 |
| 11. | పట్టాభిషేక సంరంభము - రామునియాగమనము | 70-71 | 64-67 |
| 12. | రాముఁడు కైక భవనమునకేగి పరిస్థితిఁగనునించుట | 71-72 | 68-71 |
| 13. | వరద్వయమునుగూర్చి కైకరామునికిఁదెల్పుట | 72-73 | 72-79 |
| 14. | కైక భవనమువీడి, రాముఁడు కౌసల్య కడకేగుట | 74 | 80-81 |
| 15. | కైక వరద్వయంబును విని కౌసల్యవ్యథఁజెందుట | 74-75 | 82-86 |
| 16. | కైక వరద్వయంబు విని లక్ష్మణాఁడాగ్రహించుట | 75 | 87-88 |
| 17. | కౌసల్య తత్త్వోపదేశము | 75-76 | 89-92 |
| 18. | రాముని యుపదేశము | 76-77 | 93-95 |
| 19. | రాముని కడకు సీతాదేవివచ్చుట | 77 | 96-99 |

| | | | |
|---|---|---|---|
| 20. | వనవాసక్లేశమును రాఘవుఁడు సీతకుఁదెల్పుట | 78 | 100-102 |
| 21. | లక్ష్మణుఁడూర్మిళ నోదార్చుట | 78-79 | 103-106 |
| 22. | లక్ష్మణుఁడు వనమునకు వత్తునని రామునికిఁదెల్పుట | 79 | 107-108 |
| 23. | సీతారామలక్ష్మణులు వనంబునకేగుట | 79-81 | 109-115 |
| 24. | సీతారామలక్ష్మణులు తమసానదినిఁజేరుట | 81 | 116-117 |
| 25. | గుహుఁడను శబరభక్తుఁడు రామునిగాంచుట | 81-82 | 118-121 |
| 26. | పౌరులను రాముఁడు వీడుకొల్పుట | 82 | 122-123 |
| 27. | రాముఁడు గుహునివీడుకొల్పుట | 82 | 124-125 |
| 28. | సీతారామలక్ష్మణులు చిత్రకూటముఁజేరుట | 83 | 126-129 |
| 29. | రాముఁడు గంగాతీరమును జేరుటను దశరథునకు బౌరులు దెల్పుట | 84-85 | 130-135 |
| 30. | పూర్వపు మునిశాపమును దశరథుఁదెల్పుట | 85-88 | 136-154 |
| 31. | దశరథుని మరణము | 89-90 | 155-163 |
| 32. | కైక భరతుని బిల్వనంపుట | 90-91 | 164-169 |
| 33. | జనకుని మరణోదంతమునువిని భరతశత్రుఘ్నులు విలపించుట | 92-93 | 170-175 |
| 34. | భరుతుఁడు పట్టాభిషేకమును నిరాకరించుట | 93-94 | 176-181 |
| 35. | భరతుఁడు తండ్రికి నుత్తరక్రియలు గావించుట | 94-95 | 182-187 |
| 36. | మంత్రులు రాజ్యముఁ జేపట్టమని భరతునిఁ బ్రార్థించుట | 95-96 | 188-191 |
| 37. | భరతాదులను గుహుఁడు గాంచుట | 96-97 | 193-195 |
| 38. | గుహుఁడు భరతాదుల గంగను దాటించి చిత్రకూటగిరికిఁ జేర్చుట | 97 | 196-198 |
| 39. | శ్రీరాముఁడు భరతాదులఁగాంచుట | 97-98 | 199-200 |
| 40. | జనకుని మరణ వృత్తాంతమును భరతుఁడు రామాదులకుఁ దెల్పుట | 98 | 201-204 |
| 41. | రామలక్ష్మణులు తండ్రికి ఁదిలోదాకాదుల నర్పించుట | 99 | 205-206 |
| 42. | సూర్యోదయ వర్ణన | 99 | 207 |
| 43. | భరతుఁడు శ్రీరామచంద్రు నయోధ్యకు నాహ్వానించుట | 99 | 208-209 |

| | | | |
|---|---|---|---|
| 44. | శ్రీరాముఁడు వనవాసవ్రతమాచరించి అయోధ్యకు వత్తునని చెప్పుట | 100 | 212-214 |
| 45. | వరపాదుకలనిచ్చి భరతుని కోర్కెఁదీర్పమని వసిష్ఠుఁడు వచించుట | 100 | 212-214 |
| 46. | శ్రీరాముని పాదుకల భరతుఁడయోధ్యకుఁ గొనిపోవుట | 101 | 215-217 |
| 47. | పాదుకాపట్టాభిషేకము | 101 | 218-219 |
| 48. | జనస్థానమున ఖరుఁడు విజృంభించుట | 102-103 | 220-221 |
| 49. | అత్రిమునీంద్రుని రాముఁడు సేవించుట | 102 | 222-225 |
| 50. | అనసూయ సీతాకల్యాణమును వినఁగోరుట | 103 | 226-227 |
| 51. | చంద్రోదయ సూర్యోదయవర్ణనలు | 103-104 | 228-229 |
| 52. | కవి ప్రస్తావన | 104 | 230 |



శ్రీవాణీ ప్రసన్నాభవతు

# శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణము

## (వాల్మీకి రామాయణమునకు సంగ్రహానువాదము)

## ఆరణ్యకాండము

### విషయసూచిక


| విషయము | పుటల సంఖ్య | పద్యముల సంఖ్య |
|---|---|---|
| 1. ప్రార్థన | 105 | 1 |
| 2. సీతారామ లక్ష్మణుల వనవాసము | 105-106 | 2-5 |
| 3. విరాధుని శాపవిముక్తి | 106-107 | 6-13 |
| 4. శరభంగమహర్షి దర్శనము | 107-108 | 14-15 |
| 5. సుతీక్ష్ణమునివరుని గాంచుట | 108-109 | 16-21 |
| 6. మందకర్ణి మహామునిచరిత్ర | 109-110 | 22-27 |
| 7. అగస్త్య మహాముని మహాత్మ్యము | 110-111 | 28-33 |
| 8. జటాయుదర్శనము | 111-112 | 34-37 |
| 9. శూర్పణఖ తారసిల్లుట | 112-114 | 38-45 |
| 10. ఖరదూషణాదుల వధ | 114-118 | 46-65 |
| 11. అకంపనుఁడు రావణునకు రాముని వృత్తాంతముఁ దెల్పుట | 118 | 66-69 |
| 12. శూర్పణఖ రావణునకు తన పరిభవంబును దెల్పుట | 119 | 70-74 |
| 13. రావణుడు మారీచునికి శూర్పణఖ పరిభవమును దెల్పుట | 120 | 75-77 |
| 14. మారీచుఁడు రామునెదిరించుట యసాధ్యమని దెల్పుట | 120-121 | 78-82 |
| 15. మారీచుఁడు పైడిలేడియగుట | 121-122 | 83-86 |
| 16. పైడిలేడిని సీతాదేవికోరుట | 122-123 | 87-91 |
| 17. రాముఁడు మారీచుని రూపుమాపుట | 123-124 | 92-96 |

| | | | |
|---|---|---|---|
| 18. | సీతాలక్ష్మణుల సంవాదము | 124-125 | 97-100 |
| 19. | సీత లక్ష్మణుని పరుషవాక్యములాడుట | 125-126 | 101-105 |
| 20. | రాముఁడు సన్యాసి వేషంబున సీతకడకు వచ్చుట | 126 | 106-108 |
| 21. | సీతారావణ సంవాదము | 126-129 | 109-121 |
| 22. | రావణుఁడు సీతను రథంబుపై నుంచుకొనిపోవుట | 129 | 122-123 |
| 23. | సీతా విలాపము | 129-130 | 124-129 |
| 24. | జటాయువు సీతను రక్షింప రావణునితోఁబోరుట | 131-132 | 130-135 |
| 25. | జటాయువు మరణము | 132-133 | 136-140 |
| 26. | రావణుఁడు సీతను లంకలోనుంచుట | 133 | 141-144 |
| 27. | త్రిజటాది రాక్షసాంగనలు సీతను సేవించుట | 134 | 145-146 |
| 28. | వ్యామోహంబున రావణుఁడు సీతతో భాషించుట | 134 | 147-149 |
| 29. | సీత రావణుని ఛీత్కరించుట | 135 | 150-154 |
| 30. | రావణుఁడు సీతకు సంవత్సరముగడువునిచ్చుట | 136 | 155-157 |
| 31. | రాముఁడు మారీచుని సంహరించి పంచవటిఁజేరుట | 136 | 158-159 |
| 32. | రామునికి లక్ష్మణుఁడెదురుగావచ్చుట | 137-138 | 160-165 |
| 33. | లక్ష్మణుఁడు సీతను విడిచివచ్చుటకు రాముఁడు చింతించుట | 138-141 | 166-180 |
| 34. | జటాయువు సీతాదేవి వృత్తాంతమును దెల్పుట | 141-143 | 181-190 |
| 35. | రామలక్ష్మణులు కబంధునిగాంచుట | 143-144 | 191-195 |
| 36. | శాపవిముక్తుఁడై కబంధుఁడు స్వీయ వృత్తమునుదెల్పుట | 144 | 196-198 |
| 37. | కబంధుఁడు సుగ్రీవునితో మైత్రిఁజేయుమని రామునకుఁదెల్పుట | 144-145 | 199-202 |
| 38. | రామలక్ష్మణులు శబరిని గాంచుట | 145-148 | 213-216 |
| 39. | రామలక్ష్మణులు పంపాసరోవరమును గాంచుట | 147-148 | 213-216 |
| 40. | రామలక్ష్మణులు ఋష్యమూక పర్వతముఁజేరుట | 148 | 215 |
| 41. | కవి ప్రస్తావన | 148 | 216 |




శ్రీవాణీ ప్రసన్నాభవతు

# శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణము

## (వాల్మీకి రామాయణమునకు సంగ్రహానువాదము)

## కిష్కింధాకాండము

### విషయసూచిక


| షయము | పుటల సంఖ్య | పద్యముల సంఖ్య |
|---|---|---|
| ప్రార్థన | 149 | 1 |
| శ్రీరామ సుగ్రీవులకు హనుమంతుఁడు సఖ్యముఁ గూర్చుట | 149-151 | 2-11 |
| సుగ్రీవుఁడిచ్చిన భూషణంబులను రాముఁడు గనుట | 151-152 | 12-18 |
| సుగ్రీవుఁడు రామునితో నిజవృత్తాంతముజెప్పుట | 152-153 | 19-21 |
| వాలిశౌర్యమును సుగ్రీవుఁడు శ్రీరామునితో జెప్పుట | 153-154 | 22-28 |
| వాలితో శత్రుత్వము గల్గుటను రామునకు సుగ్రీవుఁడు దెల్పుట | 154-156 | 29-37 |
| శ్రీరాముఁడు సప్తతాళములఁగూల్చుట | 156-157 | 38-40 |
| వాలిసుగ్రీవుల ప్రథమ యుద్ధము | 157-158 | 41-47 |
| క్షతగాత్రుఁడగు సుగ్రీవుఁడు రామునితో నిష్ఠురోక్తులాడుట | 158-159 | 48-53 |
| సుగ్రీవుఁడు వాలితో ద్వితీయ యుద్ధముఁ జేయునేగుట | 159-160 | 54-58 |
| వాలికి ఁదార హితోపదేశంబుఁ గావించుట | 160-161 | 59-62 |
| వాలి తారకుఁ బ్రత్యుత్తరమిచ్చుట | 161-162 | 63-66 |
| వాలి సుగ్రీవుల మలిపోరు | 162-163 | 67-71 |
| వాలి రాఘవుల సంవాదము | 163-164 | 72-79 |
| తారా విలాపము | 165-167 | 80-90 |
| సుగ్రీవుఁడు వాలికి దహనకృత్యంబుల జరిపించుట | 167-168 | 91-95 |

| | | | |
|---|---|---|---|
| 17. | అంగదుని యువరాజ పట్టాభిషేకము | 168 | 96-97 |
| 18. | సీతను గూర్చి రాముఁడు చింతించుట | 168-170 | 98-106 |
| 19. | సుగ్రీవుఁడు రాకుండుటకు రాఘవుఁడు చింతించుట | 170-171 | 107-110 |
| 20. | సీతాన్వేషణార్థము వివిధ దిక్కులకు సుగ్రీవుఁడు వానరవీరులను బంపుట | 171-174 | 111-125 |
| 21. | సీతను గానక అంగదాదులు చింతించుట | 174 | 126-127 |
| 22. | హనుమజ్జాంబవంతాదులు స్వయంప్రభ గుహలో బ్రవేశించుట | 174 | 128-129 |
| 23. | స్వయంప్రభ తన వృత్తాంతముఁదెల్పుట | 175-176 | 130-136 |
| 24. | సీతనుగానక అంగదాదులు చింతించుచుఁ బ్రాయోపవేశమునకుఁ బూనుట | 176-177 | 137-142 |
| 25. | ప్రాయోపవిష్టులైన హనుమదాదుల కడకు సంపాతి వచ్చుట | 177-178 | 143-148 |
| 26. | వానరులకు సంపాతి తన వృత్తాంతముఁ జెప్పుట | 178-180 | 149-157 |
| 27. | వీరవానరులు దక్షిణ సముద్రతీరముఁ జేరుట | 180-182 | 158-167 |
| 28. | జాంబవంతుఁడు తనశక్తిని దెల్పుట | 182-183 | 168-170 |
| 29. | నలుఁడు నిజశక్తిని వక్కాణించుట | 183 | 171 |
| 30. | అంగదుండు తన సామర్థ్యమును వచించుట | 183 | 172-174 |
| 31. | జాంబవంతుఁడు హనుమంతుని కొనియాడుట | 184-185 | 175-182 |
| 32. | హనుమంతుఁడు స్వీయ వృత్తమును దెల్పుట | 185-188 | 183-195 |
| 33. | కవి ప్రస్తావన | 188 | 196 |

శ్రీవాణీ ప్రసన్నాభవతు





## ప్రార్థన

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

## అంకితము

అంకితంబుగాఁ జేసితి నందుకొనుము
లోక కల్యాణ సిద్ధికై ప్రాకటముగ
సరస సుందర సౌభాగ్య శతకశైలి
నీదు గాథల వినుతించి నీకెయిచట

కడలి జలములఁ గొనివచ్చి కడఁగి మొగులు
మగిడి కడలి కర్పించు నమ్మాడ్కిదోప
దురిత సంహార! తిరుపతి పురవిహార!
రమ్యగుణసాంద్ర! కోదండరామచంద్ర!

# శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణము

## (వాల్మీకి రామాయణమునకు సంగ్రహానువాదము)

## బాలకాండము

శ్రీలక్ష్మీపతియై మహీసతిని సంసేవించు భావంబులో
లాలిత్యంబును భూప్రజాభిమత సంహ్లాద ప్రకారత్వమున్
లీలన్‌జూపు పరాత్పరున్ దలఁచి యుల్లేఖించి యశ్రాంతమున్
గ్రాలన్‌జేయఁగ సన్నుతింతు మనసారన్నాంజనేయప్రభున్ 1

### వాల్మీకులవారి యాశ్రమము

అది కర్మాంచితపుణ్యభూమి పరమాహ్లాదైకచిద్భూమి సం
పదలుప్పొంగు సువర్ణభూమి నిగమస్ఫారప్రవాహార్ద్ర భ
ద్రదద సీమాప్తపవిత్రభూమి మునిసామ్రాజ్యోల్లసద్భూమి శ
ర్మద వాల్మీకినివాసభూమియగు ధీరా! ఆంజనేయప్రభూ! 2

అరిషడ్వర్గము జేరఁబోదచట నాహ్లాదంబుతోసింహముల్
కరియూథంబుల గూడియాడుగతి నాక్రాంతాప్త చిత్తంబుతో
మురిపెంబుల్ గురిపించుచుండు పులులున్ మోదంబుతోలేళ్ళపై
వరవాల్మీకి మునీంద్రునాశ్రమపుచేవన్నాంజనేయప్రభూ! 3

### నారదాగమనము

మెరుగుల్‌జిమ్ముచు మేఘముల్ చెదరగా మిన్వీధిపైనుండి శ్రీ
హరి సంకీర్తన మొప్పఁజేయుచు మహాహ్లాదంబుతో గూడి చూ
పరులాశ్చర్యము తోడఁజూడ భువికిన్ బ్రహ్మర్షియౌనారదుం
డరుదెంచెన్నొకనాఁడు మించుగతి నప్పా! ఆంజనేయప్రభూ! 4

తమసాతీరమునందు వేదరవవిస్తార ప్రసారోన్నతిన్
మమకారంబున నారదుండుగని సంభావించి వాల్మీకి యా
శ్రమమంచున్ దరిఁజేరఁగానపుడు శశ్వద్రీతివాల్మీకి సం
యమి యాతిథ్యమునిచ్చె - దేవమునికప్పా! ఆంజనేయప్రభూ! 5

## నారద వాల్మీకుల సంభాషణము

అలప్రాచేతసుఁడార్ద్రచేతసుఁడు మర్యాదల్ సమారాధనల్
విలసత్ప్రాభవరీతిఁజేయఁగ - సముద్వేలప్రమోదాత్ముఁడై
నళినప్రోద్భవసూతియుండ నపుడానందంబుతోఁజెప్పె సం
ధిలుసందేహము లామునీంద్రుఁ డిటులాప్తిన్నాంజనేయప్రభూ! 6

సకలామ్నాయవనీవిహారుఁడు తపస్స్వాధ్యాయలోలుండు మ
న్నికమీరన్గనుచుండనారదుఁడు సందీప్తాంతరంగుండునై
"సకలోర్వీతలమందెవండు సుగుణస్వాంతుండుగానొప్పు" నం
చకళంకుండగు నాకుజుండడిగె దేవా! ఆంజనేయప్రభూ! 7

"ధర్మజ్ఞుండనుచున్ గృతజ్ఞుఁడనుచున్ ధాత్రీతలంబందు స
త్కర్మాసక్తుఁడటంచు బుధసంఘంబొప్పఁగానెవ్వనిన్"
శర్మస్ఫూర్తి వచించునంచు విననిచ్ఛన్గోరె వాల్మీకి స
ద్ధర్మస్ఫూర్తిని నారదున్గనుచు శాస్తా! ఆంజనేయప్రభూ! 8

"కరుణాసాగరుఁడెవ్వఁడౌను? నిజసాంగత్యంబునెవ్వాని సుం
దరవక్త్రంబున నిత్యమైతనరు? మోదస్ఫూర్తి రాజిల్ల ధీ
వరులెవ్వాని పరాక్రమక్రియల సంభావింతురో"? చెప్పుడం
చరయన్గోరెను పుట్టపుట్టువపుడప్పా! ఆంజనేయప్రభూ! 9

## నారదాభిభాషణము

“అమలోదాత్తము పావనప్రదము ధర్మారూఢ ముత్తేజసం
భ్రమగాథాన్విత మార్యపూజితము శ్రీరామాయణం బుర్విపై
నమరంబై మను” నంచు నారదుఁడు వాఖ్యానించె వాల్మీకికిన్
క్రమమొప్పన్ రఘురాముగాథ కడువీఁకన్నాంజనేయప్రభూ! 10

రమణీయంబగు రామవృత్తరస సారంబొప్పఁగా గ్రోలి - దే
వమునీంద్రున్ గడు సన్నుతించుచు నమోవాకంబులర్పించె సం
యమివాల్మీకి సుశిష్యబృంద హృదయాహ్లాదంబుదైవారఁగా
ప్రమదుండై సురమౌనియేగె నపుడప్పా! ఆంజనేయప్రభూ! 11

## సచ్ఛాత్రుఁడైవాల్మీకి తమసానదికేగుట

సుజనస్వాంతమురీతి శుద్ధగుణవిస్ఫూర్తిన్ విరాజిల్లుచున్
భజియింపన్దగు వాహినిన్గదిసె నావాల్మీకి సచ్ఛాత్రుఁడై
వృజినోజ్జృంభణ సంహరన్ దమస నుద్వేల ప్రమోదంబుతో
నిజభావంబున నూహసేయుచు ప్రశాన్తి న్నాంజనేయప్రభూ! 12

తమసాతీర మనోహరాకృతుల నాత్మన్గాంచి శ్లాఘించు సం
యమివాల్మీకి తటాలునన్ మిగులశోకాక్రాంతుఁడై కంపిలెన్
రముధాత్ర్యర్థము చేయుచున్న పురుషక్రౌంచద్విజోద్భేదమున్
మమతన్వీడి ఘటింప దుష్టుఁడొకఁ డాత్మన్నాంజనేజప్రభూ! 13

## వ్యాధుని వాల్మీకి మందలించుట

“పరుషస్ఫూర్తివహించి క్రౌంచమును దుర్వారప్రకారుండవై
ధరపైఁగూలవధించినాఁడవు మదాంధస్ఫారచిత్తోద్ధతిన్
దురితాత్మా! ఖగబృందమెల్లకడుబంధుస్ఫూర్తిమైనార్వ త
త్పరితాపంబు దహించు గాంచు”మనె నంతన్నాంజనేయప్రభూ! 14

"పురుషక్రౌంచమునేలగూల్చితివి? పాపోవంగనింకేల? త
ద్దురితారూఢ చరిత్రలోనిలువుమీ! దుష్టప్రకారాకృతిన్
స్థిరమై వ్యాధ!'' యటంచు మౌనివరుఁడార్తిన్‌బల్కెవాల్మీకి, బం
ధురతంత్రీలయబద్ధమౌగతిని బంధూ! ఆంజనేయప్రభూ! 15

తనివారన్ తమసాంబువుల్‌గనుచు స్వాంతంబొప్పగా స్నానమున్
మునిలోకోత్తముడాచరించి యట శంభుధ్యానమున్‌జేసి వ్యా
ధుని నిందించిన దానికిన్‌వగచి యుద్యోతించు తద్వైఖరిన్
వినజొచ్చెన్ కడుతప్తుడై హృదయదీప్తి న్నాంజనేయప్రభూ! 16

## బ్రహ్మ సాక్షాత్కరించి కొనియాడుట

తన శోకంబటు శ్లోకమైనెగడఁగా దాదాత్మ్యభావంబునన్
మునిమాన్యుండగు పుట్టపుట్టు వెసఁగన్ మోదంబుతోవచ్చి య
వ్వనజాక్షప్రియపుత్త్రుఁడొప్పఁబలికెన్ వాల్మీకితో నయ్యేడన్
ఘనరీతిన్ భువనత్రయంబు పొగడంగా నాంజన్నేయప్రభూ! 17

"భవదీయంబగుశోకమే ఋషివరా! భావింపఁగా శ్లోకమై
భువనాహ్లాదకరంబుగానలరె నీ పుణ్యప్రకారోన్నతిన్
శివసంకల్పము సిద్ధిపొందె మహిభాసిల్లంగ రామాయణం
బవధానంబున వ్రాయుమంచనె" శివప్పా! ఆంజనేయప్రభూ! 18

"భువనారాధ్యముగా విరాజిలును సంపూర్ణప్రభావోన్నతిన్
నవతేజంబునొసంగు రామకథ విజ్ఞానప్రదీప్తిన్ ఋషీ!
యవధుల్‌దాటు భవద్యశంబ"నుచు నాహ్లాదంబుతోబ్రహ్మ మౌ
నివరేణ్యున్ దగబంచె గావ్యగతికెంతేన్నాంజనేయప్రభూ! 19

## వాల్మీకి రామాయణరచన కుపక్రమించుట

విద్వత్సంస్తవనీయ దివ్యకవితావేశంబు చెన్నొంద భా
సద్వృత్తాంచిత రామకావ్యరసవద్భావంబు వెల్గొంద రం
గద్వార్తాగత గంధసారగతు లాక్రాంతార్ష చిత్తంబుగా
నుద్వృత్తిన్ రచియింపనెంచె ముని శంభూ! ఆంజనేయప్రభూ! 20

శౌచస్ఫూర్తిని దేవమౌనివలనన్ సొంతముగా విన్న త
ద్వాచస్ఫూర్తుల సన్నివేశముల సంభావ్యార్థ వృత్తంబులన్
ప్రాచీదిగ్విలసత్ప్రభాకర కరాప్తస్ఫారసారాప్తిగా
తూచా తప్పక చేయనెంచె ముని బంధూ! ఆంజనేయప్రభూ! 21

రఘువంశోద్భవుగాథ శిష్యతతి సంరంభంబుతోఁగాంచఁగా
నఘమర్షంబగురీతి రంజితగతి న్నామ్నాయతుల్యంబుగా
మఘవల్లోకమహర్షిబృందమటు సంభావింప వాల్మీకి శ్రీ
శు ఘృణావార్ధి రచించెకాండగతి నచ్చో నాంజనేయప్రభూ! 22

## కుశలవులు రామాయణగాథనాలపించుట

సీతారామకథాబ్ధి రావణవధాస్ఫీతంబు రామాయణ
ఖ్యాతంబై నుతిగాంచె లోకముల నత్యంతప్రహర్షంబుగా
నేతత్కావ్యమునాలపించిరి లసద్ధ్యేయంబు పూర్ణంబుగా
ప్రీతిన్గూర్పఁగ రామపుత్త్రు లిల దీప్తి న్నాంజనేయప్రభూ! 23

కమనీయంబగు రామగాథ మదినాకాంక్షోదయోద్భాసిగా
రమణీయంబగు నశ్వమేధమున సుశ్రావ్యాప్త గేయంబులన్
విమల స్వాంతులు పాడగా కుశలవుల్ విశ్వప్రజాబాంధవుల్
ప్రమదాప్తిన్విని పొంగిపోయిరఁట ధీరా! ఆంజనేయప్రభూ! 24

క్రమరీతిన్ రఘురామపుత్త్రుల సముత్కర్షాత్త గానంబుతో
రమణీయంబుగనొప్పినట్టి విలసద్రామాయణస్ఫూర్తులన్
సమయజ్ఞుల్ కవిశేఖరుల్ బహువిధాస్వాద్యప్రకారంబుగా
నమరన్జెప్పిరి పద్యగద్యగతినప్పా! ఆంజనేయప్రభూ! 25

మునువాల్మీకిమహర్షి వాగ్గతుల సమ్మోదప్రదంబైన నా
ఘన రామాయణ కావ్యముల్దనర నుత్కర్షాప్తిముక్తంబులన్
వినిపింతున్ రఘు రామతత్త్వగతి దీప్తిన్జెందువాగ్వైఖరిన్
ననుదీవింపుము శక్తినిచ్చి సమయజ్ఞా! ఆంజనేయప్రభూ! 26

## భానుకులప్రశస్తి

సరయూవాహిని తీరమందెసఁగు విస్తారప్రకారోన్నతిన్
ధరపైకోసలదేశమొప్పుచు మహాధర్మప్రసారాప్తిమై
వరసంపన్న విలాస సాహసగతుల్భాసిల్లు సూర్యాన్వయుల్
స్థిరమైయుందు రయోధ్యనేలుచు ప్రశస్తి న్నాంజనేయప్రభూ! 27

కడుబాల్యంబున విద్యలెల్ల వరవిక్రాంతిన్ వరింపంగ దు
దుడుకున్బ్రాయమునందు రాజ్యరమ సంతోషంబుతోఁజేరఁగా
నుడురాజోన్నతినేలి భూప్రజల శాంతోదాత్త మౌనీంద్రులై
కడకున్బుత్తురు భానుగోత్రవరులిక్క న్నాంజనేయప్రభూ! 28

స్థిరమౌచున్ మనుధర్మ శాస్త్రమెసఁగున్ సేవ్యంబుగా నుర్విపై
పరగున్సాగరమంచువార్ధి జనసంభావ్యంబుగానెప్పు డి
ద్ధరపై నే నరపాలశేఖరుల శస్త్రప్రజ్ఞసారాప్తి న
వ్వరభూపాలురె భానువంశజులు దేవా! ఆంజనేయప్రభూ! 29

సరిలేనట్లుగ కోసలంబెసఁగ విశ్వఖ్యాతిమైనేలు సం
గరశూరుండిలలోన శ్రీదశరథాఖ్యున్ ప్రస్ఫురన్మూర్తియై
ధరమార్తాండకులోత్తముండిల నయోధ్యన్ రాజ్యకేంద్రంబుగా
వరపూర్వప్రభురీతులొప్పునటు లప్పా! ఆంజనేయప్రభూ! 30

## అయోధ్యానగరవర్ణన

యోధాగ్రేసరు లామహానగర భద్రోదాత్త సారోద్ధతిన్
మేధన్బాహను సల్పలేనిగతి గంభీరప్రచారాఢ్యతన్
పాథఃప్రాచురసాగరోద్ధతిని తిప్పల్బెట్టు ఖేయంబు సం
వేదస్ఫూర్తి నయోధ్య పేరెసఁగఁదీప్తిన్నాంజనేయప్రభూ! 31

లోకాలోకగిరిప్రకారవిధి నుల్లోకోన్నతవ్యాప్తిమై
ప్రాకారోచ్ఛ్రయమొప్పు నందు ఘనమార్తాండాశ్వకాయంబులన్
వీఁకన్బోవగనీక వారణముగావించున్ నభోవీధిపై
ఢాకన్మించి యయోధ్యకీర్తి మదినంట న్నాంజనేయప్రభూ! 32

"ప్రణతక్ష్మాప సమర్పితోత్తమ మహావాజి ద్విపేంద్రంబులన్
గణుతింపన్ దరమౌనె? శేషునకు, లెక్కన్బెట్టఁగావచ్చునే?
కనియాస్రష్టకునైన" నంచు బుధులుత్కర్షాద్భుతస్వాంతులై
వినఁ బేర్కొందు రయోధ్యవైభవము దీప్తిన్నాంజనేయప్రభూ! 33

నిగమాంతస్ఫుటతీరదేశముల శాన్తిన్జెందు మేధానిధుల్
భగవద్భక్తి పరాయణుల్ మునివరుల్ బ్రహ్మప్రభాలోలతన్
ప్రగతీద్వార విమోచనాపరులుగా భాసిల్ల నీపృథ్విపై
నగభిత్పత్తనమై యయోధ్యమను వింతన్నాంజనేయప్రభూ! 34

కనుపాపన్గని రెప్పగాచువిధి విక్రాంతప్రకారోన్నతిన్
జనులన్ బ్రోచుచు లోకబాంధవుగతిన్ జాతప్రజీవాళికిన్
జనకుండై భువినెల్లగాచు ఘను డైక్ష్వాకు ప్రభూత్తంసుఁడు
ద్ఘనకీర్తుల్ దివియెల్ల పర్వఁగ మహాత్మా! ఆంజనేయప్రభూ! 45

ఘనుఁడాపంక్తిరథావనీశుఁ డటువిఖ్యాతిన్ మహిన్బ్రోవ భూ
జనులెల్లన్ గడునీతి ధర్మపరులై సత్యప్రసన్నాత్ములై
గుణరాజేంద్రపదోన్నతిన్బరఁగుచున్ క్రోధాదులన్వీడి స
న్మునులై జ్ఞానులునై విరాజిలిరి శంభూ! ఆంజనేయప్రభూ! 46

కలయన్జూడఁగఁ గల్లలాడు నరుఁడొక్కండైన లేఁడెన్నఁగా
కలలోనైన దరిద్రుఁడొక్కడయినన్ గన్పట్టగాఁబోఁడు కా
నలనైన న్నొక పామరుం డరయఁ గానన్రాఁడు స్వర్గంబుగా
నలరెన్ గోసలరాజ్యమయ్యెడల దేవా! ఆంజనేయప్రభూ! 47

## రాజదంపతులు పుత్రార్థులై తపించుట

యువసౌందర్యవిలాససంపదలు బుద్ధ్యుత్సాహధైర్యోన్నతుల్
నవతత్త్వంబును వీడిపోఁగ సుతసంతానంబు దేవేరులం
దవకాశంబొకయింతలేమిగని బాధాబోధ చేతస్కుఁడై
ధవుఁడాపంక్తి రథుండు కానఁబడె చింతన్నాంజనేయప్రభూ! 48

అరినిర్భేదనధుర్యమై యశములాశాన్తప్రదీప్తంబులై
స్థిరమై యొప్పినభానువంశ మిలపై సేవ్యంబుగాకుండఁగా
క్షరమైపోవఁగనుండ పంక్తిరథుఁడాకాంక్షించి పుత్రాప్తికై
వరయాగంబును జేయనెంచె నపుడప్పా! ఆంజనేయప్రభూ! 49

తమకున్బుత్త్రులు లేమినెంచి పటుసంతప్తాంతరంగంబుతో
మమకారంబును లాగిపట్టి పతిసంభావించుచున్సాగు మా
ర్గములన్బోక చరింతురాసతులు భోగస్ఫూర్తినిందించుచున్
రమణీతత్త్వము పొల్లుపోనడఁచి ధీరా! ఆంజనేయప్రభూ! 50

"భవనంబైన వనంబుగానగును, సంభావింపగా పుత్త్ర సం
భవ విస్ఫూర్తిఁజెలంగనట్టి యెడ నాభాసింపఁగాబోడు మా
ధవుఁడైనన్, గణియింపబోరిల నపుత్త్ర స్ఫారనిర్భాగ్యతన్
లవమైనన్నని" కుందిరాసతులు చింత న్నాంజనేయప్రభూ! 51

చిత్తార్తిన్మరువంగ బాహ్యనగరీసేవోన్నతిన్ సాగుచున్
హత్తన్బంక్తిరథుండు గాంచు పరమాహ్లాదంబుతోబాలురన్
కత్తిన్గొట్టును బుత్త్రలోప మపుడెక్కన్దోఁచి డెందంబునన్
తత్తాపాగ్నిదహించు గుండెను మహాత్మా! ఆంజనేయప్రభూ! 52

## ఆప్తులు దశరథునోదార్చుట

జననాథేశ్వరు ధీరు పంక్తిరథు నస్వాస్థ్యప్రచేతస్థితిన్
జనసేవాంచితులౌ వశిష్ఠముని రాజశ్రేష్ఠులున్ మంత్రులున్
గని చింతించి లసత్ప్రభావగతి నాకర్షించి యోదార్పగా
వినయంబొప్పఁగ విన్నవించిరి నయాప్తి న్నాంజనేయప్రభూ! 53

"ఘనులౌ మంత్రిపురోహితాప్తవరులాకర్ణింపఁగాజెప్పె నె
మ్మనమందారని చిచ్చుఁగూర్చి జరసంభారార్తి గారింపఁగా
"యినవంశంబు పురోభివృద్ధిగతికి న్నేదైనమార్గంబు సూ
చనఁగావింపుఁడటంచుఁగోరె విభుఁడీశా! ఆంజనేయప్రభూ! 54

"సంతానార్థముకుందనేల? వినుఁడాశ్వాసిల్లుఁ డోరాజ! మీ
చింతన్‌బాపఁగ మార్గముల్ గలవు సంక్షేమప్రకారస్థితిన్
స్వాంతంబొప్పఁగ నశ్వమేధమఖ మీశా!పుత్రకామేష్టియున్
శాంతస్ఫారము"లంచుఁ బల్కిరి మహేశా! ఆంజనేయప్రభూ! 55

"శశ్వద్ధీరులె! యశ్వమేధమఖ మాశాస్త్ర ప్రకారోన్నతిన్
విశ్వాసంబుగఁ జేయనేర్తురిలపై, వేధించు తద్యాగమున్
విశ్వావాసుల, దోషముల్‌గదియ, నాభీలాకృతిన్ గర్తలన్
విశ్వోద్దీప్తమతీ!" యటంచనిరి దీప్తి న్నాంజనేయప్రభూ! 56

## దశరథుఁడు అశ్వమేధయాగమొనరించుటకు నిశ్చయించుట

ఘనులైనట్టి పురోహితాప్త మునిసక్త ప్రోక్తవాక్యంబు ల
య్యినవంశోద్భవుఁడైన పంక్తిరథుఁడెంతేన్ శ్రద్ధ పెంపొందఁగా
విని యాగంబు వరాశ్వమేధమును గావింపంగ లోనెంచి, య
మ్మునులొప్పన్ వివరించె నిశ్చయము శంభూ! ఆంజనేయప్రభూ! 57

సతులన్‌జేరి యజాత్మజుండు ముదితస్వాంతప్రకారాప్తి "స
న్మతులారా! గురువర్యులొప్పి సుతసంప్రాప్తప్రభావాప్తికిన్
హితమున్‌గూర్చు మహాశ్వమేధ సవనంబిచ్ఛోన్నతిన్‌జేయ నా
నతిగావించి"రటంచుఁ దెల్పె నపుడంతన్నాంజనేయప్రభూ! 58

"చిరకాలంపుమనోరథంబెసఁగి సంసిద్ధింపఁగా పూజ్యులీ
వరయజ్ఞంబును జేయఁగా నుడివి సంభావించిరీపుట్టువున్
కరమానందమునొందె నామనము మత్కాంక్షోన్నతప్రాప్తికిన్
స్థిరదీక్షన్ వహియింపు"డంచనెను దీప్తిన్నాంజనేయప్రభూ! 59

"వ్రతదీక్షన్వహియింపుఁడింక ఘనశాస్త్రప్రోక్తమౌరీతి స
త్సుతలాభాప్తికి నశ్వమేధ సవనోద్యుక్తప్రభావ్యాప్తికిన్
మతినూహింప నపుత్త్రకుల్ భువిని సన్మాన్యప్రకారోన్నత
స్థితికిన్ నో"చరటంచు దెల్పె కడుగాసిన్నాంజనేయప్రభూ! 60

## దేవేరులామోదించుట

కనులొప్పన్ ముదపూర్ణ సాశ్రుగతు లాకర్ణాంతమైపారఁగా
నినవంశాగ్రణి వాక్సుధారసము నెంతేన్గ్రోలి తృప్తాత్మలై
మనముప్పొంగఁగ "వల్లె" యంచనుచు సంభావించి దేవేరులున్
ఘనదీక్షాపరతంత్రలైరి కడువీకన్నాంజనేయప్రభూ! 61

"మన భాగ్యంబు ఫలింపనున్నదిగదా! మాన్యోన్నతుల్పుత్త్రు లీ
ఘనయాగంబున నుద్భవింతురుగదా! కాంక్షల్ మదిన్దీరఁగా
దినరాజాన్వయ మొప్పుఁగా" ననుచు సందీప్తిన్మహోరాజ్ఞలా
దినమొప్పన్ వ్రతదీక్షఁబూనిరి ప్రశస్తిన్నాంజనేయప్రభూ! 62

"విలసద్యాగము నశ్వమేధమును నిర్విఘ్నాప్తిగావింప మి
మ్మిలపుత్త్రోత్సవ పూర్ణచేతసులుగా నిల్పాంద్రతోనొప్ప స
ల్లలితుండౌ మునిఋష్యశృంగుఁడు హితోల్లాసప్రభావుండు సం
ధిలజేయు"న్నని చెప్పె మంత్రి యపుడాప్తిన్నాంజనేయప్రభూ! 63

## ఋష్యశృంగముని వృత్తాంతము మంత్రి దెల్పుట

"అజ్ఞాతైహికసిద్ధకాముఁడయి బ్రహ్మజ్ఞానసంపన్నుఁడై
ప్రజ్ఞాప్రాభవకార్యధుర్యుఁడయి భాస్వత్కాశ్యపానంద త
త్వజ్ఞుండై మునిఋష్యశృంగుఁడలరున్ స్వామీ! మఖాధ్యక్ష స
ర్వజ్ఞుండామునిఁ బిల్వుఁ"డంచనెను దేవా! ఆంజనేయప్రభూ! 64

వనిలో ధాల్లివసించుచుండె పితృశుంభద్భావనాసక్తుఁడై
ఘనమౌతాపసవృత్తిమై జనపదాకర్షాత్తభోగంబులన్
మనమందెంచక ఋష్యశృంగముని రామాలోలదృక్సారమున్
కనులన్గాంచక" యంచు చెప్పె కడువీకన్నాంజనేయప్రభూ! 65

"వినవొప్పన్ దగమీరల ప్పుడటు సంప్రీతిన్విరాజిల్లుచున్
కనఁగానౌరసపుత్రిగా నెసఁగు శాంతన్దత్తతన్జేయఁగా
మునుమీమిత్రుఁడు రోమపాదనృపుఁడా మోదంబుతోఁబెంప న
మ్ముని చేపట్టె"నటంచువాకొనెను శంభూ! ఆంజనేయప్రభూ! 66

నవరాగంబున ఋష్యశృంగముని శాంతాదేవిఁబెండ్లాడి ప్రా
భవసంపన్నునిఁజేసె రాజ్యమున సంభావింపఁ దద్వల్లభున్
భవదీయాప్తుని రోమపాదు మదినుద్భాసిల్లఁగానంత భూ
ధవ! స్వామి!" యని చెప్పె మంత్రి పరమాత్మా! ఆంజనేయప్రభూ! 67

## దశరథుఁడు ఋష్యశృంగమునినాహ్వానించుట

ఘనుఁడౌ పంక్తిరథావనీశుఁడఁట యాగంబొప్పఁజేయింపఁగా
తనజామాతను ఋష్యశృంగముని శాంతస్వాంతరూపోన్నతున్
జనమాన్యున్దగ బిల్వఁబంపెను వశిష్ఠబ్రహ్మతోఁజెప్పి భూ
జనముల్ మెచ్చఁగ రోమపాదుకడకోజన్నాంజనేయప్రభూ! 68

వరుఁడౌ పంక్తిరథాధినాథుని ప్రియాహ్వానంబు మన్నించి య
ధ్వరమొప్పన్ గడునిర్వహింపఁగ నయోధ్యన్జేరెమోదంబుతో
స్థిరసంకల్పుఁడు ఋష్యశృంగముని సంసేవించె భూనాథుఁడ
ద్వరమౌనీంద్రుని నెమ్మనంబలర దేవా! ఆంజనేయప్రభూ! 69

## అశ్వమేధయాగము

ఘనమౌరీతిఁగ నశ్వమేధమఖ ముత్కర్షప్రకర్షోన్నతిన్
దినరాజాన్వయ మొప్పఁజేయువిధి సందేశంబుఁజాటింపఁగా
మునుబంపెన్దెరువర్ల రాజ్యపతులామోదింప నాహ్వానముల్
వెనువెంటన్దగనంపె పంక్తిరథుఁడాప్తి న్నాంజనేయప్రభూ! 70

సవనాశ్వంబును రక్షసేయ నుతశశ్వద్ధైర్యకార్యజ్ఞులన్
జవసత్త్వాఢ్యుల వాహినీపతుల; విస్తారప్రకారంబుగా
నవధాన్యంబుల; రత్నరాసుల సువర్ణస్ఫారవిత్తంబులన్
ధవునాజ్ఞన్ గడు పూన్చిరాసచివు లంత న్నాంజనేయప్రభూ! 71

ఘనయాగంబును నశ్వమేధము బుధాకర్షప్రభావ్యాప్తిగా
నొనరింపన్దగు యజ్ఞసాధనతతిన్నుద్యోతింపగా గూర్చుచున్
ఘనయానప్రకరంబు మీఁద సవనాగారంబునన్జేర్చి రా
దిననాథాన్వయు నాజ్ఞ భృత్యగణమెంతే న్నాంజనేయప్రభూ! 72

శిక్షావ్యాకారణాత్తకల్పగణ వైశిష్ట్యాఢ్య మేధావులన్
దక్షుల్గా నుతిగాంచినట్టి నిగమాధ్యక్షస్ఫురన్మూర్తులన్
చక్షుఃశ్రోతృకులాధినాథుగతి శాస్త్రజ్ఞానసంపన్నుల
న్నక్షారోహము జేసి రాసచివులీశా యాశా! ఆంజనేయప్రభూ! 73

జనకక్ష్మాధిపుఁ డంగవంగకురు రాజన్యుల్ స్ఫురత్తేజులౌ
జనపాలేశులు నశ్వమేధమఖమున్ శౌర్యప్రభోల్లాసమున్
మనముప్పొంగఁగఁ గాంచవచ్చిరఁట సన్మానంబుఁగావించె నా
ఘనుఁడౌపంక్తిరథావనీశుఁడు కనంగా నాంజనేయప్రభూ! 74

అరయన్వచ్చిరి వీరువారనక యాశాంతప్రదేశస్థులౌ
పురవాసుల్ గిరికాననౌకసులు సంభూతప్రమోదంబుతో
సరయూతీరము పుణ్యసారము వరాశ్వప్రాధ్వరోపేతమున్
వరశోభాతిశయంబుతోనమరె దేవా! యాంజనేయప్రభూ! 75

అతిథులరాగ మహాసముద్రగతి నాహ్లాదంబుతోనొప్పె స
మ్మతితోడన్గని కోసలేశ్వరుఁడు సంభావించె; నాసక్తి మై
ప్రతిలేనట్టి మహాశ్వమేధమఖసంరంభంబునన్ శ్రోతియుల్
శ్రుతిగోష్ఠీ సముపేతులైయెసఁగి రచ్చో నాంజనేయప్రభూ! 76

చిత్రాపౌర్ణమి నశ్వమేధమఖమున్ జేయించి రాఋత్విజుల్
పాత్రంబౌవిధులన్ వహించి రవియుద్భాసిల్ల పూర్వాద్రిపై
ధాత్రీదేవి వికాసమొంద నఁట సద్ధర్మప్రభావోన్నతిన్
చిత్రోత్తేజముగోచరింప జనరాజి న్నాంజనేయప్రభూ! 77

సరిలేనట్టుల ఋష్యశృంగముని తేజస్ఫూర్తు లాశాస్య సుం
దరరోచిస్స్ఫుటవీచికాచయము నౌదార్యంబుతోజూడ నం
బరవీధీచర దేవతాప్రముఖ శుంభన్మూర్తు లత్యంత బం
ధురదీప్తిన్విలసిల్లె యాగమున బంధూ ఆంజనేయప్రభూ! 78

ఆకాశోన్నతయాగశాలల సముద్యత్కాంతు లాశోన్నత
శ్రీకారప్రగతీప్రసార తతులా స్ఫీతంబులైయొప్పఁగా
నాకశ్రీరమణాది దిగ్విభుల యానందోల్ల సద్వీచికల్
భూకాంతామణి నోలలార్చెనఁట శంభూ! ఆంజనేయప్రభూ! 79

ఆజానేయమలంకరించి ప్రభుత న్నాశాంత పర్యంతమున్
రాజన్యుల్ శిరసావహింప యశమున్రాజిల్ల లేఖావళిన్
తేజస్ఫూర్తుల జిమ్మఁగా దశరథాధీశుండు పుత్రేంచె రా
రాజత్వంబువిరాజిలంగ రణధీరా! ఆంజనేయప్రభూ! 80

చతురంభోధిపరీతభూవలయ విస్తారప్రపంచంబునన్
ప్రతివీరప్రముఖోత్తమాంగచయమున్ భంగంబుగాఁజేసి స
న్నుతరీతిన్ధరఁ జుట్టివచ్చె ప్రభు సంతోషప్రవాహంబు యా
గతలంబొప్పఁగ నశ్వరాజమఁటవీఁక న్నాంజనేయప్రభూ! 81

నవచైతన్యము దిక్కులన్బరువఁగా నవ్యోల్లసత్కావ్య సం
స్తవదీప్తోత్సవ వాహినుల్ భువిని స్వచ్ఛంబైప్రసారింపఁగా
పవనాశ్వంబటు జేరె నంత సరయూ సారస్వతక్షేత్రమున్
పవనాగారము చైత్రపౌర్ణమిని శాస్త్రా! ఆంజనేయప్రభూ! 82

వరయోధుల్వలె మూఁడువందలగు యూపస్తంభముల్నాటి య
ధ్వరభూమిస్థలి మంత్రతంత్ర విధులన్ భాస్వద్దీప్తసారంగులన్
వరతిర్యక్కులఁదెచ్చికట్టిరి మహాశ్వంబొప్ప మధ్యంబుఁగా
స్వరసంకల్పులు వైదికోత్తములు దీప్తి న్నాంజనేయప్రభూ! 83

జరగెన్యజ్ఞము పేరుదాల్చిన మహాధ్వర్యప్రబోధంబులన్
వరలెన్జన్నము హోతృవర్యు విమల స్వాంతోల్లసత్ స్వాగత
స్వరవిన్యాసములన్ మనోరుచిర భావప్రాభవోద్గాత సు
స్వరసామంబులతోడ భూసురగణాప్తి న్నాంజనేయప్రభూ! 84

శ్రవణానందకరంబుగా ప్రభువు మంత్రస్ఫార స్వాహాస్వనం
బవధారించె ధనంజయోజ్జ్వలిత శుంభద్రాగసారోన్నతుల్
నవదీప్తిన్గలిగింప శ్రోత్రియుల యుద్దిష్టాత్తకంఠధ్వనిన్
సవనాగ్నుల్బురివిప్పి యాడఁగ మహేశా ఆంజనేయప్రభూ! 85

వరయూపంబులఁజేరి యజ్ఞహయముద్భాసిల్ల నాసక్తి బం
ధురపూజావిధి వేదమంత్రనుత సందోహంబులన్జేసి య
న్నరపాలేంద్రుఁడు ధర్మపత్నికొసగెన్ నవ్యప్రభోదాత్తమున్
స్థిరతేజోమయ ఖడ్గమున్ యజనదీప్తి న్నాంజనేయప్రభూ! 86

త్రేతాగ్నుల్చెలగంగ యాజకసముత్తేజ ప్రభాతంత్రముల్
స్ఫీతస్ఫూర్తినిభాసిలంగ నమరప్రీతిప్రకారాప్తిమై
ప్రాతఃకాలమునందు భానుకర సంభావ్యాప్తిమై యాజకుల్
ధాత్రాజ్ఞన్ వపదీసిరశ్వమునకంతన్నాంజనేయప్రభూ! 87

వరమంత్రంబుల నగ్నిహోత్రమున నధ్వర్యుల్ వపన్వ్రేల్వ బం
ధురధూమంబులు నింగిపైకెగసె నస్తోకప్రభావ్యాప్తి పెం
పర పత్నీయుతుఁడౌచు పంక్తిరథ భూపాలుండు నాఘ్రాణభా
సురుఁడయ్యెన్ గ్రతుశాలలో ముదితుఁడౌచు న్నాంజనేయప్రభూ! 88

సవనాగ్నుల్చెలగంగ యజ్ఞహయ శశ్వద్దేహభాగంబులన్
శివసంప్రీతికరంబుగా విబుధసంసేవ్యప్రకారాప్తి వి
ప్రవరుల్వ్రేల్చిరి సర్పిధారల సుసారప్రక్రియారూఢతన్
స్వరసంభావిత మంత్రముల్ గదియ దేవా! ఆంజనేయప్రభూ! 89

అపచారంబులు లేక యాగము నృపుండాసక్తిమై జేసె స
త్కృపతోఁగాంచఁగ ఋష్యశృంగముని దాక్షిణ్యప్రభావోన్నతి
న్నుపసేవించిరి యశ్వమేధ సవనాభ్యుక్త ప్రసాదంబు భూ
ధవుతోడన్ వ్రతనిష్ఠలాసతులు త్రాతా! ఆంజనేయప్రభూ! 90

## దశరథుఁడు పుత్త్రకామేష్టిఁజేయుట

విలసద్రీతిఁగ నశ్వమేధమఖ ముర్వీవల్లభుల్మెచ్చఁగా
నిలలోఁబంక్తిరథావనీశ్వరుఁడు దైవేచ్ఛప్రకారంబు ని
శ్చలవృత్తిన్నొనరింప "చేయు"మనె భాస్వత్పుత్త్రకామేష్టి భూ
తలనాథున్గని ఋష్యశృంగముని యంత న్నాంజనేయప్రభూ! 91

జ్వలనుండొప్పఁగ మంగళాహుతుల సుస్వారాత్తమంత్రోన్నతిన్
విలసద్రీతుల సామగానమొలయన్ వేదజ్ఞసంభావనన్
జ్వలనజ్వాలల మధ్యనుండి యొక భాస్వత్తేజదేహుండు మం
గళ సంధాయిఁగవచ్చినిల్చె నఁటవీఁక న్నాంజనేయప్రభూ! 92

కాంచెన్ బంక్తిరథావనీశుఁడు సమాకర్షప్రదీప్తాంగునిన్
ప్రాంచద్దివ్యుని హేమపాత్రవిలసద్రమ్యప్రభాహస్తు రో
మాంచత్స్ఫూర్తులు నుల్లసిల్లఁగ సతీమాన్యేల్ల సద్వీక్షణో
దంచత్వీచికలొప్పియాడఁగ మహాత్మా! ఆంజనేయప్రభూ! 93

మనసాసంస్తుతిఁజేసె పంక్తిరథ సామ్రాజ్యాధినాథుండు స
ద్వినుతుల్సేయ సతీత్రయంబొరసి విన్వీధిన్ సురల్మెచ్చ నా
ఘనుఁడామోదముతో బ్రదక్షిణ పురస్కార ప్రమాణంబులన్
దినవాథుండుగనంగఁ జేకొనెను దీప్తి న్నాంజనేయప్రభూ! 94

పరమాన్నంబునొసంగిచెప్పె మదియుద్భాసిల్లఁగా దివ్యుఁ"డో
వరభూపాలసుధాకరా! సతులు సంభావించి యిప్పాయసం
బెరుగన్గ్రోలిన పుత్త్రసంతతి లసత్త్రీతి ప్రభావ్యాప్తిమై
ధరలోఁబొందెద"రంచు రాజునకు శాస్తా! ఆంజనేయప్రభూ! 95

అంతన్ బంక్తిరథావనీశుఁడు "మహాత్మా! నీప్రసాదంబునన్
చింతల్వాసె" నటంచు జెప్పి సతులున్ సేవింపఁగా నిచ్చె నా
స్వాంతంబొప్పఁగ నర్ధభాగమును కౌసల్యప్రమోదింప నా
కాంతాయుగ్మముఁగ్రోలె నాసగము దక్కన్నాంజనేయప్రభూ! 96

వరభోక్తల్ సవనాగతుల్ ప్రభువుసంభావింపఁగా శాలలో
వరుసల్దీరుచుఁగూరుచుండిరి మహాభక్తి ప్రసన్నాత్ములై
వరరంభాదళముల్ పురోపతలమున్ భాసిల్లఁగా నంత భూ
సురలొడ్డించిరి భక్ష్యభోజ్యతతి నచ్చో నాంజనేయప్రభూ! 97

నవనీతోద్భుతమౌఘృతంబు పరమాన్నంబుల్ ప్రసాదంబులన్
చవులూరించెడి పప్పుకూరలను శస్తంబౌ ఫలానీకముల్
స్తవనీయంబగు పంచభక్ష్యముల శౌచస్ఫూర్తి వడ్డించి రా
సవనంబొప్పఁగఁజేయు ఋత్విజుల కిచ్చ న్నాంజనేయప్రభూ! 98

పప్పున్దప్పళమున్ ఘృతంబు దధియున్ బానీయముల్ భక్ష్యముల్
ఒప్పున్మీరెడుతేనె లప్పళము లుద్యోతప్రసాదంబులన్
కుప్పల్గాఁగ ఫలంబులన్ దనియగా గుప్పించి రచ్చోట రా
జొప్పున్జూడఁగ యజ్ఞవర్తులకు శంభూ! ఆంజనేయప్రభూ! 99

ంత్విక్కుల భూసురేశ్వరుల సంభావించె భూమీశుఁ డు
మెచ్చఁగ గోసహస్రముల భూస్వర్ణప్రకారోన్నతిన్
నందమునొందుచున్ సురవరాకర్షప్రసన్నాప్తి భా
ూగాంతమునందు భక్తిమెయి నచ్చో న్నాంజనేయప్రభూ! 100

నుండెను ఋష్యశృంగముని సంసక్తప్రసన్నాత్ముఁడై
తై భూపతికొల్వ రాసతులు నానందింప దేవేంద్ర స
తిన్ హయమేధ యాగమును సంస్తుత్యప్రకారంబుఁగా
మేష్టి సమాప్తిఁజేసి కరమచ్చోనాంజనేయప్రభూ! 101

మాతను పుత్త్రికామణిని సత్కారంబుఁగావించి య
బుండొనరించె వీడుకోలు పుత్సాహప్రకారాప్తిమై
రీతి నయోధ్యనుండి విలసత్కాంతారమధ్యాశ్రమం
ంగా మఱికొన్ని రోజులకు శూలీ! ఆంజనేయప్రభూ! 102

## రావణాసురుని విజృంభణము

వరగర్వమత్తుఁడు మహోత్పాతప్రకారుండు ను
ంకాపతి రావణాసురుఁడు దుర్వారప్రకారంబుఁగా
ర్వసురేంద్రులన్గదిసి నానాబాధలన్బెట్టుచున్
న్ గొనసాగుచుండె దురితాప్తి న్నాంజనేయప్రభూ! 103

ంకేశుఁడు పెట్టుహింస లటనోపన్జాలకాహవ్యము
క్పాలకవర్యులున్గొనఁగ నత్యంతంబసాధ్యంబుఁగా
ఖరిఁదాల్చి దేవమునిసంస్తోమంబు వైకుంఠమున్
ంబునఁజేరి వేడుకొనె నప్పా! ఆంజనేయప్రభూ! 104



"క్రవ్యాధీశ్వరునానతిన్ గొనక యాప్రాణానిలుండెన్నఁగా
సవ్యప్రాక్తనరీతి వీవవెఱచున్; సప్తార్చియెల్లప్పుడున్
హవ్యంబుల్గొనఁగావణంకు"నని దేవాదీశుఁడాశాక్షితో
దివ్యాత్ముల్ బడుబాధలన్నుడివె భక్తిన్నాంజనేయప్రభూ! 105

"సప్తాశ్వుండు గమింపభీతిలు సమస్తవ్యోమదేశంబు; సం
తప్తుండై మది గుందుపాశి; పృథివీస్థైర్యంబుఁగంపిల్లె నీ
యాప్తుల్ దివ్యమునీశ్వరుల్ మదిని నిర్ధ్యానింపఁగానోడుచున్
గుప్తాకారులుగావసింతు"రనిస్రుక్కున్నాంజనేయప్రభూ! 106

"నిమిషంబైన వసింపలేమిఁక నశాంతిన్ మాధవా! కావవే!
మము లంకేశునిబారినుండి మదకామప్రేరితాత్ముండునై
తమమున్గప్ప సతీమతల్లుల బలాత్కారంబుగావించుఁ గా
వుము జాగేల?"యటంచు శక్రుఁడనె శంభూ! ఆంజనేయప్రభూ! 107

కడుదైన్యంబున దేవతావిభుఁడు దుఃఖస్ఫారచిత్తంబుతో
పడుపాట్లెల్ల నెఱుంగఁజెప్ప గని సంభావించి నారాయణుం
"డడలన్బోకుఁడు రావణాసురుని చెండాడంగ నేనుంటి మీ
యిడుముల్దీర్చెద నంచు చెప్పెనఁట శూలీ! ఆంజనేయప్రభూ! 108

శుచియాదివ్యుని సన్నుతించి సవనస్ఫూర్తిన్ముదంబొంది చి
ద్రుచులన్బొంగెడు పాయసంబపుడు సంతోషంబుతోఁగ్రోలి రా
రుచిరాంగుల్ నిజమానసంబెసఁగ నారూఢోల్లసద్వృత్తిమై
పచరింపన్గడుదీప్తిఁబంక్తిరథుఁ డప్పా! ఆంజనేయప్రభూ! 109

## రాణులు పుత్త్రులఁగనుట

దైత్యాధీశ్వరు రావణాసురు మదాంధస్ఫూర్తి నిర్జింప నా
దిత్యేశప్రముఖాదులెల్ల విలసత్తేజోన్నతిన్‌దాల్ప సం
స్తుత్యప్రాభవరీతి రాసతులు సంశోభిల్ల తద్గర్భముల్
ప్రీత్యాత్మన్నలరంగనొప్పె హరి దీప్తిన్నాంజనేయప్రభూ! 110

తనపత్నుల్ వరగర్భశోభిత నితాంతస్ఫూర్తిమన్మూర్తులై
దినరాజాన్వయ వృద్ధిరూపవతులై దేదీప్యమానాకృతిన్
గనుపింప న్నజరాజపుత్త్రుఁడు ప్రజాకర్షప్రమోదాత్ముఁడై
ఘనతృప్తిన్‌గని నొప్పుమీరెఁ గడువీకన్నాంజనేయప్రభూ! 111

అంతర్వత్నుల ధర్మపత్నుల సమాహ్లాదైక దృగ్వ్యాప్తులన్
వింతల్మీరెడు కోర్కెలొప్పఁగని యావేగంబుతోఁదీర్చుచున్
కాంతాలోలతనొప్పి పంక్తిరథుఁడుత్కంఠంబుదైవార కా
ర్యాంతర్వ్యాప్తుఁడుగాకయుండెను మహాత్మా! ఆంజనేయప్రభూ! 112

కనఁగా మాసములున్ దినంబులను లెక్కింబెట్టుచున్‌గాంచు న
జ్జననాథుండు ముదంబుతో సతుల శశ్వద్రూపసౌభాగ్యమున్
ఘనమున్‌గాంచుకృషీవలుక్రియ సముత్కర్షప్రకారోన్నతిన్
దిననాథాన్వయవృద్ధికై మిగులదీప్తి న్నాంజనేయప్రభూ! 113

విలసద్ద్వాదశమాసముల్‌గడువ దేవేరుల్‌ప్రయాసంబుతో
కళలన్‌మీరుచునొప్పి రంతిపురిలో గర్భాలసప్రాప్తిఁజం
చలవీచీయుత నబ్ధిగా దశరథస్వాంతంబు శోభిల్ల న
ల్లలనల్‌గాంచిరి పుత్త్రులన్నపుడు లీలన్నాంజనేయప్రభూ! 114

కలిగెన్నైదుగ్రహంబు లుచ్చదశ నుత్కర్షంబుతోనుండ సం
ధిలచంద్రుండు బృహస్పతిన్గలసి యుద్దీపించు చైత్రంబులో
విలసత్శుద్ధనవోల్లసత్నవమి నావిష్ణుండె పుత్త్రుండుగా
లలికౌసల్య కఁటన్ పునర్వసువులీలన్ ఆంజనేయప్రభూ! 115

అలకౌసల్యకుఁబుట్టె పుత్త్రుఁడయి యాహ్లాదంబుతో విష్ణు వా
ఖలు లంకేశుని పంక్తికంఠు ననిలోఖండింపఁగానెంచి రం
జిలబృందారకలోకమెల్ల జనులుజ్జీవింపగానంత భూ
తలమందొప్పు నయోధ్యయందెసఁగి త్రాతా! ఆంజనేయప్రభూ! 116

అమరేంద్రాదులు చింతవీడి పరమాహ్లాదంబుతో నొప్పుచున్
దమదృష్టిన్ రఘువంశదీపకునిపై ధర్మోన్నతిన్నిల్పి రు
త్తమవిద్వాంసు మనోజ్ఞచిత్తమువలెన్ ధాత్రీతలంబొప్పె నా
గములెల్లన్దలయూచి యాడినవి వీకన్నాంజనేయప్రభూ! 117

నగముల్లేచి ప్రమోదవృత్తిమెరయన్ నాట్యంబులన్సల్పె ప
న్నగ గోబృందములెల్లనాడినవి సంతోషంబుఁదైవార చె
న్నగ సంద్రంబులు వాహినుల్గలసిఁ జిందుల్ద్రొక్కెఁ దాళోన్నతిన్
ఖగముల్వృక్షములుల్లసిల్లినవి వీకన్నాంజనేయప్రభూ! 118

గురువారంబున చైత్రశుద్ధదశమిన్ గ్రాన్మీనలగ్నంబునన్
హరియంశంబున కేకయాత్మజ సమాహ్లాదంబుతోఁగాంచె బం
ధురసౌందర్యగుణాన్వితున్ శిశువు నుత్ఫుల్లోల్లసద్గాత్రునిన్
స్థిరమౌపుష్యమియుల్లసిల్లఁగఁ బ్రదీప్తిన్నాంజనేయప్రభూ! 119

స్థిరకర్కాటకలగ్నమునన్దనరనాశ్లేషప్రభల్గూడ శ్రీ
హరిదీప్తాంశములో సుమిత్రగనె నాహ్లాదంబుదైవార భా
సురరీతిన్ భృగువాసరంబున వరస్ఫూర్త్యాత్మలౌపుత్త్రులన్
నరుదౌచున్గవలుల్లసిల్లఁగ శివప్పా! ఆంజనేయప్రభూ! 120

నవతేజంబున కోసలేంద్రుసతులానందంబుతో బుత్త్రులన్
భువనారాధ్యులఁ గాంచఁగా సకల సంపూర్ణోల్ల సచ్చంద్రులన్
భువియెల్లన్దివియయ్యె నుత్సవములస్ఫూర్తిన్ విరాజిల్లుచున్
నవసత్త్వంబునసృష్టియొప్పె కడువింతన్నాంజనేయప్రభూ! 121

## వానరవీరులు జన్మించుట

ఘనమౌరీతిఁదపంబుఁజేసి మునుపాకర్షించి యారావణుం
డెనయంగా పటుదేవతాప్రముఖులందెవ్వారితోమృత్యువున్
దనకున్రాక వరంబుఁబొందినగతిన్ తత్కారణస్ఫూర్తులన్
వనజప్రోద్భవుఁడూహఁజేసె నపుడప్పా! ఆంజనేయప్రభూ! 122

అలనారాయణుఁడట్లు మర్త్యుఁడుగ నత్యంతప్రభావంబుతో
నిలకౌసల్యకు బుట్టుటల్ విధియు దానెంతేనిభావించి భూ
తలమందొప్పఁగ దేవతాతతిసముద్యత్ గీశబృందంబుగా
వెలయన్జేసెను పంక్తికంఠువధ కాప్తిన్నాంజనేయప్రభూ! 123

హరి కౌసల్యసుతుండుఁగా నెసఁగ నాహ్లాదంబుతోనంత నా
హరివీరోత్తములై జనించిరపు డత్యంతప్రమోదంబునన్
స్థిరసంకల్పవిరాజమానులగుచున్ సేవింపఁగా నాతనిన్
వరదేవప్రముఖుల్ ప్రసన్నులయి దేవా! ఆంజనేయప్రభూ! 124

అలయింద్రాత్మజుఁడొప్ప వాలియయి సూర్యప్రాభవత్సూనుఁ డ
వ్వల సుగ్రీవుఁడునయ్యె వాయుజునిఁగా భాసిల్లవే! నీవు సం
ధిలవైశ్వానరపుత్త్రుఁడయ్యె కడుదీప్తిన్నీలుఁడై విశ్వ మం
గళమొప్పన్ సురవైరిజంపఁ బటువీఁక న్నాంజనేయప్రభూ! 125

జననంబందిన ద్వాదశాప్తదిన ముత్సాహప్రకారోన్నతిన్
జననాథాగ్రణిచేసె పత్నులలరన్ సంజాతకర్మాదులన్
దిననాథోత్తమ వంశదీపకులకుద్దీప్తాంతరంగంబుతో
జనులెల్లన్గొనియాడగా ధరణి నీశా! ఆంజనేయప్రభూ! 126

## జాతకర్మాదికము

సకలోర్వీపతులెల్లగొల్వఁగ ఘనస్వాధ్యాయులౌ బ్రహ్మలున్
ప్రకటాశీర్వచనంబులన్ నిగమమంత్రస్ఫూర్తి గావింపఁగా
నకళంకుండజరాజపుత్త్రుఁడు సమాహ్లాదంబుదైవార భా
నుకులోద్భూతులకంతఁబేరిడెను బంధూ! ఆంజనేయప్రభూ! 127

ప్రజలున్మెచ్చు గుణాభిరామునిఁగ శ్రీరామాభిధేయంబుతో
విజయశ్రీ భజియింపఁగా భువియు సంప్రీతిన్వహింపంగ నా
సుజనారాధ్యుఁడు రాజుపిల్చె పరమస్ఫూర్తిన్ వశిష్ఠాజ్ఞతో
నిజకౌసల్య తనూజుఁడొప్ప గ్రహకాన్తి న్నాంజనేయప్రభూ! 128

కలలోనైన నరాచకంబిలకు వంకల్బెట్టిరాకుండఁగా
విలసద్రీతిభరించువానిఁగ లసద్ప్రీతిన్ విరాజిల్లఁగా
నల కైకాత్మజుఁడొప్పఁగా నిడెను ప్రహ్లాదంబుతోఁజేఁడు రం
జిల నచ్చో భరతాఖ్య మంత్రరవరాజి న్నాంజనేయప్రభూ! 129

సుగుణస్ఫారుఁడు రాముఁ డన్నయగుచున్ శోభిల్ల తత్సేవలో
జగమందొప్ప విశేషభంగిని మహోత్సాహంబుతోరాజు సొం
పగుసౌమిత్రికి లక్ష్మణుండనుచునుద్భాసిల్లు నామంబిడెన్
జగదారాధ్యునిఁగా విరాజిలఁగ నీశా! యాంజనేయప్రభూ! 130

ప్రతివీరోద్ధత దుర్ఘటాదికముఁ గుప్పన్గూలఁగాఁజేసి శ
త్రుతతిన్భీతిలఁజేయుదిట్టఁగ మహాత్ముల్ దీవెనల్ సల్ప స
న్మతిరాజంత సుమిత్రచిన్నకొడుకున్ మాన్యున్ వశిష్ఠాజ్ఞతో
నుతశత్రుఘ్నుఁడటంచుఁబిల్చె నఁట బంధూ! ఆంజనేయప్రభూ! 131

తనయాలంకృతమైన నామకరణోత్సాహప్రమేయంబులన్
వినయాప్తిన్దగనిచ్చె పంక్తిరథుఁడుద్వేల ప్రకారంబుఁగా
ధనమున్ గోవులు భూరిదక్షిణలు నుద్భాసిల్ల విప్రాళికిన్
ఘనసంతర్పణముల్ ఘటించి కడువీఁకన్నాంజనేయప్రభూ! 132

ఊరూరన్గడు సంబరంబుగతులుఉబ్బాతలూగంగ పెం
పారెన్బంక్తిరథావనీశుకులమొప్పన్ బుత్రనామోత్సవ
స్ఫారోల్లాసదినోత్సవప్రగతి గౌసల్యాదులుప్పొంగ నా
శ్రీరామాదులసన్నుతించుచు ప్రశస్తి న్నాంజనేయప్రభూ! 133

మొగ్గల్బోలిన పాలబుగ్గలపయిన్ బొల్పొందు చిర్నవ్వులన్
ముగ్గుల్దీరఁగఁజూచుబాలురను సమ్మోదంబుతోరాసతుల్
నిగ్గుల్జిమ్మెడు చూపులన్గనుచు సంతృప్తాత్మలైవేడుకల్
జగ్గుల్మీరఁగ ముద్దులాడెదరు శాస్తా! ఆంజనేయప్రభూ! 134

తళుకుల్జిమ్మెడు చూపులందు పరమాత్మస్ఫూర్తి జూపించుచున్
విలసచ్చేష్టల లోకసంగతులు శోభిల్లంగ రూపించుచున్
లలిమీరన్ వెలుగొందుచుండిరిల బాల్యంబొప్ప విష్ణ్వంశ శో
భిల రామాదులు తల్లిదండ్రులు గన దీప్తిన్నాంజనేయప్రభూ! 135

ఘనుఁడౌ పంక్తిరథుండు పుత్త్రులకువీఁకన్జేసెఁ జౌళంబు నె
మ్మనమొప్పంగ ద్విజత్వమున్వెలయ శుంభద్రీతిగాయత్రియున్
తనరంగా నుపదేశమిచ్చెపతి యత్యంత ప్రమోదంబుతో
కనఁగానంత వశిష్టునాజ్ఞమెయి ప్రజ్ఞన్నాంజనేయప్రభూ! 136

పరగన్పంక్తిరథుండు చేసె రహితో బ్రహ్మోపదేశంబు సు
స్థిరగాయిత్రిని గూఢతంత్రగతి సంస్తేజంబుదైవారఁగా
వరరీతిన్నుపదేశలగ్నమున సంభావించె విప్రాళిభా
సురవైశ్వానరదీప్త చిత్తగతి నచ్చో నాంజనేయప్రభూ! 137

నయమొప్పన్దగ నభ్యసించిరి లసన్మాన్యప్రభావంబునన్
జయలక్ష్మీప్రవరాప్తులై సకలశాస్త్రజ్ఞానవిద్యాదులన్
వయసా షోడశవత్సరంబుల లసత్ప్రాయంబుదీపింప త
న్మయులైరాజకుమారులంత బుధమాన్యా! ఆంజనేయప్రభూ! 138

## విశ్వామిత్రాగమనము

సద్యస్ఫూర్తి మతీంద్రులై రఘువరుల్ శస్త్రాస్త్రసంవేద్యులై
విద్యానందమహాత్ములై తనరు నవ్వేళన్ప్రశంసించి సి
ద్ధోద్యద్యాగ భరాంచితుండు మునిలోకోత్తంసుఁడౌ కౌశికుం
డుద్యద్వైభవుఁడంతవచ్చెనఁట శంభూ! ఆంజనేయప్రభూ! 139

పరమేష్ఠిస్తుత సృష్టులన్నెదురు భాస్వద్సృష్టిఁగావించి భా
సురకీర్తిన్వరియించినట్టిముని యచ్చోవచ్చుటల్గాంచి బం
ధురభక్తిన్నెదురేగి పంక్తిరథుడత్యుత్సాహసంరంభియై
వరసత్కారములొప్పఁజేసె నపుడప్పా! న్నాంజనేయప్రభూ! 140

స్థిరసంకల్పుఁడు వీతిహోత్రనిభు డుత్తేజస్స్ఫురచ్చిత్తుఁడ
ధ్వరదీక్షాపరుఁడైన కౌశికుఁడు విద్యానందసామ్రాజ్య భా
సురవాచస్పతి నావశిష్ఠుమది సంశోభింపఁగీర్తించి బం
ధురతేజున్గనె నంత పంక్తిరథు బంధూ! ఆంజనేయప్రభూ! 141

"యోగక్షేమము లుల్లసిల్లునె? సముద్యోతింప రాజ్యంబునన్
రాగస్ఫూర్తినిబద్ధులౌచు జనులార్ద్రస్ఫారచిత్తంబునన్
భాగస్వాములుగాఁ జరింతురె? మహాభాగ్యప్తిగానెంతురే!
త్యాగస్ఫూర్తుల"నంచుఁబల్కెముని ధీరా! నాంజనేయప్రభూ! 142

"ఘనులౌ దేవమునీంద్రదేశికులు వీఁకన్బ్రోవ నెల్లప్పుడున్
జనులున్ మేమును గూడి యీవసుధలో సంతోషచిత్తంబుతో
మనుచున్ యోగములుల్లసిల్ల స్థిరశుంభద్రీతిమై నుంటి మో
మునిలోకేశ! యటంచు"రాజనెను శంభూ! ఆంజనేయప్రభూ! 143

"భవదీయుండ ననుగ్రహింపుఁడు భవద్భావప్రకారాత్మ నే
నవలోకించుచునుంటి నెప్పుడు మహాత్మా!"యంచువాక్రుచ్చె భూ
ధవుఁడాపంక్తిరథుండు కౌశికముఖాంతస్ఫూర్తినిర్మగ్నుఁడై
భవునిన్ భక్తుఁడుగాంచుతీరెసఁగ దేవా! ఆంజనేయప్రభూ! 144

## విశ్వామిత్రుఁడు యాగరక్షణార్థమై రామలక్ష్మణులనుగోరుట

దిననాథాన్వయ భూమిపాలుఁడట సందీప్తప్రపన్నాత్ముఁడై
మునిగాధేయునిఁగాంచిపల్కె కడుసమ్మోదాంతరంగుండు స
జ్జనకార్యాంచితశీలుఁ డాఋషి మహాసంతుష్టుఁడైపల్కె న
య్యినవంశాగ్రణితోడ నిట్లపుడు శూలీ! ఆంజనేయప్రభూ! 145

"రాజున్గంటిని మింటిపైనెసఁగి సంరంభంబుఁదైవార శ్రీ
రాజున్జూచితి నబ్ధియందొనరి సూర్యప్రాభవస్ఫూర్తిమై
రాజా! వారిగుణంబులెల్ల కడువిభ్రాజిల్లెనీయందు రా
రాజస్ఫూర్తిన"టంచు బల్కె ముని ధీరా! ఆంజనేయప్రభూ! 146

"కడువిఘ్నంబుల జేయుచుండెను బటుక్రవ్యాదయుగ్మంబు దుం
దుడుకున్మీరఁగ మాంసఖండముల నస్తోకంబుగారక్తమున్
వడిమీరన్గురిపించెడున్ సవనదివ్యస్ఫారదేశంబునన్
కడదేర్పన్వలె వారి"నంచనెను గాక న్నాంజనేయప్రభూ! 147

### దశరథుఁడు విచారించుట

"లోకార్థంబుగభానుదేవుఁడు సమాలోకింప నేతెంచి యా
కీకారణ్యములన్గమించి కిరణోత్కీర్ణప్రసారాప్తిమై
స్వాకారోన్నతిజూపి గాఁచుగతి దీప్తస్వాంతమేపారఁగా
మాకున్దోచితె స్వామి!" యంచనెను భీమా! ఆంజనేయప్రభూ! 148

"వ్రతదీక్షాపరులైన సంయములు శాపప్రాభవాస్త్రంబులన్
మతినూహింపఁగ వేయలేరుగద! దుర్మార్గప్రవృత్త్యాత్ములై
మితిమీరన్జరియించు రక్కసులపై మీశక్తిసామర్థ్యముల్
గతిగా వచ్చితి"నంచు మౌనియనెఁ గాక న్నాంజనేయప్రభూ! 149

"పంపన్‌గోరెద నీకుమారవరునిన్ భాస్వంతునిన్, దుష్టులన్
ద్రుంపన్‌జాలెడు రామభద్రుఁ, గడుసంతోషంబునిప్పు, డా
కంపంబొందఁగ రాక్షసాధముల నుద్గాఢంబుగాఁజంపి, సి
ద్ధింపన్ జేయ, మదీయయాగ"మనె నాస్తిన్నాంజనేయప్రభూ! 150

విశ్వామిత్రుని మాటలన్విని యదీప్తిన్‌జెంది డెందంబులో
నాశ్వాసిల్లఁగలేక పంక్తిరథుఁ డాప్యాయంబుతో రామునిన్
నిశ్వాసంబులు నిర్గమింపఁగని పక్షిబృందమున్‌గాంచి యా
విశ్వఖ్యాత మునీంద్రుతోఁబలికె నాస్తి న్నాంజనేయప్రభూ! 151

కన్నీరొల్కఁగ రామచంద్రుఁగనుచున్ గాధేయుతోరాజు"నన్
మన్నింపన్‌దగు దీమునిన్ దనుజసంహారంబుఁగావింప మీ
కెన్నన్‌ధర్మమె? రాముఁగోరుట మహర్షీ! గాంచుమీ! స్వామి! నా
చిన్నండీ తనివీడలేన"నెను గస్తి న్నాంజనేయప్రభూ! 152

"పటుమాయారణవేత్తలౌ యసురులన్ వారించి పోరాడ ని
వ్వటుకుండెట్టులనేర్చు? సంయమివరా! భావింపుమీ! వీఁడు ని
న్నటిబాలుండుగదా! నిశాటులను పంతంబొప్ప నిర్జింపఁగా
ఘటికుండౌనె?"యటంచు తేఁడనెను గాక న్నాంజనేయప్రభూ! 153

"అలదుర్మార్గుల రాక్షసాధముల సంహారంబుగావింతు నా
బలవర్గంబులతోడవచ్చి కనుమీబాలుండు రాముండు వాఁ
డలశస్త్రాస్త్రముల న్నెఱుంగఁడు మహాత్మా! వాని గాంక్షించుటల్
వలదంచున్"దగఁజెప్పె రాజపుడు దేవా! ఆంజనేయప్రభూ! 154

కని యాపంక్తిరథాధినాథుమతి సంక్తంబౌవిషాదంబు న
మ్మునిమాన్యుండనె "నిబ్బరంబెనయఁగా మోదంబుతోనుండుమీ!
యినవంశాగ్రణి! రామభద్రుఁడనఁగా నేమంచు భావించితో
కనుమీ! విష్ణువుగాఁగ"నంచనెను వీఁక న్నాంజనేయప్రభూ! 155

"అలదైత్యాదుల రూపుమాపు రణవిద్యావార్ధిపారంగతున్
విలసత్ప్రాభవశౌర్యధైర్యపరు నుద్వేగక్రియోత్సాహునిన్
తలపన్నీసుతు రాఘవున్గనుము చింతల్మాని రాజేంద్ర! ని
శ్చలచిత్తంబునఁబంపుమ"ంచనె మహేశా! ఆంజనేయప్రభూ! 156

"గాధేయుండు వచించుమాటలు ప్రజాకర్షప్రభావోన్నతుల్
బాధన్బొందఁగనేల? రాజ! సుతునిన్భాస్వంతునిన్రామునిన్
మోదంబొప్పఁగబంపుమా! యనుజుతోఁబుణ్యప్రకారోన్నతిన్
వేదస్ఫూర్తివహించి"యంచు మునిచెప్పె న్నాంజనేయప్రభూ! 157

మమకారభ్రమలెల్లవీడి పరమాత్మప్రాభవున్రామునిన్
తమతోబంపుమటంచు కౌశికుఁడు పంతంబొప్పఁగాఁగోర త
త్క్రమవిస్ఫూర్తి వశిష్టుఁడొప్పబలుకన్ రాజేంద్రుఁడున్బత్నులున్
ప్రమదాక్రాంతులునై తలంచిరటులొప్ప న్నాంజనేయప్రభూ! 158

## విశ్వామిత్రునితో రామలక్ష్మణులఁబంపుట

ఆశీర్వాదముఁజేయ పంక్తిరథుఁ డత్యంతప్రమోదంబుతో
నీశున్లోన దలంచి పత్నులటులెంతేనిన్ శుభాశీస్సులన్
శ్రీశుప్రాభవుమీఁదఁజల్ల మునిరాజీవాక్షు హస్తంబునన్
బ్రాశస్త్యంబుగ నుంచెనయ్యెడల ధీరా! ఆంజనేయప్రభూ! 159

అన్నన్ ధీరగుణాభిరాముని సముద్యచ్ఛౌర్యసంపన్నునిన్
కన్నారన్‌గని తోడసాగెనపుడు త్కర్షప్రకారాప్తి సం
పన్నాత్ముండగు లక్ష్మణుండు జననీస్వాంతంబురంజిల్లఁగా
మిన్నందన్ జనకుండుగాంచి యఁట స్వామీ! ఆంజనేయప్రభూ! 160

గణనాథుండు కుమారుఁ డాశివునివెన్కన్‌సాగు చందంబునన్
మునినాథాగ్రణి కౌశికుండు కడుసమ్మోదంబుతో ముందుగా
జనుచుండన్ వెనువెంటసాగి రమితోత్సాహంబుతో రామ ల
క్ష్మణులచ్చో కనువిందొనర్చుచు గిరీశా! ఆంజనేయప్రభూ! 161

అరుణుండొప్పఁగ తూర్పుకొండపయి నాహ్లాదంబుతోఁజేరె నా
సరయూవాహిని ముందు రాసుతులతో సర్వజ్ఞుఁడామౌని త
త్పరుఁడై స్నానముఁజేసి మంగళముగా భావించి బోధించె బం
ధురమైనట్టి బలాదిమంత్రముల బంధూ! ఆంజనేయప్రభూ! 162

తతవిజ్ఞాననిధుల్ బలాతిబలమంత్రప్రాభవాస్త్రంబు లు
ద్గతకీర్తిప్రగతీవిలాసమయముల్ కాలుష్యసంహారముల్
సతతోద్దీప్తమహాస్త్రసంకలితముల్ స్వాస్థ్యప్రకారాఢ్యముల్
హతదాహక్షతసంక్షుదార్తులగు నప్పా! ఆంజనేయప్రభూ! 163

**కౌశికుఁడు వివిధాశ్రమములగూర్చి తెల్పుట**

కలయన్‌జూచిరి రామలక్ష్మణులు నుత్కర్షాంతరంగంబుతో
సెలయేళ్ళన్ మునివాటికాతలములన్ సిద్ధాశ్రమానీకమున్
విలసద్రీతిగ కౌశికుండునుడువన్ విద్వత్ప్రభారూఢులై
నళినీబాంధవుఁడొప్పుచుండగ విధిజ్ఞా! ఆంజనేయప్రభూ! 164

"హరునేత్రాగ్నికి లక్ష్యమై మరుఁడనంగాఖ్యప్రరూఢస్థితిన్
వరలంగా నపుడీశ్వరేచ్ఛ గడుదివ్యంబౌననంగాఖ్యతో
స్థిరసంపత్కరదేశమొప్పె నదెవాసిన్గాంచెనీదేశమై
యరయుం"డంచు వచించె మౌనివరుఁడప్పా! ఆంజనేయప్రభూ! 165

"సరయూవాహిని గంగతోఁగదిసి శశ్వద్ఘోషభంగంబులన్
వరగంభీరవిలాసరూపమలరన్ భాసించె వీక్షింపు" డం
చెరిగించెన్ముని కౌశికుండఁట కుమారేచ్ఛప్రదీప్తంబుగా
సరసోల్లాసవచః ప్రసంగముల శాస్తా! ఆంజనేయప్రభూ! 166

గంగాతీరమనోహరాశ్రమ లత్కల్యాణవృత్తంబులన్
సాంగోపాంగముగాఁగుమారవరు లాస్వాదింపఁగా కౌశికుం
డంగల్వైచుచు చూచుచున్దెలిపె నాహ్లాదైకచిత్తంబుతోఁ
బొంగుల్వారెడుజాహ్నవీగతుల శంభూ! ఆంజనేయప్రభూ! 167

## చంద్రోదయ వర్ణన

తళుకుల్జూపుల తారకాసతులు సాంద్రప్రౌఢిమైఁగొల్వ ని
స్తులవృత్తిన్ వరచంద్రికారుచులు నస్తోకంబుగాఁబర్వ ని
శ్చలుఁడై చంద్రుఁడు రామలక్ష్మణుల విశ్వామిత్రుమౌనీశ్వరున్
కలయన్జూడ ననంగనొప్పె దివిసోకన్నాంజనేయప్రభూ! 168

రజనీకాంతుఁడు నింగిపైనెగడె క్రమస్ఫూర్తిప్రసన్నాత్ముఁడై
సుజనస్వాంతుల రామలక్ష్మణుల నస్తోకప్రభావాత్మునిన్
త్రిజగత్పూజ్యుని గాధిపుత్త్రుగని సంప్రీతిన్ సమర్చించెనాన్
భజధాత్వర్థము సార్థకంబెసఁగ నప్పా! ఆంజనేయప్రభూ! 169

అలుపున్దీరఁగ విశ్రమించిరి నిశీథాంతపర్యంతము
న్నలమాహేశ్వరునాశ్రమంబలర నత్యంతప్రమోదంబుతో
నళినీబాంధవ వంశదీపకులు విజ్ఞానప్రసన్నాత్ములై
విలసత్కౌశిక బద్ధచిత్తులగు చాప్తిన్నాంజనేయప్రభూ! 170

## సూర్యోదయ వర్ణన

బ్రహ్మాస్వాదనతత్పరుండు విలసద్భావాంచితోత్తేజితా
జిహ్మస్వాంతుఁడు కౌశికుండు నఁట సంసేవించెగాయత్రి నా
బ్రాహ్మీవేళను రామలక్ష్మణులతో భానుండుతోషింపఁగా
బ్రహ్మాండంబు తరింపఁగానెసఁగి దేవా! ఆంజనేయప్రభూ! 171

అరుణాంభోరుహకాంతిరేఖలు సముదద్యద్రాగపూర్ణంబులై
ధరణీచక్రమునావహింపఁగ లసద్ధర్మప్రకారంబుగా
వరసిద్ధిన్నుపదేశమింపాదవ దుర్వారాస్త్రమంత్రంబులన్
స్థిరసంకల్పముతోడఁజేసె ముని వాసిన్నాంజనేయప్రభూ! 172

సరయూతీరముదాటి గంగదరి శశ్వద్వేగసంరంభులై
వరగాధేయమునీంద్రునిన్గదిసి ప్రాభాతార్కయోగంబునన్
స్థిరులైపొందిరి శ్రీబలాతిబల సంక్షేమాప్తమంత్రంబులన్
కరమొప్పన్ దగరామలక్ష్మణులు వీఁక న్నాంజనేయప్రభూ! 173

మునిరాజేంద్రుఁడు రామలక్ష్మణుల సమ్మోదంబుతో నంత గ
న్గాని, మాహేశ్వరమౌనిచంద్రుకడ వీడ్కోల్బొంది, మందాకినిన్
మనసారన్గని మ్రొక్కి, యయ్యెడల దన్మాహాత్మ్యమున్ దెల్పుచున్
జని ఘోరాటవిఁజేరె సంభ్రమపునోజన్నాంజనేయప్రభూ! 174

**విశ్వామిత్రుఁడు తాటక మారీచ సుబాహుల వృత్తాంతంబులదెల్పుట**

అలఘోరాటవి సాగుచున్ చటులదైత్యానీకవృత్తాంతముల్
చలమొప్పన్వధియించు తాటకిని దుశ్చర్యప్రగాఢాత్ములౌ
నలక్రవ్యాదుల తత్తనూజగత మాయాదౌష్ట్యకార్యంబులన్
విలసద్రీతిఁగఁజెప్పెమౌని కడుదీప్తి న్నాంజనేయప్రభూ! 175

"కనియెన్దాటకి సుందుదైత్యువలనన్ గ్రవ్యాదులుప్పొంగ పు
త్రునిమారీచుని వంచనాపరు దురుద్యోగప్రకారాత్మునిన్
ఘనమాయాకలనోద్ధతున్ చటులసంఘాతప్రఘాతోద్భటున్
మునిబాధాకరు"నంచుచెప్పెముని శంభూ! ఆంజనేయప్రభూ! 176

"ధనధాన్యంబులకిక్కయైచెలఁగు సిద్ధంబైనదేశద్వయం
బెనలేకుండ కరూశ మల్దములనన్ గృష్టప్రకారాప్తి స
జ్జనవాసంబుగ్రసించు తాటకికి వాసస్థానమచ్చోటు క
న్గొనుఁడంచా"మునిచెప్పె రాజిలఁగబంధూ! ఆంజనేయప్రభూ! 177

"మత్తేభేంద్రసహస్రశక్తియుత సంయక్క్రూర్యసంరంభ దు
శ్చిత్త ప్రాభవ తాటకాసుర సముచ్ఛేదించు దుర్వృత్తిమై
సత్తేజోనిధులన్ తపోధనుల ధ్వస్తస్ఫూర్తులన్జేసి యా
మిత్తిన్గొట్టు"మటంచుఁబల్కెనఁట స్వామీ! ఆంజనేయప్రభూ! 178

"అబలయ్యున్ వెనుదీయకచ్చట నగస్త్యస్వామిపైదూకఁగా
ప్రబలాకారముతోడ తాటకి మహారంభంబుతోదాని ప్రా
భవశౌర్యంబులణంచె మౌని యదెక్రవ్యాదోద్ధతాకారమున్
ధ్రువరీతిన్ గను"మంచుఁజెప్పె ముని బంధూ! ఆంజనేయప్రభూ! 179

## తాటకను వధింపుఁడని విశ్వామిత్రుఁడాజ్ఞాపించుట

"ప్రబలాకారముతోడ ఁదాటకయు క్రూరస్ఫూర్తిమైగాంచుచున్
గబళింపన్జనుదెంచె దానిఁగనుమీ! ఖండింపుమీ! రామ! నీ
వబలంచున్మదినెంచకుండ"నన నార్యప్రోక్తవాక్యంబు నా
శివసంకల్పమటంచునెంచెను బ్రశస్తి న్నాంజనేయప్రభూ! 180

గుర్వాజ్ఞన్శిరసావహించి చటులక్రోధాగ్ని జృంభింపఁగా
గర్వాంధప్రతివీరదర్పహరుఁడై క్రవ్యాదఖండించి తా
నుర్విన్డుల్లఁగఁజేసె రాముఁడట బుద్ధ్యుత్సాహముల్మించఁగా
దుర్వారోద్యమకార్యధుర్య! బుధబంధూ! ఆంజనేయప్రభూ! 181

అవనిన్బడ్డ మహానగంబనఁగ భూమ్యాకాశమధ్యంబునన్
జవసత్త్వంబులడంగ తాటకపడెన్ సౌమిత్రిమిన్నంది యా
శివసంకల్పముసిద్ధిపొందెనని సంసేవించె శ్రీరామునిన్
స్తవముల్జేసిరి మౌనిచంద్రులఁట శాస్తా! ఆంజనేయప్రభూ! 182

కనఁగారాని విధంబుగా నసురసంఘాతంబు వర్షంబుగా
ఘనపాషాణములొప్పఁజేయ, ఋషిలోకంబొప్పఁగానంత న
మ్మునిరాజాజ్ఞ వధించె రాముఁడు మహామోదంబుదైవార త
ద్దనుజానీకవిషాదముల్గదుర శాస్తా! ఆంజనేయప్రభూ! 183

శిరమున్వంచినమస్కరించె మునికిన్ శిష్యుండు శ్రీరాముఁడు
ద్ధురరీతిన్ కృతకృత్యుఁడైయొసఁగి సంతోషప్రపూర్ణాత్ముఁడై
వరమౌనీంద్రుఁడు కౌశికుండరసి భవ్యప్రాభవాశీస్సులన్
మెరయన్జేసెను రామలక్ష్మణుల స్వామీ! ఆంజనేయప్రభూ! 184

ఇనవంశోద్భవుశౌర్యసంపదల రాకేందుండుమిన్నంది క
న్గాన నేతెంచెనొ నాఁగ మింటఁగనువిన్నున్‌జేసె జీవాళికిన్
మునిగాధేయుఁడు రామలక్ష్మణులతో మోదంబుతోనుండె నె
మ్మనమారంగ నిశీథమున్ గడచె భీమా! ఆంజనేయప్రభూ! 185

అరుణుండొప్పఁగ (గౌగిలించెను సహస్రస్ఫారహస్తంబులన్
గురుశిష్యుల్ ముదమొందగా భువిని సాకూతంబుగావాయువుల్
పరఁగన్‌వీచె నుపాసనావిధుల నావాసంబులుప్పొంగె సుం
దరతత్త్వంబుల సృష్టిచూపెను మహాత్మా! ఆంజనేయప్రభూ! 186

ప్రాచీసంధ్య నుపాసనాక్రమవిధుల్ భక్తి ప్రపన్నాత్ములై
వీచిస్ఫూర్తులనిర్వహించి ఋషిరాడ్వేగంబుతో సాగుచున్
వాచాప్తిన్ గనరాని యాశ్రమకథల్ వర్ణింపగా రాసుతుల్
ఆచార్యానుగతిన్ గమించి వినిరప్పా! ఆంజనేయప్రభూ! 187

## మారీచ సుబాహుల (బ్రహరించుట

"నేలంగూలెను తాటకాసుర మదాంధీభూతచేతస్క యా
భీలస్ఫూర్తిని యజ్ఞవిఘ్నకలితోగ్త్రేరక్రియానీచులన్
గూలన్‌ద్రోతుము యాగలగ్నమెపుడొక్కో"యంచు ప్రార్థించి రు
జ్జ్వలరీతిన్ మునినంత రాసుతులు దేవా! ఆంజనేయప్రభూ! 188

"షడహోరాత్రములెన్నగాఁ సవనరక్షస్ఫూర్తిగావింప ని
య్యెడసంసిద్ధులుగానెసంగుఁడని" సర్వేశప్రసన్నాత్ముల
క్కడ విన్పించిరి రామలక్ష్మణుల కుత్కర్షంబుతో, రాసుతుల్
గడుదీక్షన్ గురునాజ్ఞదాల్చిరి శుభంగా! ఆంజనేయప్రభూ! 189

ఆచార్యోత్తమునాజ్ఞ నొదలను నత్యంతప్రమోదాప్తిఁజి
ద్రోచిస్ఫూర్తివహించి యారుదినముల్ రోధించె నచ్చోట మా
రీచప్రాభవశక్తియుక్తులను దోర్వీర్యంబుతో రాముఁడ
ద్వాచీనప్రగతిన్ జగంబుదనరన్ దేవా! ఆంజనేయప్రభూ! 190

నిర్విఘ్నంబుగ యాగమొప్పుతరి విన్వీధీతలంబంతటన్
బర్వెన్ దుర్భరమౌ భయంకర మహాధ్వానంబు దిగ్భ్రాంతిమై
నుర్వీమండలమెల్లఁజొచ్చె సవనోద్యోగప్రకారాత్ములై
సర్వేశున్మదినెంచ యాజకులు శాస్త్రా! ఆంజనేయప్రభూ! 191

గ్రావాభీల మహాసురోత్కర చలద్రావ ప్రచండార్భటిన్
ప్రావృట్కాల మహాంబువాహభవ ధారాస్ఫారనీరాకృతిన్
స్రావంబై రుధిరప్రసారమెసఁగెన్ సర్వక్రతూపస్థలిన్
భావాతీతగతిన్ మునుల్దనర దేవా! ఆంజనేయప్రభూ! 192

క్రతువేదుల్ రుధిరప్రసారమయమై క్రవ్యాదభూయిష్ఠమై
నతిభీతావహమై నసహ్యకరమై నార్తి ప్రకారాప్తిమై
చ్యుతిమీరన్ గని మానవాస్త్రమున సంక్షోభంబు వారింప ను
ద్ద్యుతి మారీచునిగొట్టె రాముఁడు ప్రదీప్తిన్నాంజనేయప్రభూ! 193

కన మారీచుఁడు వార్ధిలోనపడియెన్ గష్టాత్ముఁడై నూఱు యో
జనముల్దాటి సుబాహునంత ననలాస్త్రంబున్ప్రయోగించి భూ
మినిలేకుండఁగఁజేసె భస్మముగ గంభీరాత్ముఁడా రాముఁడ
మ్మని గాధేయుఁడు సంయముల్పొగడ శంభూ! ఆంజనేయప్రభూ! 194

అనిలాస్త్రంబున దైత్యులెల్లఁజెదర న్నాకాశదేశంబునన్
ఘనరీతిన్ జిరుఖండఖండములుగా ఖండించె వెన్నంటి య
య్యిన వంశోద్భవుఁడుక్కుమీర ఘనమౌనీంద్రస్తుతుల్‌బర్వ న
మ్మునినాథుండు ముదంబుతోమెరయ శంభూ! ఆంజనేయప్రభూ! 195

"తనియన్‌జేసితివయ్య! రాక్షసమదాంధత్వంబు ఖండించి నీ
జనకుండొయ్యనబంచినందులకు శశ్వద్కీర్తి మిన్నందె నా
శ్రమ సిద్ధాశ్రమనామమియ్యెడల సంప్రీతిన్‌విరాజిల్లుచు
న్నని చెప్పెన్‌ముని రామచంద్రుగని దేవా! ఆంజనేయప్రభూ! 196

అమితానందమునొందెఁ గౌశికుఁడు శిష్యస్ఫారశౌర్యంబు సం
యములెల్లన్ గొనియాడుచుండ నుతియందైక్యానుభావంబుతో
శ్రమదీరన్ నిశిబోయెభద్రగతి, పూర్వస్ఫారశైలంబుపై
మమకారంబునఁదోచె భానుఁడు, మహాత్మా! ఆంజనేయప్రభూ! 197

### విశ్వామిత్రుఁడు రామాదులతో మిథిలకుఁజనుట

కన సంధ్యాదులనాచరించి ముదమొల్కన్‌గాంచి యాచార్యుతో
"మునిలోకోత్తమ! భావికార్యవిధి నుద్బోధింపవే"యన్న రా
మునితో కౌశికుడంతఁబల్కె "మిథిలన్ మున్ముందుగాఁజేరి నా
జనకక్ష్మాపతిఁగాంచనొప్పునని" శాస్త్రా! ఆంజనేయప్రభూ! 198

"జనకక్ష్మాపతినామ మాతనికడన్ సార్థక్యమై జెల్లు భూ
జనులన్ గంటికి రెప్పగాఁగనుచు సౌజన్యంబుతోఁబ్రోచు పెం
పున ధర్మంబుచరించెనో యనఁగ నాభూపాలుడింపొందు వే
చని యారాజమునీంద్రుఁగాంత"మనె శాస్త్రా! ఆంజనేయప్రభూ! 199

"మిథిలేశుండు మహాతపస్వి కడుసంప్రీతిన్‌జనానీకమున్
ప్రథితుండై పరిపాలనన్‌జలుపు సంభావింపఁగానార్యు లా
పృథివీశున్‌గనినంత మంగళమగున్ విచ్చేయఁగాఁబిల్చె నె
మ్మదితోఁబోద"మటంచు మౌనియనె భీమా! ఆంజనేయప్రభూ! 200

"రౌద్రస్ఫారమహాభయావహము సూర్యప్రాభవోత్కీర్ణ ము
ద్యద్రత్నద్యుతిసారపుంజము మహద్భారోన్నతాగంబు స
ద్భద్రస్ఫూర్తి విరాజితంబునగు శుంభచ్ఛైవకోదండమున్
భద్రా! గాంతుమఁ"టంచుఁ జెప్పె ముని దేవా! ఆంజనేయప్రభూ! 201

మునులున్ శిష్యులు రామలక్ష్మణులు సమ్మోదంబుతోసాగి ర
మ్మునిరాజేంద్రునితోడ నుత్తరపు దిగ్భూమీప్రదేశంబుగా
ఘనసిద్ధాశ్రమమందునుండి మిథిలక్ష్మాపాలకున్‌గాంచ స
జ్జన భావాంచితకార్యధుర్య! విబుధేశా! ఆంజనేయప్రభూ! 202

సకలోపాశ్రితవర్గమున్‌మెరయ విశ్వామిత్రుఁడున్‌జేరె న
య్యకలంకోత్తమవాహినిన్ ప్రథితశోణాఖ్యంబు మార్తాండుడున్
ప్రకటస్ఫూర్తిని పశ్చిమాద్రితటి సంభావింపఁగాసాగుచో
సకలోర్వీనుత! రాజువచ్చెనఁట శాస్తా! ఆంజనేయప్రభూ! 203

## విశ్వామిత్రుఁడు స్వీయచరిత్రాదులను దెల్పుట

జిజ్ఞాసాత్ములు శిష్యవర్యులఁట సంసేవింప గాధేయుఁడా
త్మజ్ఞానప్రదమైన స్వీయచరితన్ దన్మార్గమధ్యంబునన్
ప్రజ్ఞారూఢమతిన్‌వచించె విలసద్భంగప్రభోత్తుంగ స
ద్విజ్ఞానాంగ శివానుషంగ కథ లాప్తిన్నాంజనేయప్రభూ! 204

అల షాణ్మాతురుజన్మగాథ కడునాహ్లాదంబుతోఁదెల్పె నా
జలధిన్ద్రవ్విన సాగరుల్వెలయు భాస్వద్గాథలన్దెల్పె సం
కలితాత్ముండల గాధినందనుఁడు నుత్కంఠంబుతో శిష్యులు
జ్జ్వలచిత్తంబున నాలకించిరి మహేశా! ఆంజనేయప్రభూ! 205

"ఇది యిక్ష్వాకునరేంద్ర నిర్మితము సర్వేశప్రభాత్తంబు శ్రీ
పదమైయొప్పు విశాలనామగరిమన్ ప్రఖ్యాత ముర్వీశసం
ప్రథితోత్ఫుల్లయశోవిశాలము బుధారాధ్యప్రగీతంబులన్
కథితం బౌనని"చెప్పె మౌని కడువీఁకన్నాంజనేయప్రభూ! 206

పరమోద్వేగముతో వచించెనఁట విశ్వామిత్రుఁడా శక్రుఁడు
ర్ధురకామాంధుఁడహల్యతోఁగలయుటన్ దోడ్తోడవీక్షించి యా
వరమౌనీంద్రుఁడు గౌతముండిడినశాపంబున్ పరీహారమున్
చరితార్థంబుఁగ రాకుమారులకు నీశా! ఆంజనేయప్రభూ! 207

ముల్లోకంబులుగానకుండఁగ హిమాంభోమగ్న పద్మాకృతిన్
కల్లోలాత్తమతిన్నహల్యతనరె నుత్కంఠస్ఫూర్తిమైలేచి యా
చిల్లోలాత్ముని రామచంద్రుగని సంసేవింపఁగానంత న
య్యుల్లోకోద్ధతశాపమున్దొలఁగె బంధూ! ఆంజనేయప్రభూ! 208

చని యీశాన్యమునందు రాజిలెడు విస్తారప్రదేశంబునన్
ఘనతేజోన్నతయజ్ఞశాలకడ కుత్కర్షోన్నతిన్జేరె న
మ్మునినాథాగ్రణి కౌశికుండెసఁగి సమ్మోదంబుతో శిష్యులున్
ఘనపాదుల్ మునులొప్పిరాఁగ కడువీఁకన్నాంజనేయప్రభూ! 209

**విశ్వామిత్రునికి జనకుఁడాతిథ్యమునిచ్చుట**

విశ్వామిత్రమహర్షి శిష్యతతితో విచ్చేయుటల్ గాంచి యా
విశ్వఖ్యాతుఁడు ధర్మవేత్త కడుసేవించెన్ప్రసన్నాత్ముఁడై
శశ్వత్ప్రాభవులుల్లసిల్ల జనకక్ష్మాపాలుఁడర్ఘ్యాదులన్
విశ్వస్ఫూర్తినొసంగెనయ్యెడల దీప్తినాంజనేయప్రభూ! 210

గణనాథుండు కుమారుఁడున్ గలసిరాన్ గంగాధరుండయ్యెడన్
కనఁగావచ్చెననంగ కౌశికుఁడు విక్రాంతోల్లసచ్ఛిష్యుఁడై
జనకక్ష్మాపతిచెంతఁజేరెనఁట శశ్వద్రీతిమై క్షేమముల్
కనుగోఁగోరుచు పృచ్ఛచేసె బతి వీఁకన్నాంజనేయప్రభూ! 211

వరయోగంబును క్షేమముల్దెలిపి సంభావించి తద్వైఖరిన్
స్థిరశౌర్యుల్ రఘురామలక్ష్మణుల నుత్తేజంపువృత్తాంతముల్
ఎఱుఁగన్జెప్పెను గాధినందనుఁడు, రాజేంద్రుండు గాంక్షింపఁగా
వరయాగోత్తమశాలయున్ మెరయ దేవా! ఆంజనేయప్రభూ! 212

జనకక్ష్మాప పురోహితుండు విమలస్వాంతుండు వేమారు చిం
తనముల్వీడఁగ పృచ్ఛఁజేసెను శతానందాఖ్యుఁడచ్చోట చెం
తనునిల్చుండి యహల్యగూర్చి కడుసంతాపించు చిత్తంబుతో
మునిమాన్యున్ రఘురామలక్ష్మణుల శంభూ! ఆంజనేయప్రభూ! 213

"తనరన్ శాపముఁదప్పెనే! తుదకుశాంతంబొప్పఁగా గౌతముం
డొనరన్నంత నహల్యతోగలసెనే! యోగంబుదైవారఁగా
ఘనమౌనాశ్రమమొప్ప నమ్మునియు నాక్రాంతోల్లసత్స్వాంతుఁడై
కనఁగావచ్చెనె"యంచు నాతఁడనె వీఁక న్నాంజనేయప్రభూ! 214

నయమొప్పన్ మునికౌశికుండఁట శతానందున్‌బ్రశంసించి "చి
న్మయుఁడౌ గౌతమ సంయమీంద్రుఁడట సన్మానించెనాతల్లి దు
ర్వ్యయచిత్తంబు పవిత్రమై తనరె నీరామాభియోగంబునన్
దయవర్షింపఁగ"నంచుదెల్పెను మహాత్మా! ఆంజనేయప్రభూ! 215

## శతానందుఁడు విశ్వామిత్రుని వృత్తాంతముఁదెల్పుట

నవచైతన్యముఁ బొంగినట్లుగ శతానందుండు మోదంబుతో
స్తవమున్‌జేయుచు రామచంద్రుగని విస్తారప్రకర్షాప్తి "నీ
శివతేజాత్ముఁడు కౌశికుండొసఁగు నాశీఃపూర్వవాక్యంబులన్
నవరీతిన్‌శుభమొందనేర్తు"వని నంతన్నాంజనేయప్రభూ! 216

"పలుకన్‌శక్యమె! యేరికైన మునివిశ్వామిత్రుమాహాత్మ్యమున్
బలుఁడై క్షత్రియతేజమున్‌దనర సంభావింపఁగాఁగోవిదుల్
కలితప్రాభవుఁడైన కౌశికుఁడు విక్రాంతిన్ ధరన్నేలె స
త్ఫలమున్‌గూర్పఁగ"నంచుఁజెప్పె బుధుఁడప్పా! ఆంజనేయప్రభూ! 217

"ఒకనాఁడొప్ప వశిష్టసంయమి నుద్యద్రీతిసేవించి య
య్యకళంకాత్మునిఁ గౌశికుండడిగె నత్యంతోల్లసన్మూర్తియై
ప్రకటప్రాభవఁ గామధేనువును స్వార్థంబొప్పు కార్యార్థియై"
చకితుండైముని "యివ్వలేనన" మహేశా! ఆంజనేయప్రభూ! 218

"ధరణీశుండల రత్నహారియను సిద్ధంబైనలోకోక్తి బం
ధురరీతిన్‌మదిలోననెంచి యపుడుద్యోగించి దర్పోద్ధతిన్
వరశిష్టాప్తు వశిష్ఠుపైనెగసి విశ్వామిత్రుఁడచ్చోట సం
గరవృత్తిన్‌గొనఁజూచె గోవు"నని వేగన్నాంజనేయప్రభూ! 219

ఁనయభ్యర్థన గాదటంచనఁగ నత్యంతాగ్రహోదగ్రుఁడై
ఁనాథుండు బలాత్కరించె విపులాస్త్రస్ఫూర్తులన్ ధేనువున్
ఁనిదేవుండు వశిష్ఠుఁడల్గి కడుసంరంభంబుతోఁబోరి దా
ఁ రక్షించె"నటంచు విప్రుఁడనెకాన్తి న్నాంజనేయప్రభూ! 220

ఁవీరోద్ధత శస్త్రజాలములు, శుష్కంబై నశింపంగ సం
ఁమందున్గనియంత నిశ్చలమతిన్ గాధేయుఁడా బ్రహ్మదు
ఁరతేజంబు దపస్సునన్గడవఁగా సాధ్యంబటంచెంచి దు
ఁరవృత్తిన్దపమాచరించె"నని దేవా! ఆంజనేయప్రభూ! 221

ఁటురీతిన్దపమాచరింప ధరకంపబొంద వెయ్యేండ్లు ను
ఁటవృత్తిన్ ఋషియయ్యెకౌశికుఁడు; దుర్వారప్రదీప్తాత్ముఁడై
ఁబుదీక్షాప్తి సహస్రవత్సరము లత్యంతోద్ధతిన్జేసి ప్ర
ఁటమౌరీతి మహర్షియయ్యె"నని శంభూ! ఆంజనేయప్రభూ! 222

ఁతిఘోరోద్ధతి నాచరింప దపమా యబ్జాసనుండంత స
ఁమతిరాజర్షిఁగ నియ్యకోల్దెలిపె, "సంభావింపఁడే! బ్రహ్మసం
ఁతినా"కంచు తపించిమించె పటుగాకన్జేరి బద్ధాత్ముఁడై
ఁతిలోకోత్తరుఁడైన కౌశికుఁడు" భీమా! ఆంజనేయప్రభూ! 223

ఁశరీరంబున దేవలోకమును శశ్వద్వృత్తిమైఁబొంది స
ఁశమున్గాంచ త్రిశంకుభూవరుడు సద్యస్ఫూర్తిమైఁగోర సు
ఁశమస్థేయు వశిష్ఠసంయమిని; తద్భావంబసాధ్యంబు, నా
శమున్గా"దనితెల్ప, తేఁడలిగె దేవా! ఆంజనేయప్రభూ! 224

గురుపుత్త్రాదులతో త్రిశంకుఁడటు వాక్రుంచ్చంగ నమ్మాట, బం
ధురకోపంబున "కాదుపొమ్మ"నిరి, క్రుద్ధుండౌచు గాధేయు సు
స్థిరదీక్షాపరతంత్రుఁజేరి కడునుద్వేగంబుతోఁగోరఁగా,
మరుమాటాడక సమ్మతించె"ననె ప్రేమ న్నాంజనేయప్రభూ! 225

"వరదీక్షాపరుఁడైన కౌశికుఁడు దివ్యంబైనలోకంబునన్
స్థిరమైయుండ త్రిశంకుబంపుటయు, నాదేవేంద్రుఁ డాతేని ను
ద్ధురవృత్తిన్ బతితుండుగా నవనిపైఁద్రోయంగ వీక్షించి, య
న్నరపాలున్ దివి మధ్యనిల్పె"నని నంతన్నాంజనేయప్రభూ! 226

"కలకాలంపు తపోబలంబొలయ చొక్కంబైననాకంబు రం
జిలసృష్టించెను కౌశికుండచట వాసిన్ జేనికై క్రొత్తగా
వలనొప్పన్ సకలాంగముల్మెరయ భావస్ఫూర్తిమై దేవతల్
కలయన్గాంచగ"నంచుజెప్పె బుధుఁడెక్కన్నాంజనేయప్రభూ! 227

"అలబ్రహ్మర్షిపదంబుగోరి యఁట బ్రహ్మాండంబు భేదిల్లగా
చలమొప్పన్దపమాచరించునెడ, నాశ్చర్యంబుతో గౌశికుం
డెలనాగన్సురసుందరిన్గని ప్రమోహించెన్మరుల్గొల్ప, న
ల్లలనన్గూడి తనూజనొందె"నని లీల న్నాంజనేయప్రభూ! 228

"మదనప్రేరణ మేనకన్గదిసి సంరంభంబుతోసాగు నె
మ్మది గాధేయుఁడు నిగ్రహించి కడునాత్మజ్ఞాన సంశుద్ధి న
ప్పిధి నాజ్ఞన్దలపోసి తప్పుఁడయి నిర్విఘ్నంబుగాఁజేసె స
ద్విధిమై ఘోరతపంబు"నంచెరుగఁజెప్పె న్నాంజనేయప్రభూ! 229

గాధేయాంచిత గాఢదుర్భర తపోగ్రప్రస్ఫురత్తేజముల్
శ్రీధామంబును జేరిమించగ మహాసింధుప్రవాహోర్భటుల్
వేదస్ఫూర్తులనావహింప గని సంవేద్యప్రసన్నాప్తి నా
గాధేయున్ హరి మెచ్చుటల్ దెలిపె వీఁకన్నాంజనేయప్రభూ! 230

"పరమేష్ఠిప్రముఖుల్ వశిష్టమునియున్ బ్రహ్మర్షిగాఁగౌశికున్
స్థిరచిత్తంబున సమ్మతింపఁగ లసత్తేజాప్తిమై నర్కుఁడున్
కరమానందముతోడనొప్పె విధుఁడుత్కర్షంబుతోరాజిలెన్
నరుదౌరీతిగ" నంచువిప్రుఁడనె దేవా! ఆంజనేయప్రభూ! 231

"ప్రతిసృష్టిన్నొనరింప దక్షుఁడగు విశ్వామిత్రుఁడన్నింట సం
గతుఁడై మిమ్ములగాంచు ముందెసగి దీక్షాబద్ధుఁడైయొప్పె చి
న్మతులారా! శుభమొప్పుమీకని" శతానందుండు దీవించె స
న్నుతిమీరన్నఁట రాసుతుల్వినఁగ బంధూ! ఆంజనేయప్రభూ! 232

"శివకోదండ మహోద్వరంబు భవదాశీ స్ఫూర్తిఁజెన్నొందదే!
భువనారాధ్యయశోవిశాల! విలసత్పూజ్యప్రభావా! స్వయం
భువతేజా! దయసేయగావలయు సొంపుల్మీఱు శిష్యాళితో
ధ్రువరీతిన్నని" కోరె భూపతియు బంధూ! ఆంజనేయప్రభూ! 233

## శివకోదండగాథను జనకుఁడు వినిపించుట

రమణీయంబుగ శైవచాపకథ విభ్రాజిల్లఁగాఁజెప్పె స
భ్రమరీతిన్ మిథిలేశుఁడిట్లు "ఘన విశ్వాసంబుదైవార మా
నిమిరాజేంద్రుని కీర్తనస్సు మునుసందీప్తిన్ మహేశుండు వి
క్రమవృత్తిన్ దగనిచ్చె నంచ"నుచు వీఁకన్నాంజనేయప్రభూ! 234

"ఆరాజన్యుఁడు దేవరాతుఁడొసగెన్నాహ్లాదమౌరీతి సం
స్ఫారోద్దీప్త శివంకరంబు విలసద్భద్రంబు తేజోమయా
కారబ్రహ్మము రౌద్రమౌధనువు నుత్కర్షంబుగా మాకు నో
ధీరాగ్రేసరులార" యంచనెను దీప్తిన్నాంజనేయప్రభూ! 235

"యాగంబొక్కటిచేయనెంచి తగఁబూర్వాంగంబుగా నేను భూ
భాగంబొప్పఁగ దున్నుచుండుతరి మద్భాగ్యంబురంజింపఁగా
వేగన్దోచెను నొక్కబిడ్డ యటులుర్విన్బుట్టుటంజేసి భూ
యోగాంశంబున సీతయయ్యె"నని శంభూ! ఆంజనేయప్రభూ! 236

మనముప్పొంగఁగ శైవచాపకథ సంభావింపఁగాఁజెప్పి స
జ్జనులున్మెచ్చెడి సీతజన్మకథ శశ్వద్రీతిమైఁదెల్పి న
మ్మునినాథున్ రఘురామలక్ష్మణుల శంభుస్ఫూర్తిఁగీర్తించి య
జ్జననాథాగ్రణి వారిఁదెచ్చె సభ కీశా! ఆంజనేయప్రభూ! 237

## సీతాస్వయంవరము

మరునాఁడొప్పెను జానకీరమణి సంపన్నప్రభావాత్మ సుం
దరతేజోమయ కాంతిరేఖలలరన్ నందప్రసారంబుతో
వరశిష్యద్వయముల్లసిల్ల ముని విశ్వామిత్రుఁడేతెంచె భూ
వరు సౌధంబువిరాజిలంగ నుడుశోభన్నాంజనేయప్రభూ! 238

అఁటజెప్పెన్ మిథిలేశుఁడంత కడునాహ్లాదంబుతో పూజ్యాలా
దట వీక్షింపఁగ "శైవచాపమును సంధానంబుగావించు న
ప్పటుశౌర్యాత్ముఁడె! జానకీప్రవరుఁడైభాసించు, మీలోన నా
ఘటికుండెవ్వఁడొ? రండుముందు"కని వీఁకన్నాంజనేయప్రభూ! 239

కొండల్మీటెడి దార్ఢ్యమున్మెరయ సంకోచంబులేకుండ మై
కండల్జూపుచువచ్చి చాపముసముత్కంఠంబుతోనెత్తి బె
న్గుండుల్ బోలుచు భూమిపైఁబడిరి యుక్కున్వీడి మైఁదూల ను
ద్దండార్భాటముతోడఁ గొందరఁట వింత న్నాంజనేయప్రభూ! 240

వరచాపంబునునెత్తలేక మది"నప్పొ"యంచు వాపోవుచున్
శిరముల్వంచి సభాస్థలిన్గనక నిస్తేజంబుతోఁగొంద, రు
ద్ధురదుఃఖంబునఁగొంద రయ్యెడ సముద్భూతప్రలాపంబులన్
విరియన్జేయుచు నేగిరంతటట మహాత్మా! ఆంజనేయప్రభూ! 241

తనశిష్యున్ రఘురామచంద్రుఁగనె వాత్సల్యంబు వర్షింప, న
మ్మునిమాన్యుండఁట, శైవచాపముదిశన్ మోదంబుతోఁగాంచ, నా
ఘనుఁడాచార్య మనంబెరింగి గుణమెక్కన్గూర్పఁగాఁబట్టుచో,
ఘనరావార్భటి పిక్కటిల్లె దిశలెక్క న్నాంజనేయప్రభూ! 242

దరహాసంబున నారిఁగూర్పధనువంతన్బూనఁగా రాముఁడా
హరకోదండము మధ్యకున్విరిగె బ్రహ్మాండంబుభేదిల్లఁగా
సురగంధర్వులు దిక్కులన్జెదర నస్తోకప్రభావాత్మునిన్
గరువంబొప్పఁగ కౌశికుండుగనె వీఁకన్నాంజనేయప్రభూ! 243

పదియారేండ్లవయస్సువాఁడు ధనువొప్పన్గూర్ప ఖండంబుగా
మది మాత్సర్యముతోడ ధూర్తు లఁట కంపంబొందుచున్లేచి యా
పదఁగల్పింపఁగ ఁగత్తిదూసిరఁట దుర్భావంబుతో రాముపై
మదగర్వంబులుపెచ్చురేఁగ రణభీమా! ఆంజనేయప్రభూ! 244

ఆర్తత్రాణపరాయణుల్ రఘుకులోద్యద్దీపకుల్ రాసుతుల్
కర్తవ్యంబును మౌనిచూప చటులోగ్రస్ఫార తేజంబుతో
ధూర్తక్షాత్రగణంబు నత్తరి భయోద్భూతాంగులైపారఁగా
నార్తిన్ గుందఁగజేసి రయ్యెడల ధీరా! ఆంజనేయప్రభూ! 245

కడుశ్లాఘించిరి సాధుభూపతులు నుత్కర్షంబుతో కోవిదుల్
ఉడురాజున్గనుచందమొప్ప విలసద్యోగప్రసన్నాత్ములై
వడితోడన్ విరిహారముల్దనర సంభావింపనా మౌని యి
బ్బడియాశీస్సులఁ దేల్చె రామవరునప్పా! ఆంజనేయప్రభూ! 246

జనకక్ష్మాపతి, శౌర్యశుల్కయగు భూసంజాతయౌసీత స
జ్జనమాన్యన్ రఘురామచంద్రునకు నుత్సాహంబుతో నివ్వఁగా
మనమందూహనుచేయుచుండుటను బ్రహ్మర్షిప్రశంసింపఁగా
వినిపించెన్ సభయెల్లమెచ్చ శుభగాప్తి న్నాంజనేయప్రభూ! 247

దరహాసాంచిత దృఙ్మరీచికల సిద్ధప్రాభవున్ రామునిన్
పరమానందముతోడ గాంచెను ధనుర్భంగప్రకారోన్నతున్
ధరణీపుత్త్రిక జానకీరమణి చేతస్స్ఫూర్ర పీఠంబునన్
వరరీతిన్దగ నుంచెనయ్యెడల దేవా! ఆంజనేయప్రభూ! 248

వరగాధేయమునీంద్రునాజ్ఞ మదిసంభావించి సీతావధూ
వరుగా నార్యులు రాఘవోత్తముని దివ్యస్ఫూర్తిమైనెంచు సు
దరవృత్తంబును కోసలేంద్రునకు మోదంబొప్పగాఁదెల్ప భూ
వరుడొప్పన్దగఁబంపె విప్రులను బంధూ! ఆంజనేయప్రభూ! 249



పురముఖ్యంబు నయోధ్యఁజేరి విలసత్ప్రాజ్యోన్నతుల్ విప్రపు
ప్వరభూపాలుని కోసలేంద్రుగని సంభావించి రాజిల్ల సుం
దరసీతారఘురామ మంగళకరోద్వాహంపు వృత్తంబు దె
ల్పిరి రాణుల్విని యుల్లసిల్ల శుభగాప్తి న్నాంజనేయప్రభూ! 250

అమితానందముబొంది దాశరథికల్యాణంబు గావింపఁగా
ప్రమదానీకముతోడ మంత్రివరు లాప్తశ్రేణియున్గొల్వఁగా
మమకారంబున కోసలేంద్రుఁడఁట క్షేమంబొప్ప నేతెంచె సం
భ్రమరీతిన్ మిథిలేశుసౌధమున కప్పా! ఆంజనేయప్రభూ! 251

**రామభరతలక్ష్మణ శత్రుఘ్నుల వివాహము**

తనరన్నుత్తరఫల్గుణీకలిత శస్తంబౌముహూర్తాన రా
మునికిన్ సీతకు బెండ్లిగాఁదెలిపె సమ్మోదప్రకారోన్నతిన్
జనకక్ష్మాపతితోడ నాదశరథక్ష్మాపాలుఁ డుప్పొంగఁగా
ఘనుఁడైనట్టివశిష్ఠమౌని కడువేఁక న్నాంజనేయప్రభూ! 252

జనకుండివ్వఁగనెంచె జానకిని నైక్ష్వాకుల్మదిన్మెచ్చ స
జ్జనమాన్యుండగు రామచంద్రునకు శశ్వద్రీతినవ్వేళ గ
న్గొనసౌమిత్రికి నూర్మిళారమణి సంతోషంబుతోఁగూర్పఁగా
మనమందెంచెను పూజ్యులెల్లఁగన నాత్మన్నాంజనేయప్రభూ! 253

జనకక్ష్మాపతిసోదరుండు ప్రథితస్ఫారప్రభావుండు స
జ్జనమాన్యుండు కుశధ్వజుండు ముదితస్వాంతంబుతో మాండవిన్
వనజాక్షిన్ భరతుండుగైకొనఁగ భాస్వద్రీతిశత్రుఘ్నుకున్
వినయాత్మన్ శ్రుతకీర్తి నిచ్చె శుభగాప్తిన్నాంజనేయప్రభూ! 254

కన్యాదాత పరిగ్రహీత కులసక్తస్ఫూర్తిమద్గోత్రముల్
ధన్యత్వంబునుబొంద వాకొనిరి సంధాతల్వశిష్ఠాదులున్
కన్యాదాన ముహూర్తవేళ మహిమోత్కర్షప్రకర్షాప్తిమై
అన్యోన్యప్రముఖాత్మలున్గదియ నప్పా! ఆంజనేయప్రభూ! 255

జలమున్బోయఁగ ధర్మపత్ని, జనకక్ష్మాపాలుఁడుద్దీప్తి నం
జలిగావించి, పదంబులన్గడిగి, వంశస్ఫూర్తి వర్ధిల్ల గా
నళినాక్షీమణి సీతనిచ్చె వరుఁడానందాత్ముఁడైయొప్పఁ గ
న్యలఁ దానిచ్చెఁగుశధ్వజుండటుల దేవా! ఆంజనేయప్రభూ! 256

మాంగల్యంబులలంకరించిరి వధూమాన్యల్ప్రమోదింప నా
శృంగారప్రముఖుల్ కుమారవరు లాశీర్వాదమధ్యంబునన్
రంగత్తూర్యనినాదముల్ జెలఁగఁగా రామామణీగీతముల్
పొంగుల్వార ముహూర్తకాలమున శంభూ! ఆంజనేయప్రభూ! 257

సీతారాముల పెండ్లిసంబరము వీక్షింపంగనేతెంచి భూ
జాతవ్రాతమునుల్లసిల్లె దివిజస్వాంతంబురంజిల్లె నా
పాతాళాంతరసీమవాసులును విభ్రాజిల్లిరుప్పొంగుచున్
ప్రీతిన్బొందిరి నూత్నదంపతులు దీప్తిన్నాంజనేయప్రభూ! 258

చిరునవ్వుల్ చుబుకంబుపై మెరయఁగా సీతావధూటీమణీ
వరవీక్షారుచివీచికా ప్రగతు లుద్భాసిల్లె శ్రీరామునిన్
స్థిరరాగాంబుధి నోలలాడు నటులాప్తిన్జేసి జన్మాంతర
స్ఫురణన్దెచ్చె రమాధవుండనఁగ శంభూ! ఆంజనేయప్రభూ! 259

రుచిరాన్నంబులు పంచభక్ష్యతతులా రూఢస్ఫురచ్ఛాకముల్
ప్రచురంబౌఫలముల్ రసాయనము లొప్పన్నిచ్చెనాతిథ్యమున్
రుచిరస్వాంతముతోడ భూసురుల కారూఢిన్ప్రసన్నాత్ముఁడై
శుచిమంతుండు విదేహరాజ్యవిభుఁడచ్చో నాంజనేయప్రభూ! 260

గోదానంబుల భూప్రదానములఁ బ్రాగ్పూర్వాభిముఖ్యంబుగా
వేదోక్తప్రగతిన్ ద్విజోత్తముల కుద్వృత్తిన్ సమర్పించె న
య్యాదోనాథసుతాకళత్రు మదిలో నారాధనన్జేసి యా
శ్రీదుండౌమిథిలేశుఁడంత శుభమూర్తీ! ఆంజనేయప్రభూ! 261

జనకుల్ రాఘవులాప్తబంధువులుగాఁ జంద్రార్కతేజంబు భూ
జనులొక్కుమ్మడి చూచినట్లెసఁగె విశ్వామిత్రునాశీస్సుతో
ఘనసీతారఘురామదంపతుల సింగారించి భూవ్యోమముల్
ప్రణతుల్జేసి చరించినట్లెసఁగె దేవా! ఆంజనేయప్రభూ! 262

జనకుండంత వశిష్ఠకౌశికుల యిచ్ఛాస్ఫూర్తులన్గాంచి నె
మ్మనముప్పొంగ "మహర్షులార! బుధసంభావ్యంబుగాఁ గోసలన్
జనవున్మీర విదేహరాజ్యమును సౌజన్యంబుతో గూర్చు మీ
ఘనవాత్సల్యమునెంతు"నంచనెను వీఁకన్నాంజనేయప్రభూ! 263

**బంధుజనంబునకు వీడ్కోలు**

చతురంబౌ బలగంబులన్ విమలవిస్తారస్ఫురద్భూషలన్
మతివాచస్పతులైనవిప్రులను రమ్యస్త్రీ జనానీకమున్
నుతికెక్కన్ దగురీతినిచ్చె కడుబంధుప్రీతిదైవార భూ
పతి వైదేహుఁడు పుత్రికల్దనర నప్పా! ఆంజనేయప్రభూ! 264

నుతరీతిన్ రఘువంశదీపకులు సంతోషంబుతో మైథిలుల్
మతిలోకోత్తరులైన సంయములు సంభావించి వీడ్కొల్పఁగా
కృతకృత్యుండగు కౌశికుండపుడు సాగెన్ దేవదిక్సీమకున్
ప్రతిలేనట్టితపంబుఁజేయఁగ శివప్పా! ఆంజనేయప్రభూ! 265

## దశరథుఁడయోధ్యకుఁదరలుట

మతిలోకోత్తరులైన మంత్రులును శుంభచ్ఛౌర్యసంపన్నులౌ
చతురస్ఫారబలాధినాయకులు తేజస్ఫూర్తిమన్మూర్తులౌ
చతులోక్తుల్గురిపించు విప్రులును విశ్వాసంబుతోరాఁగ న
ప్రతిమానంబుగసాగె పంక్తిరథుఁ డప్పా! ఆంజనేయప్రభూ! 266

లలనల్ నూత్నవధూవరాంచితులు కల్యాణోత్సవస్ఫూర్తితో
చెలువొప్పన్ మురిపింప పంక్తిరథుఁడుత్సేక ప్రపూర్ణాత్ముఁడై
విలసద్దీప్తి నయోధ్యఁజేరుతరి నావేశంబుతో భార్గవుం
డలుకన్ వారిని నడ్డగించె పరమాత్మా! ఆంజనేయప్రభూ! 267

## పరశురాముఁడడ్డగించుట

జ్వలనుండూర్ధ్వగతిన్జెలంగఁడు, నభస్వంతుండు నిశ్చేష్టుఁడై
యిలపైఁజూచెను, వాయువర్తనము లూహింపంగరాకుండె సం
చలనస్ఫూర్తివహించె భూధరము, లాశల్భ్రాంతిఁ గల్పించె, సం
ధిలగా భార్గవరాముఁడయ్యెడకు దీప్తి న్నాంజనేయప్రభూ! 268

పటురౌద్రాకృతి మిన్నుముట్ట ననలస్ఫారాక్ష విక్రాంతిమై
చటులోదగ్రకుఠారహస్తమును సంచాలించుచున్ భార్గవుం
డఁటకేతెంచి వచించె పంక్తిరథుఁడాహాకారముల్ సేయఁగా
పటురీతిన్ రఘురాముగాంచి వడినొంపన్నాంజనేయప్రభూ! 269

మత్క్షాత్రకులోత్కరాంతకుఁడు బ్రహ్మప్రాభవోద్దీప్తుడు
ద్వృత్తస్ఫార తపోధనుండు విలసద్విద్యాప్రకారుండు వి
ప్రోత్తంసుండగు భార్గవుండు గని "యీరుద్రాప్తకోదండ ము
న్మత్తుండౌచు నెవండుదాకె"నని భీమా! ఆంజనేయప్రభూ! 270

"హరుకోదండము నెక్కుబెట్టి కడుద్రోహస్ఫూర్తిఁబాటించు ము
ష్కరుఁడౌవానిని సంహరింతు జనులుత్కర్షంబుతోనొప్ప మ
ద్గురువర్యుండు శివుండు నెమ్మదిని సంతోషింపగా" నంచు బం
ధురకోపంబునఁబల్కె భార్గవుఁడు బంధూ! ఆంజనేయప్రభూ! 271

**వశిష్ఠమహర్షి పరశురాముని శాంతింపఁజేయుట**

"నగజాధీశ్వరభక్తశేఖర! ప్రసన్నాత్మా! దయసాగరా!
పగతుండెవ్వఁడుగల్గు మిమ్మెదుర సంభావింపగాన"ంచు నా
జగదారాధ్యుని భార్గవున్గని నమస్కారంబు గావించి శౌ
వగతిన్దెల్పె వశిష్ఠమౌని యపుడీశా! ఆంజనేయప్రభూ! 272

'జనకక్ష్మాపతి తత్త్వవేత్త పృథివీజాతోద్వహార్థంబు పా
వనమౌరుద్రుని చాపమెక్కిడుట దేవా! చేసె శుల్కంబుఁగా
జనమాన్యుండగు రాఘవుండరిగి సౌజన్యంబుతోవింట త
ద్గుణమున్గూర్పఁగ భంగమయ్యె"ననెబంధూ! ఆంజనేయప్రభూ! 273

'శివతేజంబు మహాద్భుతంబు బుధసంసేవ్యంబుగానెంచు శ్రీ
నవుఁడైనన్ రఘురాముఁడంచితగతిన్ ధర్మోన్నతిన్వంచె శం
ను వరప్రాభవ శైవకార్ముకము; నుద్బోధింపఁగానేల? మా
నవుడైనన్ రహిదాల్చు నాతఁ"డనె నంతన్నాంజనేయప్రభూ! 274

## భార్గవరాముఁడు శ్రీరామునెఱుంగుట

అల(బ్రహర్షివశిష్ఠ వాక్సుధను నాహ్లాదంబుతోఁగ్రోలి శ్రీ
లలనాధీశ్వరు చాపమిచ్చె వరలీలన్ రామసామర్థ్య మూ
హలజన్నొందఁగ భార్గవుండపు డజిహ్మస్వాంతుఁడై రాముఁడ
వ్వలకేలన్ధరియించె దాని చెలువొప్ప న్నాంజనేయప్రభూ! 275

స్తవమున్జేసెను జామదగ్ని పరమాత్మైకప్రపూర్ణాత్ముఁడై
యవలీలన్ హరిచాపమెత్తి పరమాహ్లాదంబుతోనొప్పు మా
ధవ గౌరీధవ తత్త్వముల్మెరయు సిద్ధప్రాభవస్వాంతునిన్
శివరామున్ రఘురామునిన్ గని ప్రశస్తిన్నాంజనేయప్రభూ! 276

సీతారాములగాంచె భార్గవుఁడు లక్ష్మీవిష్ణుతేజంబుఁగా
నేతద్వైఖరిరూపుదాల్చెననఁగా నిచ్ఛాప్రపూర్ణాత్ముఁడై
స్ఫీతోద్గాఢ రజోగుణోద్ధతగతిన్ భేదించి, శాంతస్థితిన్
ప్రీతిన్జేరె మహేంద్రశైలమును దీప్తి న్నాంజనేయప్రభూ! 277

## దశరథుఁడయోధ్యఁజేరుట

నళినీకాంతుఁడు స్వాగతంబుఁబలుకన్ నవ్యప్రభావోన్నతిన్
విలసద్వైఖరి వేదమంత్రగతులన్ వీవన్ మరుద్వీచికల్
కలపుంస్కోకిల గీతికారవములన్ గన్యావరోత్తంసులున్
వెలయన్, జేరెనయోధ్యఁ బంక్తిరథుఁడాప్తిన్నాంజనేయప్రభూ! 278

వెలయన్బల్కిరి పూర్ణకుంభములతో విస్వీథిలో దేవతల్
కలయన్గాంచుచు స్వాగతంబు బుధులుత్కంఠాప్తి వీక్షింపఁగా
విలసద్దీపిక లెత్తి రింతు లతులాప్తిన్ హారతీప్రస్థితిన్
లలినేతెంచిరి దంపతుల్ పురికి లీలన్నాంజనేయప్రభూ! 279

లలితస్వాంతులు నూత్నదంపతులు నుల్లాసంబుతోనొప్ప సం
కలితానందమయాత్ములై తనరఁగా కాంతామణుల్ రాజ్యమున్
ఫలితాత్ముండు వసుంధరాధిపుఁడు సంభావింపఁగానేలె సం
ధిలుమోదంబున సర్వలోకముల దీప్తినాంజనేయప్రభూ! 280

తెనుగున్‌జేసెను వత్సగోత్రుఁడిల భక్తిప్రాభవోపేతుఁడై
నినుసేవించుచు శ్రీనివాసకవి సందీప్తాంతరంగంబుతో
ఘనరామాయణబాలకాండము లసత్కావ్యోన్నతస్ఫూర్తిమై
జనభావాంచితకార్యధుర్య! పరమేశా! ఆంజనేయప్రభూ! 281

సమాప్తమ్

శుభం శుభం శుభమ్

స్వస్తి

శ్రీవాణీ ప్రసన్నాభవతు





## ప్రార్థన

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

## అంకితము

అంకితంబుగాఁ జేసితి నందుకొనుము
లోక కల్యాణ సిద్ధికై ప్రాకటముగ
సరస సుందర సౌభాగ్య శతకశైలి
నీదు గాథల వినుతించి నీకెయిచట

కడలి జలములఁ గొనివచ్చి కడఁగి మొగులు
మగిడి కడలి కర్పించు నమ్మాడ్కిదోప
దురిత సంహార! తిరుపతి పురవిహార!
రమ్యగుణసాంద్ర! కోదండరామచంద్ర!

# శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణము

## (వాల్మీకి రామాయణమునకు సంగ్రహానువాదము)

## అయోధ్యాకాండము

శ్రీ లీలావతి ఱొమ్ముపైఁగదిసి సంసేవింపఁగా, భూసతిన్
వాలాయంబుగ నయ్యెడన్నునిచి సంభావించుదేవుండు, శ్రీ
ప్రాలేయాచల కన్యకామణికి నారాధ్యుండు, నారాయణుం
డేలన్‌జేయఁగ, వేడుకొందును వచశ్రీ న్నాంజనేయప్రభున్! 1

**దశరథుఁడు శ్రీరామునకుఁ బట్టాభిషేకముఁజేయ సంకల్పించుట**

ఇనబాలున్నుదయాద్రిపైఁగనుచు, నూహించెన్ బ్రమోదాత్ముఁడై
జననాథుండజరాజనందనుఁడు, శశ్వచ్ఛౌర్యసంపన్నునిన్
తనయున్‌రాముని రాజుగానునుప, సద్ధర్మక్రియాలోలుఁడై
జనభావాంచితకార్యధుర్య! గుణతేజా! ఆంజనేయప్రభూ! 2

"చతురంభోధి పరీతభూతలము భాస్వద్రీతిఁబాలించి సం
స్తుతులన్‌గొంటిని, భాస్కరాన్వయము సంతోషంబుతోనొప్ప, స
న్మతులన్‌బుత్రులగంటి, సౌఖ్యములతో మాన్యుండనైయుంటి, భూ
పతులున్‌గొల్వఁగ, నంచు'నెంచె నృపుఁడప్పా! ఆంజనేయప్రభూ! 3

చనువుప్పొంగ, పురోహితాప్త గురు వాత్సల్యప్రపూర్ణాత్ముఁడై
వినిపించెన్ దగురీతి, మంత్రి సచివప్రీతి ప్రకారోన్నతిన్
దనసంకల్పమునంత, పంక్తిరథుఁడత్యంతప్రహర్షాప్తి "నౌ
నని"శ్లాఘించిరి పెద్దలాపనికి దేవా! ఆంజనేయప్రభూ! 4

నుతినాదంబులు మింటిపైకెగసె, సంస్తోత్రంబులున్‌గప్పె ది
క్తతి సీమావధులన్, బ్రపూర్ణగతులై, తాదాత్మ్యభావంబుతో
బ్రతిలేనట్టిప్రజాభిరాముగని, సంభావించుచున్, బెద్దలు
న్నతులై యొప్పిరి, తల్లులుండిరఁట, చెంతన్నాంజనేయప్రభూ! 5

తలపుల్‌మీఱఁగ భూసురోక్త విజయధ్వానప్రకారాప్తి భూ
స్థలిమిన్నంద, నరేంద్రబృంద ధవళచ్ఛత్రధ్వజానీకముల్
వలనొప్పన్ గనువిందుసేయ, ఘనమౌపట్టాభిషేకోన్నతిన్
చెలువంబొందఁగ రాముఁగోరిరి వచశ్రీ, నాంజనేయప్రభూ! 6

## దశరథుఁడు శ్రీరామునిఁ బిలిపించుట

మతివాచస్పతి మంత్రిశేఖరుని సంభావించి రప్పించి, సం
గతిరూపించి, పరాక్రమాఢ్య గుణరాకాచంద్రునిన్ రామునిన్
"పతియాహ్వానముగా" వచించి యఁటకొప్పన్‌బిల్వఁగానంపె నా
క్షితినాథోత్తముఁడార్యసన్నుతుఁడు స్వస్తి న్నాంజనేయప్రభూ! 7

రాజీవాక్షుఁడ, మాత్యశేఖరుని వాగ్రాజీవహారంబు, వి
భ్రాజిత్‌స్ఫూర్తి శిరంబుఁదాల్చి, విలసత్‌స్ఫారాఢ్య సంయానుఁడై
యాజానేయమునెక్కివచ్చెఁ బరమాహ్లాదైక సౌధంబు శ్రీ
రాజోల్లాసముఁజేరఁగా నపుడు ధీరా! ఆంజనేయప్రభూ! 8

అలప్రాసాదముఁజేరి, ద్వారతలముద్యద్దీతిశోభిల్ల, మం
గళరాజాశ్వమునుంచి, రాముఁడపుడుత్కర్షాత్ముఁడైసాగి య
జ్జలజాప్తాన్వయధీరు పంక్తిరథు శశ్వత్పాదరాజీవముల్
చెలువంబొంద నమస్కరించె నుతరాజి న్నాంజనేయప్రభూ! 9

## పట్టాభిషేకవిషయంబును రామునితో దశరథుఁడు చెప్పుట

జనకాజ్ఞన్దలఁదాల్చి స్వర్ణమయ భాస్వద్రత్నపీఠంబుపై
వినయంబొప్పగఁగూరుచుండె రవిదీప్తిన్మించి రాముండు దీ
వనగావించి వచించె పంక్తిరథుఁ"డప్పా! రామచంద్రా! సదా
మనమందొప్పెడుకోర్కె దీర్పు"మని ప్రేమ న్నాంజనేయప్రభూ! 10

"వినవయ్యా! రఘురామచంద్ర! యిఁకనుర్వీమండలంబేను పా
లనగావింపఁగఁజాల, వృద్ధుఁడను, కాలంబాగఁగాఁబోదు, భా
వనఁజేయన్దగు ముక్తిమార్గమును, చిద్భావజ్ఞలన్గూడుచున్
మునివృత్తిన్వహియింపనుంటి"నని శంభూ! ఆంజనేయప్రభూ! 11

"సుతులందగ్రజుఁడౌదు, వగ్రమహిషీస్ఫూర్తి ప్రకారోన్నతిన్
మతిరూపంబులగొన్నధీరుఁడవు, శుంభచ్ఛౌర్యశీలుండ వు
న్నతవృత్తిన్ జనరాగమున్గనిన శాంతస్ఫారభావుండ, వు
ద్గతి నీవౌదువు రాజ్యమేల" నని వీకన్నాంజనేయప్రభూ! 12

"ముదమొప్పన్దగు క్షాత్రధర్మగతి, సంపూజ్యుండుగా, స్వామిగా
పృథివీమండలమందు నగ్రజుఁడె దీప్తిన్జెందు, శౌర్యాత్ముఁడా
ప్పిదుఁడైరాజిలు, నార్యభారతియు సంప్రీతి నిరూపించు నె
మ్మది భావింపఁగ"నంచు రాజనెను ప్రేమ న్నాంజనేయప్రభూ! 13

"అరయన్బుష్యమి తారగాఁబరఁగు, దివ్యంబౌముహూర్తంబునన్,
వరసూర్యాన్వయ పద్ధతుల్ వెలయు, నీపట్టాభిషేకోత్స వం
బరుదౌరీతి ఘటింపనెంచితి సుమీ! హ్లాదైకచిత్తుండవై
ధరణీజన్గని చెప్పుమ"ంచనె మహాత్మా! ఆంజనేయప్రభూ! 14

గురునాజ్ఞన్ శిరసావహించి చనియెన్, గూర్మిన్‌బ్రసాదించు భూ
వరసౌధాంతరసీమవెల్వడి, మహాస్వాంతుండు శ్రీరాముఁడా
తురతన్‌గాంచి బుధుల్‌నుతింప, జలజాప్తున్ లోనదర్శించుచున్
వరణీయంబగు నాత్మహర్మ్యమున కప్పా! ఆంజనేయప్రభూ! 15

నిజసౌధస్థ వితర్దికాతలముపై, నిర్నిద్రచేతస్కుఁడై,
ప్రజలొప్పన్ దగఁజూపు రాగమును సంభావించి, గైకొంచు భూ
భుజాఁడాప్యాయముతోడఁ బల్కిన విధంబున్, లోనవీక్షించుచున్
రజతస్వాంతుఁడు రాముఁడుండె గుణభద్రా! ఆంజనేయప్రభూ! 16

## దశరథుఁడు పట్టాభిషేకావసరమును నిర్దేశించుట

జననాథుండు సభన్‌ముగించి వెడలెన్, స్వాంతప్రబోధాప్తిఁ జ
య్యననేతెంచి, సుమంత్రునిన్‌గనుచు, నత్యంత త్వరోద్దీప్తి నె
మ్మనమొప్పన్ "రఘురాముఁబిల్వుఁడనె"ఁగంపంబొందుకంఠధ్వనిన్
జనిచెప్పెన్నది మంత్రి రామునకు శాస్తా! ఆంజనేయప్రభూ! 17

"మఱలన్‌బిల్వఁగ నేమికారణమొ? సంభావింపమాతండ్రి, నా
కెఱుగన్‌జెప్పె సమస్తసంగతుల, నీయింతన్ హఠాత్కార్యముల్
జఱుఁగన్‌లేదుగదా! వచింపఁగదవే! సర్వంబు నోమంత్రి!" యం
చరయన్‌గోరెను రాముఁడప్పుడు మహేశా! ఆంజనేయప్రభూ! 18

"తెలియన్ రెండవమారుబిల్చుటకు, నుద్దేశ్యంబుగాన్పింపదే?
కలయన్‌గాంచ క్షణంబులోనఁ బతివేగంబొప్పు డగ్గుత్తికన్
బిలువంబంచెను, రామచంద్ర! వినుమీ! వెన్వెంటరమ్మ"ంచు భూ
తలనాథాజ్ఞనుదెల్పె మంత్రి యఁట శాస్తా! ఆంజనేయప్రభూ! 19

పతియాజ్ఞన్గొని మంత్రితెల్పు. పునరాహ్వానంబులోనెంచి, "సం
గతియేమో"యని రాజసౌధమున కుత్కంఠంబుతోనేగె భూ
పతి యుద్విగ్నతతోడ రాముఁగని "యప్పా! జాతకంబందు, సు
స్థితిలోలేవు గ్రహంబు"లంచనె విరక్తి న్నాంజనేయప్రభూ! 20

"కనుపించున్ సతతంబు దుశ్శకునముల్, కష్టప్రవాహంబులో
ప్పెను వెంటన్ బడివచ్చె, మృత్యుగత సంస్ఫీతోద్ధతోద్ఘాతముల్
మనమున్దాకుచు నున్నవయ్య!, గొనుమా! మద్భావమూహించి యీ
ఘనసామ్రాజ్యపు భారమం"చనెను గాక న్నాంజనేయప్రభూ! 21

"ధరణీపుత్త్రికతోడ నీవిపుడు విద్వద్రీతి వేదోక్త బం
ధుర భద్రవ్రత దీక్షతోమెలఁగ నుద్యుక్తుండవైయొప్పుమీ!
వరసామ్రాజ్యధురంధరోన్నతికి, దైవప్రాభవోత్తేజముల్
వరణీయంబులు రామచంద్ర!" యనెనప్పా! ఆంజనేయప్రభూ! 22

"ఆలస్యంబమృతంబునైన విషమాహారంబుగాఁజేయు దు
ష్కాలంబొంద "శుభస్యశీఘ్ర"మను శిష్టప్రోక్తమౌరీతి నీ
వేలన్ శ్రేష్ఠుఁడవంచు నెంచి త్వరగా నీ సింహపీఠంబుపై
గ్రాలన్జేయఁగనుంటి"నంచనెను ధీరా! ఆంజనేయప్రభూ! 23

"చనుమా! దీక్షవహింపుమా! యిపుడె సుక్షత్రాబ్ధియుప్పొంగఁగా
ఘనసామ్రాజ్యపు భారమున్గొనుమ! సత్కారుణ్యచిత్తుండవై
కనుమా! భూప్రజలుల్లసిల్ల పరమాకర్షప్రకర్షోన్నతిన్
వనజాప్తుండు కనుంగొనంగ"నని నప్పా! ఆంజనేయప్రభూ! 24

## శ్రీరామ పట్టాభిషేక సంరంభము

జనకుండొప్పఁగ వీడుకొల్ప, ధరణీసంజాతతోఁగూడి, స
జ్జనముల్మెచ్చఁగ, రామచంద్రుఁడు మహాస్వాంతుండు సౌధస్థలిన్
ఘనశిష్టుండు వసిష్ఠమౌనివరు నాజ్ఞన్ దీక్షతోనొప్పె పా
వనవేదవ్రతమగ్నుఁడై యపుడు దేవా! ఆంజనేయప్రభూ! 25

రాజ్యంబంతనలంకరించిరి దిగీంద్రస్వాములుప్పొంగ "స్వా
రాజ్యప్రాభవమూర్తిగా ధరణి విభ్రాజిల్లగా పౌరులా
పూజ్యస్వాంతుఁడు రామమూర్తి పదవీపూజ్యస్ఫురన్మూర్తియై
రాజ్యంబేలునటంచు"నెంచి మనసార న్నాంజనేయప్రభూ! 26

వనజాప్తుండు కనంగ, నయ్యెడల రంభాస్తంభయుగ్మంబులన్
కనువిందున్గలిగించె ద్వారములు, నుత్కర్షప్రకర్షోన్నతిన్
మణిహారంబులు వీధులందెసఁగె, పూమాలల్ గుభాళించె, ౘదో
రణముల్భాసిలెఁ జాతరాగమున ధీరా! ఆంజనేయప్రభూ! 27

జనవాసంబులుమించె, నాట్యయుత శస్తస్ఫారహర్మ్యంబులన్,
ఘనపాఠుల్ వినిపించు వేదగతులాకర్షించు సౌధంబులన్
కనువిందౌ బహుచిత్రసంగతుల నుత్కంఠాప్తిగేహంబులన్,
ఘన సింహాసన మెక్కురాము"ఁడని వీఁకన్నాంజనేయప్రభూ 28

అలశృంగాటకసీమలందు జనులత్యంతప్రమోదంబుతో
గళమొప్పన్ రఘురామశౌర్య విలసత్గంభీర వృత్తంబులన్
గలకంఠోన్నత రాగబంధుర సముత్కర్షాప్తనాదంబులన్
జెలువొప్పన్ గడుపాడసాగిరి వచశ్రీ న్నాంజనేయప్రభూ! 29

వనలక్ష్మీకరశోభలన్ బురములుద్భాసిల్లగాఁ జొచ్చె పా
వనచూతాన్విత నారికేళయుత రంభాస్తంభరాజంబులన్,
దిననాథస్ఫురితాంశు పుష్పచయ గంధీభూతసారంబులన్,
జనతోల్లాస రసాప్తిగీతముల నీశా! ఆంజనేయప్రభూ! 30

ప్రతిగేహంబును బంధుమిత్రయుతమై భాసిల్లె భద్రోన్నతిన్
స్తుతిమీరన్ రఘురామచంద్రుని లసద్భూర్ణప్రదీప్తాంగ సం
గతగీతంబుల నాలకించుచు మహత్కార్యాళినగ్గించుచున్
నుతపట్టోత్సవ వైభవంబుఁగన బంధూ! ఆంజనేయప్రభూ! 31

కలమాన్నంబులు భక్ష్యభోజ్యతతి శాఖవ్రాతపానీయముల్
వలనొప్పెన్ బ్రతిగేహమందలర శుంభత్ప్రీతినాతిథ్యముల్
చెలువొప్పన్దగఁ జేసిరయ్యెడల నుత్సేకంబుతోగేస్తులా
స్థలికేతెంచిన వారికొప్పఁగ మహాత్మా! యాంజనేయప్రభూ! 32

వ్రతదీక్షాపరుఁడైన రాముఁడఁట శశ్వత్ హోమశేషాన్నమున్
తతమంత్రాప్తిభుజించె, నెల్లజనులుద్భాసించు డెందంబులన్
నుతరీతిన్గనుచుండ, వైదికులు సంతోషంబుతోనొప్ప, స
ద్గతి శుద్ధాంతము పొంగిపోయెఁ గడువీఁకన్నాంజనేయప్రభూ! 33

## కైకకు మంథర దుర్బోధగావించుట

తనరున్ గేకయరాజపుత్త్రి విభునాత్మన్గూర్చునిల్లాలు మో
హనరూపాంచితమూర్తి పంక్తిరథు నాహ్లాదంబులోఁదేల్చు జ
వ్వని ముగ్ధాంకితచిత్త, సౌధమున భాస్వద్రీతిమైనొప్పు రా
ముని పట్టోత్సవమంతఁ గన్గొనఁగ శంభూ! ఆంజనేయప్రభూ! 34

అలచంద్రోదయవేళఁ బాల్కడలి యుద్యద్రీతి మిన్నంది సం
కుల కోలాహల కేంద్రమౌగతి, బురక్రోడప్రదేశంబు పు
ష్కల వాద్యంబుల సందడిన్దనర, గైకస్వాంతమున్ గూర్చు నె
చ్చెలి కుబ్జాంగన మంథరాఖ్య గనెఁ గస్తిన్నాంజనేయప్రభూ! 35

వెనువెంటన్ జనుదెంచి కుబ్జ, చటులోద్వేగంబుతోఁ గైక మో
మును దర్శించి వచించె "నీవెపుడు సంపూర్ణానురాగంబుతోఁ
గని సౌఖ్యాంబుధిఁ దేల్తు వప్పతిని, నుత్కర్షంబునీకిచ్చెనే?
జనపాలుండిఁట గొంపముంచె"నని యాప్స న్నాంజనేయప్రభూ! 36

"పతి యాధీనుఁడు నాక"టంచెరుఁగ శశ్వద్రీతిభాషింతు" వ
ప్పతి కౌసల్యకు గూర్చువల్లభుఁడు సంభావించి శ్రీరామునిన్
ప్రతిలేనట్టి విధంబుగానిపుడు సామ్రాజ్యాధినాథుండుగా
నుతియింపన్ దగఁజేయనుండె"నని తంతున్నాంజనేయప్రభూ! 37

దరహాసంబునగాంచి కైకయనె "సద్ధర్మప్రకారాప్తి భూ
వరు జేష్ఠాత్మజుఁడెప్పుడున్ బుడమిసంభావింపరాజౌట సుం
దరభావంబది శాస్త్రసమ్మతముగాదా! మంథరా! రాముఁడి
ద్ధరణిన్నేలఁగ నొప్పుగాదె"యని శాస్త్రా! ఆంజనేయప్రభూ! 38

"అతులోత్సాహము గల్గుమాటయిది యాహ్లాదంబుగల్గించె నీ
మతియుత్తేజముఁబొందఁ గైకొనుము శుంభత్తారహారంబు సు
స్థితిమైనుండు"మటంచునిచ్చెను వచశ్రీలొప్పగాఁగైక దు
ర్మతి కుబ్జాంగన కన్నులెఱ్ఱఁబడె ధీరా! ఆంజనేయప్రభూ! 39

విని యామాటల (గైక మోముగని యావేశంబు జృంభింప(గా
ఘననిశ్వాసము లొక్క పెట్టున సముద్గాఢంబుగా రే(గ భా
మిని కుబ్జాంగన యిట్లు పల్కె సతిగాంభీరంబు(బో(గొట్ట న
ల్కను వాత్సల్యము(గూడ(గా నపుడు గాకన్నాంజనేయప్రభూ! 40

"ఇక(గౌసల్యయె రాజమాతయగు, నారీలోకమెల్లప్పుడున్
ప్రకటస్ఫూర్తుల దాస్యవృత్తిగతి నారాధింప(గానొప్పు, నా
వికచాక్షిన్ దలవంచి సమ్మతమె సేవింపంగ నీకింక? నా
కి(కనేమున్నదె కైక"! యంచనెను స్వామీ! ఆంజనేయప్రభూ! 41

"భరతుండీవును సర్వకాలములు సేవావృత్తిమైనుండి భూ
వరు కౌసల్యతనూజునిన్‌గొలిచి యాస్వాదింపు, డెల్లప్పుడా
ధరణీపాలుని భుక్తశేషమును, బద్ధానంద చిత్తంబుతో
వరరీతిన్‌దగు దాసులై"యనెను దేవా! ఆంజనేయప్రభూ! 42

"హితమున్‌గోరి వచించుచుంటి వినుమీ! హీనస్థితిన్‌బొంది యే
గతిలేనట్లుగ నిన్నుజూడ(గలనే! కారుణ్యచిత్తంబుతో
మతినూహింపుము సింహపీఠమున సన్మానింప(గావచ్చు నీ
సుతునిన్ మంథరమంత్రమొప్ప"నని నచ్చేనాంజనేయప్రభూ! 43

"తలపన్ రాము(డె యగ్రజుండుగద! యాతండుండగానెట్లు భూ
తల నాథుండగు నాతనూజు( డి(క మంత్రంబేమొ రూపింపవే!
విలసద్రీతిగ మంథరా!"యనుచు గాంభీర్యంబు(బోనాడి చం
చలబుద్ధిన్నట(గోరె( గైక చటులాశ న్నాంజనేయప్రభూ! 44

అనుడున్ మంథర వక్రబుద్ధివిరియన్ హ్లాదైకచిత్తంబుతో
"వినవమ్మా! మునుశంబరాసురునితో భీష్మప్రకారాజిగా
ఘనఁడౌయింద్రుని కంత తోడ్పడఁగ వీఁకన్నెగె నీ భర్త నీ
మనమందిప్పుడు దాని నెంచ"మనె భీమా! ఆంజనేయప్రభూ! 45

"పలుమాయల్ఘటియించి రక్కసుఁడు శుంభచ్ఛౌర్యమున్జూప నా
ఖలునిన్జంప నుపాయమున్గనక పాకధ్వంసి చింతించుచున్
కలనున్వీడి గమింపనుండ కడువీఁకన్నీవు గర్జించి యా
తులువన్నోర్చుటఁ గాంచు మిప్పు"డనె బంధూ! ఆంజనేయప్రభూ! 46

"వలనొప్పన్ ధవళాంగుఁడమ్మని గురుస్వాంతంబుతోనీకు పు
ష్కలరీతిన్నొక మంత్రమున్నుడివె, సంగ్రామంబులో శంబరున్
ఖలునిన్ బీచమణంపఁ దోడ్పడవె సాక్షాత్కాళివైనాఁడు సం
ధిలు తన్మంత్ర సహాయమొప్ప"నెనె దీప్తి న్నాంజనేయప్రభూ! 47

"వరముల్ రెండునొసంగె నీరమణుఁడుద్భాసిల్లగా నీకు, సం
గరరంగంబున దోడుపాటునకు ఁబాకధ్వంసియగ్గింప, భూ
వరుఁడిచ్చున్ దనమాటకై కనఁగ నోభామామణీ! యిప్పుడా
వరముల్గోరు"మటంచుజెప్పెనఁట దేవా! ఆంజనేయప్రభూ! 48

"వనమందుండి చతుర్దశాబ్దములు సంవాసింపఁగా రామునిన్
వనజాక్షీ! భవదీయ పుత్త్రు భరతున్ బట్టాభిషేకోన్నతిన్
మనఁగన్జేయఁగ నీదువల్లభుని యమ్మా! కోరుమా!"యంచు మ
న్ననతోఁగైకకుఁజెప్పెమంథర నయజ్ఞా! ఆంజనేయప్రభూ! 49

"ప్రాణంబైననునిచ్చు లేదనక సంప్రార్థించినన్నీవు నా
జననాథుండు త్వదీయవల్లభుఁడు శశ్వద్రీతిమై నెంచి యా
ఘనమైనట్టి వరద్వయంబు మదికెక్కన్ గోరుమా!"యంచు కు
బ్జ నయాప్తిన్వచియించె కైకకు మహేశా! అంజనేయప్రభూ! 50

"ఫలవంతంబుగ రామచంద్రు నటవీ ప్రస్థాన మేజూడఁగా
వలెఁ దత్కార్యము సాగునంతవఱకున్ స్వాంతంబుఁ జల్లారునే!
జలమున్ద్రావను నోగిరంబు తినఁగాఁ జాలన్ నిరీక్షించుచున్
జలజాతేక్షణ! యుందు"నంచనె మహేశా! అంజనేయప్రభూ! 51

**కైకయలుఁగుట దశరథుఁడనునయించుట**

అనికుబ్జాంగనఁబల్క నాతరుణి బద్ధావేగచిత్తంబుతో
ఘనమేఘావళి చాటుగా జనెడి రాకాచంద్రబింబాకృతిన్
మణిభూషాదులఁ దీసివైచి యరిగెన్ మాలిన్యవస్త్రాంగియై
కనఁగాఁ గోపగృహాంతరంబునకు వేగన్నాంజనేయప్రభూ! 52

అలుకన్జెందెను గైకయన్నపలుకున్ వ్యాపించెఁ గార్చిచ్చుగా
చెలువున్దప్పిన రాణి సౌధమునకున్ క్షేమంబుగల్పింపఁ దొ
య్యలికోపంబునుదీర్ప పంక్తిరథుఁడాప్యాయంబుతో సాగి నె
చ్చెలి గైకన్ దగఁ బల్కరించెను వచశ్రీ నాంజనేయప్రభూ! 53

"అలుగన్నేటికి? ప్రేయసీ! తగునె! నీవాప్యాయతన్వీడఁగా
జలజాక్షీ! దయతోడఁగన్గొనుము నాస్వాంతంబురంజిల్లగా
కలకంఠీ! వచియింపవే! మధువులొల్కంగాఁ బ్రియాలాపముల్
వలదీకోపమ"టంచుఁబల్కె విభుఁడప్పా! అంజనేయప్రభూ! 54

"కసిగానున్న విధింపుమీ! తగిన శిక్ష న్నాకువెన్వెంట నీ
ముసుగున్‌దీసి కటాక్షముల్‌దనర సమ్మోహంబుతోఁగాంచుమీ!
మసిపాతల్ త్యజియింపుమీ! తరుణిరో! మద్భావమూహింపుమీ!
నసిగాదీవిధ"మంచుఁ బల్కె విభుఁడీశా! ఆంజనేయప్రభూ! 55

## కైక వరద్వయంబును గోరుట

పతియార్తిన్ మదినెంచి కన్గొనుచు సంభావించి కైకేయి భూ
పతితోడ న్ననురాగముట్టిపడఁగా భాషించి "యుద్ధావనిన్
స్తుతిమ్మెఁదొల్లి వరద్వయంబొసఁగుటల్ దోపించునే! స్వామి! స
మ్మతితో వానినొసంగుమీ!"యనెను ప్రేమన్నాంజనేయప్రభూ! 56

"అరయన్ రామునిఁ బంపఁగావలెను గీకారణ్యసీమాళికిన్
బరగన్నింక చతుర్దశాబ్దములు శశ్వద్రీతిఁ బెంపొందఁగా
భరతున్ రాజుగ చేసికావలె ప్రభూ! పట్టాభిషేకాప్తి"నం
చెరుగన్‌గోరె వరద్వయంబపుడు స్వామీ! ఆంజనేయప్రభూ! 57

## కైకవరద్వయంబు విని దశరథుఁడు దురపిల్లుట

కటువైనట్టి వరద్వయంబుఁ బతియాకర్ణింపలేఁడయ్యె దు
ర్ఘట పర్జన్యరవంబునా! శ్రుతికి నారాటంబు గల్పింప నా
త్రుటి వజ్రాహతిఁగొన్న వృక్షముగతిన్ దేజంబుఁగోల్పోయి య
చ్చటగూలెన్ గడుఖిన్నుఁడైవిభుఁడు శాస్త్రా! ఆంజనేయప్రభూ! 58

ఎటులోలేచి విభుండు కైకఁగనుచున్ హీనస్వరాప్తి"న
న్నిటు లీరీతి పరీక్షసేయఁదగునే? యేమందునే! కోమలీ!
చటులంబిద్ది వరద్వయంబొసఁగుటల్‌సత్యంబె, కాదందునే?
కటువైయున్నవి నీదుకోర్కె"లనెఁ గాకన్నాంజనేయప్రభూ! 59

"అనఘున్ రామకుమారశేఖరుని కీకారణ్యసీమాళికిన్
మనమెట్లొప్పెను బంపగోరుటకు? భామా! ధర్మమైయున్నదే!
మనముప్పొంగఁగ రామచంద్రుగని సంభావింపవే! ముందు, నా
చనవేమయ్యె?"నటంచు వేడె విభుఁడీశా! ఆంజనేయప్రభూ! 60

"భరతున్రాము నభిన్నమూర్తులని సంభావింతువే! నేఁడు ము
ష్కరవృత్తిన్ రఘురామచంద్రునెడ నీకారిన్యమెట్లబ్బె? బం
ధుర పాషాణము భంగి నీవయితివే! దుష్టాత్ములెవ్వారుని
త్తరి బోధించిరొ?"యంచురాజనెను చింతన్నాంజనేయప్రభూ! 61

"కనుమా! సుందరి! పోనడంపుమిఁక రాకాచంద్రునిన్ రామునిన్
వనసీమాళికి నంపుకోర్కె, కడుసద్భావంబుతో నొప్పుమీ!
జనరాగంబును బొందుమీ!"యనుచు దాస్యస్ఫూర్తిమైవేడె నా
జనపాలుండఁట కైకమోముగని యీశా! ఆంజనేయప్రభూ! 62

తనపంతంబును వీడకుండె, ప్రజనాత్మన్జూడరాకుండె, యౌ
వ్వన సౌందర్యమదంబుతోడ పతి సంభావింపలేకుండె, నం
గనకైకేయి, విభుండు దుఃఖమున నాక్రందించి యుద్విగ్నుఁడై
ఘనునిన్రామునిఁ బిల్వబంచెనఁట కాకన్నాంజనేయప్రభూ! 63

## పట్టాభిషేక సంరంభము - రాముని యాగమనము

అవసానస్థితి నస్తశైలమున రాజాప్యాయతన్జూడ, సం
భవమున్బొందెను తూర్పుకొండపయి శుంభద్రీతిభానుండు, ప్రా
భవరీతుల్ విలసిల్ల, రాఘవునిదౌ పట్టాభిషేకాప్తికై,
స్తవముల్ మంగళవాద్యముల్ చెలఁగె, నీశా! ఆంజనేయప్రభూ! 64

వరసింహాసనమెక్కు లగ్నమమరన్, భాస్వత్సభాగారమున్
ధరణీవల్లభ భూసురప్రముఖ సిద్ధర్షి ప్రభాపూరమై
కరముప్పొంగె, వసిష్ఠమౌనివరు నాంకాక్ష ప్రకారాప్తి భూ
వరుచంద్రాగమనార్థులైరి ప్రజలప్పా! ఆంజనేయప్రభూ! 65

అలగంధేభము లుత్తమాశ్వములు భవ్యస్ఫూర్తిమైసాగ, మం
గళవాద్యంబులు వేదఘోషలు సమాకర్షింప, వెన్వెంట చం
చలవీక్షారుచులొప్ప సుందరులు దంచద్రీతిమై రాగ, కాం
తులు సారించుచువచ్చె రాఘవుఁడు, బంధూ! ఆంజనేయప్రభూ! 66

జనకుండొప్పఁగ వచ్చునింకనని, యాస్థానంబు రాజిల్లగా,
మునులున్ విప్రులు భూపతుల్ ప్రజలు సమ్మోదంబుతోనుండ, పా
వనులారాఘవు లాత్మలోఁదనర, శుంభద్రీతి రాఁడయ్యె నా
ఘనుఁడౌపంక్తిరథుండు రాసభకు, గాకన్నాంజనేయప్రభూ! 67

**రాముఁడు కైక భవనముకేగి పరిస్థితిఁ గమనించుట**

త్వరతోడన్ జనుదెంచి భృత్యుఁడొకఁ డత్యంతార్తిచిత్తంబుతో
ధరణీపాలుని యాజ్ఞఁదెల్పె, విలసద్ధర్మాత్ముఁ డౌరాముతో,
ధురవేగంబునఁగైకసౌధమునకున్ డోలాయమానస్థితిన్
వరణీయుండగు రాఘవుండరిగె, నప్పా! ఆంజనేయప్రభూ! 68

వెనువెంటన్ జనుదెంచి సౌధమున, కుద్వేగంబుతో నుండు నా
జనకున్ గాంచి రఘూత్తముండు, "జననీ! సత్యప్రసన్నాత్ముఁడౌ
జనరాగంబువహించు తండ్రి, యిపుడాస్థానంబు రంజింపఁగా
గన రాకుండఁ దపించుటేల?" యనె గాకన్నాంజనేయప్రభూ! 69

"మనమందామహనీయుడెప్పుడిటు లమ్మా! ఖిన్నుఁడైయుండఁగాఁ
గనలేదెంచఁగ, తండ్రి పన్నును దిరస్కారప్రకారంబుగా
జననీ! చేసితివే! వచింపగదవే! స్వాస్థ్యంబుఁజేకూర నం"
చని ప్రార్థించెను రాఘవుండపుడు ధీరా! ఆంజనేయప్రభూ! 70

"జనకా! నాకు వచింపుమీ!, కరుణతో స్వాంతంబు రంజిల్ల, నీ
ఘనదుఃఖాప్తికి కారణంబెరుఁగ నాకాంక్షించె నాడెందమున్,
ననుమన్నించి, దయానురాగమతితో నాజ్ఞాపింపఁగాఁగోరెద"
న్నని ప్రార్థించె రఘూత్తముండు విభునప్పా! ఆంజనేయప్రభూ! 71

**వరద్వయమునుగూర్చి కైక రామునికిఁ దెల్పుట**

కడుదుఃఖంబున మాటలాడక, మహాగాఢప్రచింతాత్ముఁడై
పడియున్నట్టి నరేంద్రుసంగతిమతిన్ భావించి, కైకమ్మ మో
మడరన్‌జూచి, రఘూత్తముండపుడు సహ్యాస్ఫూర్తిమైనెంచ, పై
కడలున్‌జూపి వచించె నా ప్రమద, దేవా! ఆంజనేయప్రభూ! 72

"వరముల్ రెండిటినిచ్చెఁదొల్లి వినుమీ! వాగ్దానమొప్పంగ, సం
గర రంగంబున నాకు భూవిభుఁడు, సక్తంబైన చిత్తంబుతో
స్థిరబుద్ధిన్‌బతి నావరద్వయమును నర్థింపంగ, సత్యోన్నతిన్
ధరణీనాథుఁ డనుగ్రహించె"నని నంతన్నాంజనేయప్రభూ! 73

"పదునాల్గేడులు నీవరణ్యమున సంవాసింపఁగా, నయ్యెడన్
బదిలంబొప్పఁగ నాదుపుత్త్రుఁడు లసద్పట్టాభిషేకోన్నతిన్
ప్రథితుండై ఘనకోసలంపుఁబతియై బాలింపఁగాఁ గోరితిన్
సదయుండైపతి దీర్చె"నంచనె మహేశా! ఆంజనేయప్రభూ! 74

"పితరుండిచ్చినమాట నిల్పవలె సంప్రీతిన్ దనూజుండు, స
న్మతి నీరీతి కులక్రమాగతము సంభావించి నీవింక, సం
గతి లోనెంచి, వనాళికేగు"మనె నాకైకేయి, పిత్రాజ్ఞ సం
గతి నచ్చోఁ దలదాల్చె రాఘవుఁడు, వీకన్నాంజనేయప్రభూ! 75

పినతల్లిన్గని, రామచంద్రుఁడఁట సందీప్తిన్ బ్రసన్నాత్ముఁడై
తన భావంబును తక్షణంబె యిసుమంతన్వంతలేకుండఁ జె
ప్పెను, వాగ్రీతి మనోగతంబమర గాంభీర్యప్రకారోన్నతిన్
గనఁగాదండ్రియుఁ బెద్దలున్ వినఁగ వీఁకన్నాంజనేయప్రభూ! 76

"జననీ! యింత వచింపనేల? వనవాసంబెన్నగాఁజేతు, నా
యనుజున్ జేసెద స్వామిగానిపుడె యాహ్లాదంబుదైవార, పా
యనిరీతిన్ మదినెంచనేల? యిది సత్యం"బంచు వాక్రుచ్చె స
జ్జనమాన్యుండగు రామచంద్రుఁడు మహేశా! ఆంజనేయప్రభూ! 77

మతినూహించుచు, రామవాక్యగతి సంభావించి, "భూ
పతియాహారము ముట్టబోఁడు, కనుమప్పా! తండ్రియుద్వేగమున్
పితరుండెంచగ సాగిపొమ్మడవికిన్, వేరొండు భాషింప సం
గతిగా"దంచు వచించె కైక పెనుధాకన్నాంజనేయప్రభూ! 78

కనులన్గ్రమ్మిన యశ్రుపాతగతి దృగ్వ్యాపారమున్గప్పు, రా
ముని వీక్షింపఁగలేక, వంచెశిరమాపూర్ణంబుగారాజు, దే
వునిపై భారమువైచు భక్తుగతి, వాపోవంగ లేనట్టి యా
జనకున్గాంచి, గమించెరాఘవుఁడు చింతనాంజనేయప్రభూ! 79

**కైకభవనమువీడి రాముఁడు కౌసల్య కడకేగుట**

కని దండంబిడి పిన్నతల్లికి, నమస్కారంబుగావించి త
జ్జనకుండొప్పఁగ, మోదమున్‌గదియ భాస్వద్రీతిమైసాగి, త
క్షణమింపొందఁ గుమారరాఘవుఁడు కౌసల్యాత్మజుండంతఁద
జ్జననీసౌధముఁజేరె, నయ్యెడల శాస్త్రా! ఆంజనేయప్రభూ! 80

స్థిరసంకల్పము తోడఁసాగి, కడునుత్తేజంబుతోమాతృ మం
దిరమున్‌జొచ్చి, నమస్కరించి, నుడివెన్ దివ్యప్రబోధంబుగా,
ధరణీనాథుఁడొసంగినట్టివరముల్, ధర్మప్రకారోన్నతిన్
వరకౌసల్యకునంత దాశరథి దేవా! ఆంజనేయప్రభూ! 81

**కైక వరద్వయంబువిని కౌసల్యవ్యథఁజెందుట**

జ్వాలాభీలవరోద్ధతిన్‌దలఁచి కౌసల్య ప్రకంపాత్మయై
మూలాచ్ఛేదిత పాదపంబుకరణిన్ భూమీస్థలిన్ గూలి మై
దూలన్, లేపగ లేచి, దుఃఖమున "నుద్బోధించిరే! నీచు లో
బేలా! యీ విధ"మంచు వాకొనెను క్ష ప్తిన్నాంజనేయప్రభూ! 82

"కీకారణ్యముబట్టి యేగుమని దాక్షిణ్యంబులేకుండ నా
లోకాతీతగుణాకరున్ రఘువరున్ లుబ్ధత్వమేపార నో
కైకా! కోరుటజెల్లునే! తలఁపనీకాఠిన్యమెట్లబ్బునే!
రాకాసీ!"యని యేడ్చె నవ్వనిత వీరా! ఆంజనేయప్రభూ! 83

'లలితస్వాంతుఁడు రాఘవుండు కడునుల్లాసంబుతోనొప్పఁగా,
బలిమీఱన్ దగనాటపాటలెసఁగన్ లాలింపవేనాఁడు, మం
గళగీతుల్‌రహిమీర, నేఁడలుకతోఁ గాఠిన్యమున్‌బూని కా
నలకున్‌బంపుట ధర్మమా!"యనెను వన్తన్నాంజనేయప్రభూ! 84

"భరతున్రాముని నెల్లవేళల సమస్వాంతంబుతోఁజూడదే!
ధరణీనాథుఁడు భూప్రజల్ పొగడఁగా, ధర్మప్రసన్నాప్తిమై
వరరీతిన్ గడు నొప్పుకైక, యనలజ్వాలాకృతిన్రేగి సుం
దర రామున్ వని కంపునే?"యనెను చిన్తన్నాంజనేయప్రభూ! 85

"కన స్వాధీనుఁడు వల్లభుండనుచు, గాకన్బెట్టఁగాఁజూచునే!
చనువొప్పన్ దురితంపుకోర్కెగమితో సాధింపఁగావచ్చునే!,
మనమెట్లొప్పె? ఁజతుర్దశాబ్దములు రామస్వామిఁగీకాటవిన్
మనఁగాఁబంపుట"కంచునేడ్చెను మహాత్మా! ఆంజనేయప్రభూ! 86

**కైకవరద్వయంబువిని లక్ష్మణుఁడాగ్రహించుట**

అలకైకేయివరంబులన్, జనకు సత్యస్ఫూర్తిలోనెంచి, సం
ధిలుక్రోధంబునఁ చింతనిప్పులయి సందీపించునక్షద్వయిన్,
ప్రళయాగ్నిప్రభలొప్పఁగా ప్రకటితోగ్రస్ఫారవక్త్రంబుతో
బలభంద్రుండగులక్ష్మణుండెసెఁగె నప్పా! ఆంజనేయప్రభూ! 87

"పిన్నమ్మా! వరమిట్లుకోరఁదగునే!, భీరుండె? రామానుజుం
డన్నన్గాదని నీకుమారునిఁట రాజ్యస్వామిగాఁజేసి నీ
కన్నారన్గనుగొందువే!" యిపుడిదేఖండింతు నీకంఠ మీ
పన్నాగంబును మానకున్న"ననెనప్పా! ఆంజనేయప్రభూ! 88

**కౌసల్య తత్త్వోపదేశము**

కని రామానుజు భావతీవ్రగతులన్, గౌసల్య భావించి రా
ముని తత్త్వంబు మనంబులోగనుఁచు, శంభుస్ఫూర్తిఁబెంపొంద, స
జ్జనమాన్యంబగురీతినెంచి, సుమనస్వాంతంబులింపొంద, ల
క్ష్మణుఁడూకొట్ట, వచించె నాసతి, మహేశా! ఆంజనేయప్రభూ! 89

"ఇది దైవాజ్ఞ కుమార! కైకవరమెంతేన్ గాకతాళీయ, మ
య్యదిలోనెంచకు నాయనా!, కులగురుండప్రజ్ఞుఁడే! చూడఁగన్,
సదయుండౌపితరుండు సత్యనిరతిన్శాసించె, కీకాటివిన్
గదియన్బొమ్మని రామ"చంద్రుననెఁ గాక న్నాంజనేయప్రభూ! 90

"మునులున్ విప్రులు రాజ్యనేతలును సమ్మోదంబుతోరాఁగ రా
ముని పట్టోత్సవ మాపఁగాఁదగునె? యాపూజ్యుండఁటంచెన్న కిం
క నయంబెన్నుము కైక కిచ్చె పతి వాగ్దానంబు, పట్టోత్సవం
బునకంటెన్ దగముందుగాననెను" శంభూ! ఆంజనేయప్రభూ! 91

"అసలాబ్రహ్మరచించె, రామునికరణ్యావాస మొప్పంచు, నా
నౌసటివ్రాతను బాపఁగాఁదరమె? బంధువ్రాతమింపొంద సం
తసమొప్పన్ రఘురామ! పొమ్మటవికిన్ దథ్యంబు పాలింపుమీ!
కసిలేకుండ"నటంచుఁబల్కె సతికాక న్నాంజనేయప్రభూ! 92

## రాముని యుపదేశము

"మనకున్దల్లి, మనంబులో గపటమేమాత్రంబులేనట్టి యా
జననిన్ గైకను చూడుమయ్య!, భరతస్వాంతంబు సంప్రీతిమైఁ
దనరున్గాదె! మహాత్ముఁడౌ జనకు సత్యస్ఫూర్తి లోనెంచుమీ!
యనుజా!"యంచువచించె రాముఁడపుడప్పా! ఆంజనేయప్రభూ! 93

కన విశ్వంబును జల్లఁగాఁబఱచు నుత్కర్షంపు వర్షంబునాన్
యనుగున్సోదర మాతృభాషణము లాశ్వాసిల్లగాఁజేసె, నా
కినుకన్జెందిన లక్ష్మణయ్యమతి, సంకీర్తించె పిత్రాజ్ఞ నా
ఘనసౌమిత్రి తిరంబుగానపుడు వీఁకన్నాంజనేయప్రభూ! 94

జనకాజ్ఞన్ శిరసావహించి, జననీస్వాంతంబునోదార్చి యా
దినరాజాన్వయు సత్యదీప్తిమెరయన్ దివ్యాత్ముఁడౌ రాముఁడా
ఘనపట్టోత్సవ మూనకుండఁజనుటల్ గాంచంగనొప్పించు ల
క్ష్మణుఁడచ్చో వినుతించెఁజిత్తగతి శాస్త్రా! ఆంజనేయప్రభూ! 95

## రామునికడకు సీతాదేవివచ్చుట

దరహాసంబు కపోలతీరముల నుద్యద్రీతినర్తింప, నా
ధరణీపుత్త్రికచేరె, వల్లభుని చేతస్ఫూర్తిరంజిల్లఁగా
చిరునవ్వుల్దళుకొత్త, దాశరథి యాశీఃపూర్వదృగ్గీతులన్
వరసీతాసతిఁజేరఁదీసె, నపుడప్పా! ఆంజనేయప్రభూ! 96

కనఁగా భృత్యులు, ఛత్రచామరము, లుత్కర్షద్విపేంద్రాశ్వముల్,
వినుతుల్ సల్పెడు వందిమాఘదులు, హంవీరాప్తబృందంబులున్,
గనరాకుండ, రఘూత్తముండచటి కొక్కండంత వేంచేయ, నె
మ్మనమందూగెడి శంక, సీత కనెఁ, బ్రేమన్నాంజనేయప్రభూ! 97

కని సీతేంగితమంత, దాశరథి సాకల్యంబుగాఁజెప్పె, మో
మునహాసంబుదలిర్ప, కైకపలుకుల్ బొల్పొందనీరీతిగా,
గనియాలించెను జానకీసతియు, తత్కార్యప్రకారాప్తికై
తన సంకల్పము ముందునిల్పెను, మహాత్మా! ఆంజనేయప్రభూ! 98

"అరుదౌరీతి సహాయమున్జలుప మున్నాజి న్నుదారాత్ముఁడై
వరముల్ రెండిటి నిచ్చెఁదండ్రి, మనసా భాసిల్లఁగైకమ్మ, కా
వరముల్బండగ నన్నుగానలకు శశ్వద్రీతిమైబొమ్మనెన్
తరుణీ!"యంచువచించె రాఘవుఁడు శాస్త్రా! ఆంజనేయప్రభూ! 99

## వనవాసక్లేశమును రాఘవుఁడు సీతకుఁదెల్పుట

"వనసీమన్ బదునాల్గువత్సరములున్, బ్రాణేశ! సేవించుచున్,
మనుదానన్ మిముగూడి,"యన్న గని యాక్ష్మాపుత్త్రితో"ఁగోమలీ!
ఘనమౌక్రూరమృగాళితో, జటులమార్గగ్రావ భూయిష్ఠ కా
ననసీమాళి, వసింపకష్ట"మనె చిన్తన్నాంజనేయప్రభూ! 100

"శీతోద్గాఢము తాపతప్తము, భయాశ్లిష్టంబు, దుర్దానవో
పేతంబౌ, వనసీమఁ జూడగ, మహాభీతావహంబెన్నఁగా,
సీతా! రాఁదగునే? మహోన్నతము రాశీభూతసౌందర్యమున్,
వీతంబైచనునంచు"రాముఁడనె నాప్తిన్నాంజనేయప్రభూ! 101

"వలదీయందము, భోగభాగ్యములు, నాప్రాణంబు లాద్యంతముల్
కలనొప్పన్ దమతోడిదే! గనుఁడు "రాకాచంద్రునిన్ రోహిణీ
లలనారత్నము వీడియుండునె"? సముల్లాసంబుతో వత్తు నా
తలఁపున్దీర్పుఁ"డటంచు సీతయనె వంతన్ కన్నాంజనేయప్రభూ! 102

## లక్ష్మణుఁడూర్మిళ నోదార్చుట

వనసీమాళికి నన్నతోఁజనఁగ నొప్పన్బల్కె నర్ధాంగితో,
ఘనుఁడా లక్ష్మణుఁడేగిసార్ద్రముగ, సక్తస్వాంతయై, యంత నె
మ్మనమందూనెడి దుఃఖమున్, గనులగ్రమ్మన్ జూచు, నాసాధ్వితో
"ఘనమౌత్యాగముజేయఁ"గోరెను శుభంగా! ఆంజనేయప్రభూ! 103

"పిత్రాజ్ఞన్ రఘురామచంద్రుఁడు, లసద్భీతిన్నరణ్యంబులో
ధాత్రీపుత్త్రికతోడనుండు నమలోదాత్తవ్రతారంభుఁడై,
పిత్రాభుండగు నన్నపాదముల సేవింపన్ ప్రపన్నాప్తిమై
నాత్రంబొప్పఁగ నుంటి, నం"చనె శివప్పా! ఆంజనేయప్రభూ! 104

"నన్నేదైవముగాదలంచితివి మాన్యస్ఫూర్తిమైనీవు, రా
జన్నన్‌బంపెను కాననంబునకు సత్యస్ఫూర్తికాపాడ, రా
మన్నన్‌జేరి భజింప, నన్నునుపుమం"చాలక్ష్మణుండాప్తి మై
గన్నారన్‌గనికోరె నూర్మిళను, గాకన్నాంజనేయప్రభూ! 105

"పదునాల్గేడుల కాలమా వనములో బద్నాల్గు రోజుల్‌బలెన్,
కదియంగాఁ జరియించి వత్తునిఁటకున్, గంజాక్షి! యంచా"సతిన్
మదినొప్పించి సుమిత్రపుత్రుఁడఁట సంభావించుచున్నేగి నె
మ్మది రామున్‌గనె నార్ద్రుఁడౌచు పరమాత్మా! ఆంజనేయప్రభూ! 106

**లక్ష్మణుఁడు వనమునకు వత్తునని రామునికిఁ దెల్పుట**

"ధరణిన్ దేవుఁడులేనియాలయము, సద్భక్తుండు లోనెంచునే?
వరణీయంబుగు నీదుపాదముల సేవన్‌జేయకేనెట్టు లీ
పురిలోనుండదలంతు? ఁజూడఁగ, లసత్పుణ్యార్థిగా నగ్రజా!
యరుదెంతున్న"ని లక్ష్మణుండనెను దేవా! ఆంజనేయప్రభూ! 107

కనఁగా బ్రాణము ఛాయయున్ గదిసి, యుత్కర్షంబుతో సాగెనో
యనఁగా, సీతయు లక్ష్మణుండపుడు భవ్యంబైనచిత్తంబుతో
వెనువెంటన్ జనుదేరఁ, గాదనక దీవించెన్ రఘూత్తంసు, డ
వ్వనవాసంబున కేగుదెంచుటకు దేవా! ఆంజనేయప్రభూ! 108

**సీతారామలక్ష్మణులు వనంబునకేగుట**

వరభూషాదులు, పట్టువస్త్రములు శుంభద్రాజ చిహ్నంబులున్,
స్థిరసౌఖ్యావహ భక్ష్యభోజ్యతతి, వాసిన్మీరు పానీయముల్,
పరివారంబుఁ బరిత్యజించి, మునిభావస్ఫూర్తిమై రాముఁడ
త్తరిసాగె న్నటవీస్థలంబులకు, శాస్తా! ఆంజనేయప్రభూ! 109

వరధర్మంబునుబట్టి సాగిజను శుంభత్న్యాయనేమంబు, ల
త్తరివెన్నంటిన రీతిగా, నెసగి సీతాలక్ష్మణోదాత్తుల
ప్పరమాత్మన్ రఘురాముతోగలసి సేవాస్ఫూర్తి సంరంభులై
పరివారంబును వీడిసాగిరి, శివప్పా! ఆంజనేయప్రభూ! 110

వరకౌసల్యసుమిత్రలార్తిగదురన్ బాష్పస్నిగ్ధ నేత్రంబులన్,
ధరణీపుత్రిని రామలక్ష్మణుల బద్ధప్రీతిమైగాంచి, పెం
పరనాలింగనమాచరించి, మదినుద్భాసిల్ల దీవించి, య
త్తరి వీడ్కోలు ఘటించి రెన్నఁగ, మహాత్మా! ఆంజనేయప్రభూ! 111

మునిరాజోత్తమవృత్తిమైపరఁగ, సమ్మోదంబుతోవల్కలన్,
ఘనచాపాదుల నొప్పదాల్చి, కడువీకన్మీరి ఘోరాటవిన్
జనముండన్గని, సైన్యముల్, జనులు, రాజ్యస్వాములున్ వెంటరాన్,
దినినాథుండును సాగె ముందుగ, ప్రదీప్తి న్నాంజనేయప్రభూ! 112

ఘనబాధాకులచిత్తులై ప్రజలు, వైకల్యాప్తిఁ గైకమ్మ పా
వనమార్గంబును దప్పెనంచనిరి, దివ్యస్ఫూర్తిమైనేగె కా
ననమార్గంబునుబట్టి రాఘవుడు, విజ్ఞస్ఫూర్తినీక్షించి దే
వునియాజ్ఞన్ సవరింపరాదనఁగ, శంభూ! ఆంజనేయప్రభూ! 113

ఆర్తత్రాణపరాయణుండగు విభుండార్తి ప్రకారాప్తిమై
మూర్తిన్జెందిన శోకమోయనఁగ,ఁబాల్పోకుండగానిల్చెఁ గిం
కర్తవ్యంబను జింతగల్గ, మదికాకన్జెంది ద్వారంబునన్
ధూర్తస్త్రీతతి చేరియుండ, బుధబంధూ! ఆంజనేయప్రభూ! 114

కనుచూపచ్చట సాగునంతవఱకున్, గంపిల్లు డెందంబుతో,
జననాథుండటు గాంచుచున్, బ్రవిమలస్వాంతున్ రఘూత్తంసునిన్,
జనకక్ష్మాధవుముద్దుపట్టిని, జగజ్జట్టిన్సుమిత్రాత్మజున్,
మనసారన్దగుదీవెనల్ సలిపె, నాత్మ న్నాంజనేయప్రభూ! 115

## సీతారామలక్ష్మణులు తమసానదినిఁ జేరుట

సుమనస్వాంతులు, జానకీరఘువరుల్ శోభిల్లు సౌమిత్రులై
మమకారంబున ఁగొల్వఁగా పురవరుల్, మాన్యోత్తముల్గూడిరాన్,
దమసాతీరము పుణ్యసారమును శాంతస్వాంతగాంభీర్యమున్
శ్రమదీరన్దగజేరి రంతట, మహేశా! ఆంజనేయప్రభూ! 116

క్రమమొప్పన్ తమసాప్రవాహినికి, నాక్రాంతప్రపూర్ణాత్ములై
ప్రమదస్ఫూర్తి నమస్కరించి, జలమాస్వాదించి, వారంతటన్
శ్రమదీరన్ రమణీయదృశ్యముల నాశాస్ఫూర్తిమైగాంచి, యా
సుమనస్కుల్ వరపూర్ణులై యెసగిరచ్చో నాంజనేయప్రభూ! 117

## గుహుఁడను శబరభక్తుఁడు రామునిగాంచుట

అహిలోకేంద్రుఁడు గొల్వఁగా, బుడమినాప్యాయంబుగానొప్పు నా
మహితాత్ముండగు మాధవుండనఁగ, రామస్వామి సీతాంగనా
సహితుండై తమసానదీతటమునన్ సౌమిత్రి సేవింపఁగా,
గుహుఁడన్వ్యాధుఁడు చూడవచ్చె గుణసంగు, న్నాంజనేయప్రభూ! 118

"దారపుత్త్రుల్ తమరిప్డు రాచపురికిన్దూరంబుగా క్రూరభీ
కరసింహాదుల తోడి కాననలకున్, గాఢోద్యమస్ఫూర్తిమై
తరలన్ గారణమేమిస్వామి? సతిసీతాసాధ్వితో, నాత్మసో
దరుతో,"నంచు గుహుండు పల్కెనఁట బాధ న్నాంజనేయప్రభూ! 119

"అపకారంబును మీకు సల్పుతులువ, న్నంతంబుగావింతు, నా
ద్విపరాజేంద్రు వధించు కేసరిగతిన్, దేవా! యెటింగింపుఁడీ
యవమానంబు సహింపలేను, గుహుశౌర్యస్ఫూర్తి మీసేవకై
యుపయోగింపుఁడ"టంచుఁబల్కె గుహుఁడచ్చో నాంజనేయప్రభూ! 120

అనఁగా రాముఁడు నవ్వుచున్, గుహున కాద్యంతంబుగా సర్వమున్
జనవాప్పన్దగఁజెప్పి, శాంతపఱచెన్, స్వాంతంబురంజిల్ల నా
వననాథుండు నమస్కరించి, ఫలపుష్పంబుల్ సమర్పించె, నా
జననాథాత్మజుఁడుల్లసిల్ల, శివతేజా! ఆంజనేయప్రభూ! 121

**పౌరులను రాముఁడు వీడుకొల్పుట**

తరుపర్ణంబులు శయ్యగానమర, శాంతస్ఫూర్తిమనన్మూర్తులై
ధరపైమేనులవాల్చి రయ్యెడ, మనస్థైర్యంబు మేల్కొల్పఁగా
పురికిన్బౌరుల వీడుకొల్పె, కడుసంపూర్ణాత్ముఁడై రాముఁడీ
శ్వర సంకల్పమెఱుంగజెప్పుచు, మహేశా! ఆంజనేయప్రభూ! 122

విడువన్జాలక రాఘవాదులను, సంసేవించు చిత్తంబుతో,
కడుశోకించుచు, దూలుచున్, గుములుచున్, గంజోద్భవున్దిట్టుచున్,
అడుగుల్ దొట్రుపడంగనేగిరి, "మహాత్మా! రాఘవా"! యంచు కూ
యిడుచున్, బౌరులయోధ్యఁజేరఁగ, పురారీ! ఆంజనేయప్రభూ! 123

**రాముఁడు గుహుని వీడుకొల్పుట**

వరభక్తుండు నిషాదరాజు గుహుఁ డాప్తశ్రేణితోవచ్చి, భా
సురరీతిన్నౌట కర్ణధారుఁడయి, యస్తోకోర్మికోత్తుంగ నా
వరగంగన్ దరియింపఁజేసె ప్లవగస్ఫారప్రసారాప్తి, న
ద్ధరణీజన్ రఘురామలక్ష్మణుల, శాస్తా! ఆంజనేయప్రభూ! 124

కనఁ జూపించెను దండకాటవికి మార్గంబంత వ్యాధుండు, దీ
వెనగావించి రఘూత్తముండు శబరున్ వీడ్కొల్పె బూర్ణాత్ముఁడై,
మనమందుప్పెనవోలె శోకమడరన్ మాన్యోత్తముండాగుహుం
డినునిన్ గాంచుచునేగె, నప్పుడు పురారీ! ఆంజనేయప్రభూ! 125

**సీతారామలక్ష్మణులు చిత్రకూటముఁజేరుట**

అలరున్‌బోలిన జానకీరమణి, దుర్గారణ్యమార్గంబులన్
చెలువున్‌గూడి ప్రయాసమున్‌గనక సంక్షేమంబుతోనేగె, నా
యెలనాగన్‌గనె, నుస్సురంచు మదినెంతేనార్తితో రాముఁడిం
గలవీధిన్ సతిసాగునట్లు బుధరక్షా! ఆంజనేయప్రభూ! 126

పటుదీక్షన్ రఘువంశదీపకులు దుర్వారప్రతాపోన్నతుల్,
చటులస్ఫార మరుత్ప్రఘాతముల శశ్వద్ధైర్యభావోన్నతిన్
స్ఫుటయానంబున దాటిపోయి, కని రాపూర్ణ ప్రభాటోపమున్
రటదామ్నాయము చిత్రకూటమును, ధీరా! ఆంజనేయప్రభూ! 127

ఘనమౌనీంద్రనివాసమున్ సకలయాగస్ఫూర్తి సంకీర్ణమున్
ప్రణవోద్గాఢము చిత్రకూటగిరి సంభావించి, యచ్చోటనె
మ్మనముప్పొంగఁగ నాకుటిల్లొకటి నిర్మాణంబుగావించి, య
య్యినవంశోద్భవు లొప్పియుండిరఁట శూలీ! ఆంజనేయప్రభూ! 128

వ్రతదీక్షాపరులై, మునీంద్రపదసేవాస్ఫూర్తిమచ్చిత్తులై,
చతురామ్నాయ పురాణశాస్త్రయుత చర్చాస్ఫారభావోన్నతిన్
నుతులై యొప్పిరి, చిత్రకూటమున, సంతుష్టాత్మయౌజానకీ
సతితోడన్ రఘురామ లక్ష్మణులు, శాస్తా! ఆంజనేయప్రభూ! 129

## రాముఁడు గంగాతీరమును జేరుటను బౌరులుదెల్పుట

భంగంబైన మనంబుతోడ సచివుల్, బ్రారబ్ధకర్మంబుగా
గంగన్దాటుచు రాముఁడేగెనని యాకైకేయికిన్జెప్ప, ను
ప్పొంగెన్ నెమ్మదిలోనఁగుబ్జ, కడువాపోయెన్ విషాదాబ్ధిలో
బ్రుంగంగామది వల్లభుండపుడు, శంభూ! ఆంజనేయప్రభూ! 130

"నళినాక్షా! రఘురామచంద్ర! కనుమన్నా! నిన్ను ఘోరాటవీ
తలమందుండఁగ జేసితిన్, గనఁగ పుత్త్రా! తండ్రినే? నేను, ని
శ్చలుఁడైయుంటి శరీరమున్నిలువ, తుచ్ఛంబైనప్రాణంబుతో,
ఖలుఁడన్ జూడకుమంచు"నేడ్చె విభుఁడాకన్నాంజనేయప్రభూ! 131

"జలజాప్తాన్వయ సోమశేఖరుఁ గడుమహాశాంతాత్మునిన్ రామునిన్
గలనైనన్ గనుగొందునే?"యనుచు గాకన్జెందుడెందంబుతో
విలపించెన్ విభుఁడంత, దీనుఁడయి యుద్వేగంబుతోమూర్ఛిలెన్
కలతన్జెంది రమాత్యవర్యులు, కనంగా నాంజనేయప్రభూ! 132

అఁట మూర్ఛిల్లిన రాజుఁగాంచి, పటుశోకార్తిన్ బ్రకీర్ణాత్మయై
స్ఫుటరాగంబున "నాథ! మీరిపుడు వాపోవంగరాదింక, దు
ర్ఘటనంబంచుఁ దలంపరాదు, కడుధైర్యస్ఫూర్తిమైనుండు" డం
చఁట కౌసల్యవచించె నార్ద్రగతి, దేవా! ఆంజనేయప్రభూ! 133

"ఘనశోకార్తి దహించుటల్ నిజము; ప్రాజ్ఞస్ఫూర్తిమై గాంచుడీ!
జనమున్, రాముఁడు ధీరశౌర్యగుణభాస్వంతుండు కీకాటవిన్
మునివృత్తిన్ బదునాల్గువత్సరము లామోదంబుతోనుండి, మీ
మనముప్పొంగఁగవచ్చు చూడుఁ"డనె ప్రేమన్నాంజనేయప్రభూ! 134

కడుభక్తిన్వచియించు సాధ్విఁగని, యాక్రందించుచున్రాజు "నేఁ
గడుకష్టంబులపాలుఁజేసితిని, నిష్కారుణ్యచిత్తుండ, నీ
కొడుకున్, నాదగుమాటనిల్పుకొనఁగా క్రూరాటవీవాసమున్
ముడిగాఁబెట్టిన కుత్సితుండ"ననె శంభూ! ఆంజనేయప్రభూ! 135

**పూర్వపు మునిశాపమును దశరథుఁడుదెల్పుట**

మతిఁ గౌసల్య చలింపకుండ కడుసంభావించి సేవించె, స
న్మతి సత్యాత్ముని నాథునిన్, సచివులాత్మస్థైర్యమున్ బొంద, నా
సతికిన్దెల్పెను దొల్లిశాపగతి, నాశ్వాసిల్లుచున్ఱేఁడు, దు
ర్గతికిన్గారణ మద్దియంచు బలుకాకన్నాంజనేయప్రభూ! 136

"దేవీ! యియ్యది నీవు చెప్పినటులన్ దివ్యాజ్ఞ, యిద్దానికిన్
శాపంబొక్కటి మూలమౌను, వినుమీ! శస్త్రప్రకారోన్నతిన్
రూపున్దాల్చిన క్రూరజంతుతతి నిర్మూలింపఁగా, వానికిన్
ప్రాపౌకానల కేగితి"న్ననె విభుడప్పా! ఆంజనేయప్రభూ! 137

"కరమర్థిన్ నిశివేళ జంతుగతివేగస్ఫూర్తులాలించి యా
సరయూనిమ్నగలోని నీరముల నాస్వాదించునాగంబులన్
స్థిరలక్ష్యంబున వేయగా, శరము సంస్తంబునన్దాకెఁ, ద
చ్ఛరఘాతంబునఁ జచ్చెనొక్కఁ"డనె శాస్తా! ఆంజనేయప్రభూ! 138

"మునిబాలున్ ననుజంపనేమియొదవున్? మోదంబుఁజేకూరునే?,
జనుషాంధుల్ ననుగన్నయట్టిపితరుల్, సంప్రీతిమైఁబ్రోవ ని
వ్వని దిక్కెవ్వఁడు? వారిదాహగతి నెవ్వాడింకవారించు? "నం
చనిరోదించుట దెల్పె భూవిభుఁడు శాస్తా! ఆంజనేయప్రభూ! 139

"నెలరాజొప్పెను, వెన్నెలల్విరిసె, సందీపించెలోకంబు పెన్
గలతన్బొందుచు సాగిపోయి, కడునాక్రందించు నబ్బాలునిన్
కలయన్గాంచితి, నాతడంతఁబటుకాకన్ జేరి యందించె నా
జలపాత్రంబు"నటంచుఁదెల్పె విభుఁడీశా! ఆంజనేయప్రభూ! 140

"జలపాత్రంబును చేతికిచ్చి, కడునుచ్ఛ్వాసప్రసారాప్తి సం
చలితాత్మీయ శరీరభాగుడగుచున్, శ్వాసంబుహీనంబుగా,
"కలశంబున్గొనిపోయి చేర్పుమయ! శీఘ్రస్ఫూర్తిమావారికిన్
చలమొప్ప"న్నని చెప్పెబాలుఁడనె శాస్తా! ఆంజనేయప్రభూ! 141

"జనుషాంధుల్ నను గన్నవారు గలరస్వాస్థ్యప్రపీడాత్ములై,
మునివృద్ధుల్ కడుదప్పితోనలయుచున్, భూవల్లభా! వారలన్
గనిరక్షింపుఁడు వారినిచ్చి"యని దుఃఖస్ఫూర్తిమై ఁజెప్పుచున్
గనులన్మూసె మునీంద్రసూనుఁ"డనె ఁగాకన్నాంజనేయప్రభూ! 142

"తనయుండేగె జలంబుదీసికొనిరాన్, దానేమిరాడింక, ని
వ్వనమత్తేభము లుద్ధతిన్మెలఁగు, దుర్వారప్రకారాప్తి పు
త్రునకేమైనను కీడుమూడెనొ? యసద్స్ఫూర్తిన్ ప్రమాదంబు నా
మనమెంచె"న్నని మౌనిబల్కెఁననె ప్రేమన్నాంజనేయప్రభూ! 143

"మృతునిన్ మౌనికుమారునిన్ భుజముపై ప్రేమోల్లసత్స్ఫూర్తి నం
చితవృత్తిన్ ధరియించి, హస్తమున సంస్నిగ్ధాంబుపాత్రంబు సం
చితరీతిన్ వహియించి పోయి, ముని సంసేవించి, తత్పుత్రు సం
గతి విన్పించితి"నంచు జెప్పె బతికాక న్నాంజనేయప్రభూ! 144

"జలభాండంబును ముంచఁగా హ్రదములోశబ్దించు నాసవ్వడిన్,
జలమున్‌గ్రోలెడు సింధురంపుఁదతతిగా స్వాంతంబులోనెంచి, సం
చలరీతిన్ దగశబ్దవేది శరమున్ సారింప, నద్దానికిన్
బలియయ్యెన్నని"తెల్పుటల్‌నుడివె నప్పా! ఆంజనేయప్రభూ! 145

"హతుఁడయ్యెన్ సుతుడన్నవార్త, కడుశల్యంబై విదారింపఁగా
మృతునిన్‌బట్టి "కుమార! భూమిపై నూరేళ్ళింతలో నిండెనా!,
గతియెవ్వండిఁక మమ్ము్నాదుకొనఁగా, ఁగర్తవ్యమీడేర్ప"నం
చతిబాధన్ స్మృతిఁదప్పె మౌని యనె నప్పా! ఆంజనేయప్రభూ! 146

"మదనాగంబనుభ్రాంతి, నాసుతుని సన్మాన్యప్రభావాత్మునిన్
ప్రదరస్ఫూర్తిని గూల్చివైచితివి, యాభాసప్రకారాప్తిమై,
పృథివీనాథ! సమస్తధర్మవిదు లీరీతిన్ బ్రవర్తింతురే?
మదినూహింపుమ"టంచునేడ్చెననె భీమా! ఆంజనేయప్రభూ! 147

"సమవర్తీ! యిదినీకుజెల్లునె? మహాశాంతప్రసన్నాత్మునిన్
రమణీయాంగుని పిన్నబాలుని లసత్ప్రాజ్ఞున్ మదీయాత్మజున్
క్రమవర్తిన్‌గనకుండ,ఁబ్రాణముల దుర్మార్గంబునన్‌గొంటివే?
సుమనస్వాంతుఁడవే!"యటంచనెను నచ్చోనాంజనేయప్రభూ! 148

"పసిబాలుండని చూడకుండ, సుతునిన్ భద్రస్వరూపోన్నతున్
మసిగావించితి, రాజవే! ప్రజలు సంభావింతురే! చూడగన్,
పసిగానున్నదె నీదు చేష్ట"యని కష్టస్ఫూర్తినమ్మౌని నన్
గసితోఁదిట్టె"నటంచుఁదెల్పె పతి కాకన్నాంజనేయప్రభూ! 149

"కనులన్‌గాంచఁగలేము, వృద్ధులము, కాకన్‌జెందుడెందంబుతో
మన సాధ్యంబగునే? మహీతలముపై మాకున్ గుమారా! యిదే
నినుజేరన్ వడివత్తుమే"మనుచు నందీభూతచిత్తాబ్జయై
మునియర్ధాంగియు మూర్ఛపొందె"నని శంభూ! ఆంజనేయప్రభూ! 150

"స్థిరచిత్తంబున నెల్లవేళల మమున్‌సేవించు మత్పుత్త్రు, ము
ష్కరరీతిన్ న్నెడబాటుజేసితివి, రాజా! నీవునీరీతి నీ
వరపుత్త్రున్నెడబాసి లోగుములుచున్ బ్రాణంబులన్‌బుత్తు వం
చెరు"గన్ నన్నుశపించె మౌని"యనె నెంతేన్నాంజనేయప్రభూ! 151

"పరలోకంబున సద్గతుల్ సుతునికిన్ బ్రాప్తింప, సంస్కారముల్
అరుదౌరీతిగనాచరించి, ముని యత్యంతార్తిమై గ్రుంగుచున్
వరయోగంబునఁబాసె ప్రాణముల; శాపస్ఫూర్తి నాశీస్సుగా
కరమూహించితి"నంచు రాజనెను గాక న్నాంజనేయప్రభూ! 152

"అనపత్యుండగునాకు సంతతిని సద్యస్ఫూర్తి ఁగల్పించె, న
మ్మునిశాపంబు వరంబుగాఁబరఁగి, యామోదంబుతోబుత్త్రులన్
గనెదన్‌దొల్త, వియోగమెన్న తుదిఁగాకన్‌బోదు ప్రారబ్ధమై,
యనిభావించితి"నంచుఁబల్కె విభుఁడప్పా! ఆంజనేయప్రభూ! 153

"అలపత్నీసహితుండుగా ముని సముద్యన్నాకమందొప్పి రా
జిల, గావించితి నుత్తరక్రియల, సంసేవాంచితస్ఫూర్తితో
వలనొప్పన్ దగపుత్త్రసంతతిని దివ్యస్ఫూర్తిమైగంటి, స
త్ఫలితంబిచ్చెను శాపమం"చనె శివప్పా! ఆంజనేయప్రభూ! 154

## దశరథుని మరణము

"అనఘాత్మా! రఘువంశదీప్తికర! రామా! రాగదే!"యంచు"నె
మ్మనమందున్ స్మరియించుచున్, బొగులుచున్ మాన్యాత్ముఁడారాజు పం
బిన దుఃఖంబున గూలెనేలపయి, "సర్వేశా!" యటంచంతటన్,
కనిదేవేరులు గుందగా"ననెను గాకన్నాంజనేయప్రభూ! 155

"మునిరాముండు సతీసమేతుఁడయి శంభుస్ఫూర్తిసౌమిత్రితో
వనికేగెన్ వరశాపసంగతిని నాప్రాణంబులున్బోవఁగా
గనుఁడం"చున్, సతులాలకింప, నఁట సంకల్పాత్ముఁడైచెప్పి, ప్రా
లినభక్తిన్ ప్రభుఁడీల్గె నేలపయి శూలీ! ఆంజనేయప్రభూ! 156

కని కౌసల్య సుమిత్రయున్ మిగులనాక్రందించుచున్ "స్వామి దు
ర్దినమయ్యెన్గద! నేఁడుశాపగతి నిర్దేశించెనే! మృత్యువున్,
చనువొప్పన్గనువిచ్చి చూడగదవే! స్వాతంబురంజిల్లఁగా,
క్షణమైనన్ నినువీడలేమ"నిరి కాకన్నాంజనేయప్రభూ! 157

"పితృభక్త్యాత్ముఁడు రాఘవుండ"నుచు భావింపన్ గుణోదారతన్
హితుడయ్యెన్, బ్రజకాడితప్పని విభుండీవంచు విఖ్యాతిమై
నుతులన్గొంటివి, మేము రోదనగతిన్ నొవ్వారఁగాగ్రుంగుచున్
పతిలేనట్టి యవస్థగంటిమ"నిరప్పా! ఆంజనేయప్రభూ! 158

"స్వారాజ్యంబగు రాజధానినగరిన్, స్వార్థంబుఁజెన్నొందఁగా
నౌరా! విన్నటి యుత్సవంపుగతు లత్యంతార్తికిన్మూలమై,
మారామున్ గహనంబుజేరఁబనిపెన్, మారాజు నిర్జీవుగాఁ
గారించె"న్నని రాణులేడ్చిరఁటఁ గాకన్నాంజనేయప్రభూ! 159

"కలుగన్మానదు కల్గబోవునది, యాక్రదించినన్దప్పునే!
చెలిమిన్నెంచెద మీగతి"న్ననుచు, గాసింబొందు చిత్తంబుతో
చెలులున్బత్నులు కుందుచున్, గుములుచున్, శీర్షంబుగంపింపగా
కలయన్గాంచి, తలంచుచుండిరఁటఁ గాకన్నాంజనేయప్రభూ! 160

పతికైయేడ్చుట గాంచలేక, మునిశాపస్ఫూర్తిలోనెంచి, భూ
పతిఁ గోల్పోవుట ధాతచిత్రణముగా భావింపఁగాలేక, సం
గతవృత్తంబు దలంచుకొంచు, ప్రజలాక్రందించి రున్మత్తులై,
పితరున్బాసినరీతిగానఁట దశాప్తి న్నాంజనేయప్రభూ! 161

అలశుద్ధాంతపుకాంతలెల్ల కడుదుఃఖావేదనోద్విగ్నులై
విలపింపన్ గని, మంత్రివర్యులఁట కావేగంబుతోవచ్చి, సం
ధిలు శోకంబున మాటరాక గనుచున్, దీనాస్యులై ఱేని కం
జలిగావించి రచేతనాప్తి, నపుడోజన్నాంజనేయప్రభూ! 162

మదిలోనన్ విధివైపరీత్యమును సంభావించుచున్ వచ్చి యం
బుధిగాంభీర్య దివంగతున్ ప్రభువరున్ బూర్ణాత్మునిన్గాంచుచున్
వ్యథతోగన్నులు చెమ్మగిల్ల గళరావస్ఫూర్తి నుద్వేగమున్
గదియన్ గుండె, వసిష్ఠమౌని, తలపింకన్నాంజనేయప్రభూ! 163

## కైక భరతుని బిల్వనంపుట

గురుఁడైనట్టి వసిష్ఠమౌని కడుసంకోచించుచున్ దెల్పఁగా
భరతున్ బిల్వఁగబంపెఁ గైక కడుసంభావించి, శత్రుఘ్నుతో
నరుదెంచెన్ భరతుండయోధ్యపురి, కాహాకారముల్తండ్రి దౌ
మరణోదంతముఁదెల్పె వారికి మహాత్మా! ఆంజనేయప్రభూ! 164

"చనుదెంచెన్ భరతుండు, మాతులుఁడు రాజ్యస్వామి వీడ్కొల్పఁగా
ననువార్తన్"విని, కైక యాత్మజుని నాహ్వానింప సన్నద్ధయై
ఘనరీతిన్నెదురేగె దుశ్శకునముల్ గాఢంబుగాఁదోపఁ, ద
త్తనయుండార్తి వహించి పల్కెనిటులంతన్నాంజనేయప్రభూ! 165

"నిద్రాముద్రిత సౌధముల్గనఁగ నంధీభూతతేజంబుతో
క్షుద్రంబైకనిపించె పట్టణము, సంక్షోభించెనాడెందమున్,
భద్రంబెన్నఁగఁ దప్పెనే! జనని! సంభావింపగాఁదంద్రికిన్,
ఛిద్రంబయ్యెను నీదుచేష్టలనె" గస్తిన్నాంజనేయప్రభూ! 166

అనియార్తిన్ భరతుండుపల్క, కడుబాధాబోధచిత్తంబుతో
గని, భద్రాప్తిని దీవెనల్సలిపి, యుత్కర్షప్రకర్షంబుఁగాఁ
దనయున్, ధీరతనొప్పుమంచు, ననుబంధస్ఫూర్తిలాలించి, యి
ట్లనివాక్రుచ్చెను కైక యయ్యెడల, శాస్తా! ఆంజనేయప్రభూ! 167

"తొలినాళ్ళన్ బ్రభువిచ్చినట్టి వరముల్ దోడ్తోన సిద్ధింప నే
నలరామయ్యను కానకంపమని, యాప్యాయంబుతో నీకు కో
సల రాజ్యంబును గట్టబెట్టమని, యాశాస్ఫూర్తిమైఁగోరఁగా
పాలిసెన్ స్వామివరంబులిచ్చి"యనె శంభూ! ఆంజనేయప్రభూ! 168

"దివికేగెన్ నరపాలుఁడావిభుని యాదేశంబులోనెంచి, భా
రవిసంకాశుఁడు రాముఁడేగె బృహదారణ్యప్రదేశాళికిన్,
భువనంబేలఁగ యోగమబ్బె నీఁక సంపూర్ణప్రమోదంబుతో
స్తవముల్మీరఁగ రాజ్యమేలు"మనె శాస్తా! ఆంజనేయప్రభూ! 169

## జనకుని మరణోదంతము విని భరతశత్రుఘ్నులు విలపించుట

అసువుల్బాసెనుతండ్రి, యన్నయును ఘోరారణ్యసంవాసిగా
వెసనేగె న్ననువార్తలన్ వినఁగ, నుద్వేగం బవార్యంబుగా
గ్రసియింపన్ మదినంత, తప్తులయి యాక్రందించి రాసోదరుల్
పసిబాలుర్వలె వెక్కివెక్కియఁట, దేవా! ఆంజనేయప్రభూ! 170

"జనకా! యిచ్చినమాటనిల్పుకొని, శశ్వద్కీర్తినార్జించి, యీ
తనువున్గాదని వీడిపోయితివె! సత్యప్రాభవాధిక్యతన్
తనయుండెవ్వఁడు లేనివేళ ననపత్యస్ఫూర్తివై స్వామి! భూ
జనులున్గుందఁగ"నంచు నేడ్చిరి మహేశా! ఆంజనేయప్రభూ! 171

"వాత్సల్యంబున రాఘవోత్తమునకున్ బట్టంబుగావింప, న
త్యుత్సాహంబున నిన్నెంచితివి, దుర్యోగంబవార్యంబుగా
నుత్సంగంబున మిత్తి చేర్చికొనె, నయ్యో! ప్రాణముల్వీడితే!
మాత్సర్యంబు వధించెనే!"యనె మహాత్మా! ఆంజనేయప్రభూ! 172

"అకలంకోన్నతదివ్యవైభవ! మహాత్మా! కోసలాధీశ్వరా!
యొకమారొప్పఁగఁజూడుమీ! జనక! పాపౌఘంబు చల్లారగా
యొకమారొప్పఁగఁబల్కుమీ! యిపుడు నందోత్సాహమింపొందగా
ప్రకటస్ఫూర్తిన"టంచు వేడిరఁట దేవా! ఆంజనేయప్రభూ! 173

అరుదౌరీతిగఁదల్లిపల్క నపుడత్యంతార్తివై గ్రుంగుచున్,
భరతుండమ్మను గాంచలేక, కడుసంభావించి "శ్రీరామునిన్
దురితంబెన్నక భీకరాటవులకున్ దోషజ్ఞవైబంపి, లో
మురియన్గారణమేమి? తల్లి!"యనె శంభూ! ఆంజనేయప్రభూ! 174

"పతికిన్ మృత్యువుగాఁగ నీవయితివంబా! యెట్లుసైరింతునే?
సతులీచందమునోర్తురే! ప్రజలు నీస్వార్థంబునగ్గింతురే?
మతియేమయ్యెను? కుత్సితంపుచెలి దుర్మంత్రాంగమూకొంటివే!
గతియేమి"ంకని యేడ్చె రాసుతుఁడు కాకన్నాంజనేయప్రభూ! 175

## భరతుఁడు పట్టాభిషేకమును నిరాకరించుట

"వలదమ్మా! యిటువంటిసౌఖ్యములు, నీపట్టాభిషేకంబునే
దలపన్బాపముగాదె! యగ్రజుఁడు సద్ధర్మస్వరూపుండు భూ
తలమందొప్పెడుదైవమున్ దొలఁగ, స్వార్థస్ఫూర్తిమై మించి, రా
జిలపృథ్వీపతినౌట"యంచనె మహేశా! ఆంజనేయప్రభూ! 176

"అడవుల్బట్టి రఘూత్తముండు సతితోనారాటముల్ బొందఁగా,
కడునాహ్లాదముతోడ రాజ్యపతినై కామింతునే సౌఖ్యముల్?
వడి నాయన్ననుగూడి భక్తిమెయి, సంభావింతు సౌమిత్రి సం
గడి చెల్వొందు పథంబునింక"ననెఁగాకన్నాంజనేయప్రభూ! 177

భరతుండాత్మజుఁడట్లుఁ బల్కుటకుఁగంపంబొందెఁ గైకమ్మ, సు
స్థిరభావంబుననేగె రాసుతుఁడు నిస్తేజంబుదైవార, ను
ద్ధురశోకార్తులఁ దల్లులన్గనఁగ, శత్రుఘ్నుండు వెన్నంటిరాన్,
వరధర్మోన్నతవర్తియైయపుడు, దేవా! ఆంజనేయప్రభూ! 178

భగవల్లీలఁగ సర్వమున్దలఁచు సత్త్వస్వాంత కౌసల్య, తెం
పుగ కైకేయిసుతున్ గనుంగొనుచు, శంభుస్ఫూర్తి దీవించి, "పే
రెగయన్నీదగు తల్లికోర్కిమెయి పృథ్వీశుండవై, లోకులన్
ప్రగతిన్నేలు"మటంచుజెప్పె! జగదాప్తా! ఆంజనేయప్రభూ! 179

భరతుండప్పుడు, పెద్దతల్లికి, కంపంబొందుకంఠంబుతో
"మరణించెన్ బితరుండు; సోదరుఁడు రామస్వామి కీకాటవీ
సరణిన్‌జేరఁగ నాదుతల్లికతనన్, సైరించి దీవించు నీ
కరుణన్ బోల్పఁగశక్యమే"యనెను వీఁకన్నాంజనేయప్రభూ! 180

"అన్నన్‌గాదని రాజుగానగుట నాకాహ్లాదమున్‌గూర్చునే?
మున్నీరీతిని రాఘవుల్‌నడచిరే? పుణ్యాత్మా! బోధింపవే!
అన్నన్‌జేరి క్షమింపవేడి, పురికాహ్వానంబుగావించి, నే
గన్నారన్‌గని గొల్చె"దన్ననె వినంగా నాంజనేయప్రభూ! 181

**భరతుఁడు తండ్రికి నుత్తరక్రియలు గావించుట**

సమయంబట్టుల చేసినట్టి భరతున్ శత్రుఘ్నుఁడూకొట్టె, నా
సమయంబందు వసిష్ఠసంయమి సమాశ్వాసిల్లగాజేసి, యా
సమయాచారమునల్ప రాసుతుల దీక్షాబద్ధులన్‌జేసె త
త్సమయస్ఫూర్తి సమంత్రకంబుగ మహేశా! ఆంజనేయప్రభూ! 182

జననాథుల్‌గన బాంధవుల్ సఖులు కౌసల్యాదులున్‌రాగ రో
దనమున్‌జేయుచు, మంత్రిశేఖరులు సంతప్తాతరంగంబుతో
గనిసేవింప, వసిష్ఠమంత్రగతి నాకర్షింప, రాజన్యు దొ
కుణపంబున్ మణివేదిపైనిడిరి భక్తుల్, ఆంజనేయప్రభూ! 183

వరమంత్రాంచితవారితో కుణపమున్ భవ్యంబుగాజేసి బం
ధురగంధాక్షతలొప్పఁదీర్చిముఖమున్; దోడ్తోవిమానంబుపై
స్థిరరీతిన్‌దగనుంచి యాత్మజులు, వాసిన్‌జేర్చి రుద్విగ్నతన్
పురిమేరన్ సరయూనదీస్థలికి శంభూ! ఆంజనేయప్రభూ! 184

సరయూతీరమునందు గంధతరుకాష్ఠవ్రాతమున్‌జేర్చి, యా
ధరణీనాథు కళేబరంబునిడి, వేదస్ఫారమంత్రంబులన్
వరసంస్కారముజేసె రాసుతుఁడు, భాస్వద్వహ్నికీలాప్తి బం
ధురరీతిన్ జగమంతగాంచ, బుధబంధూ! ఆంజనేయప్రభూ! 185

విహితాంగంబుల యజ్ఞసాధనములన్ వేదోక్తమంత్రాప్తి స
న్నిహితంబొప్పఁగజేసి, మూడనలముల్‌నేమించి దీపింపఁగా
రహిసంస్కారముజేసె, నాభరతుఁడార్షస్ఫూర్తి ద్వైవార, సు
ప్రహితుండౌచు కళేబరంబునకు దేవా! ఆంజనేయప్రభూ! 186

పితరుల్ దివ్యపదోన్నతిన్‌దనర, దృష్టిన్‌జేసె దానంబు, లా
తతరీతిన్ సురభూసురప్రవరులు ద్యుత్స్ఫూర్తిమై మెచ్చ సం
గతసంతర్పణముల్‌జెలంగ, కడుదీక్షన్ జేసె కర్మాదులన్
మతి మంతుల్ గొనియాడ రాసుతుఁడు, ప్రేమన్నాంజనేయప్రభూ! 187

**మంత్రులు రాజ్యముఁ జేపట్టుమని భరతుని బ్రార్థించుట**

అటు లాశౌచదినంబులన్‌గడవ, సేవాసక్తిమై మంత్రు లు
త్కట రీతిన్ దగవిన్నవించిరఁట, బాధాతప్తచిత్తంబుతో,
"త్రుటికాలంబును రాకుమార! పురిధాత్రీశుండులేకున్న, దు
ర్ఘటులైశత్రువులొప్పరే!"యనుచుధీరా! ఆంజనేయప్రభూ! 188

"ఘనరాజ్యంబువహింపుమీ! ప్రభువుగా,నుగ్రాంతోల్లసన్మూర్తివై
జనరాగంబునుబొందుమీ! విబుధసౌజన్యప్రభోల్లాసివై,
యినరాజోన్నతినొప్పుమీ? జగతి లోకేశప్రకారాప్తిమై"
యనిప్రార్థించి రమాత్యశేఖరులు, దేవా! ఆంజనేయప్రభూ! 189

అని ప్రార్థింపఁగ నాలకించి మది నత్యంతార్తిమై మంత్రులన్
గని, రాజాత్మజు "డార్యులార! సమయజ్ఞస్వాంతులారా! మహా
గుణసంపన్నుఁడు రాముడగ్రజుఁడసంకోచప్రభావుండు కా
రణజన్ముం డిలయేలనొప్పు"నని ధీరా! ఆంజనేయప్రభూ! 190

"కనఁగా జ్యేష్ఠుఁడు, తండ్రితోసముఁడు, రాకాచంద్రుఁడౌరాముఁ డే
జనకుండెన్నఁగ నింకనీ ప్రజలకున్, సర్వేశుఁడౌ నాతనిన్
గొనివత్తున్ దగ విన్నవించి, పెరసంకోచంబులేకుండ, దీ
వెనతోడన్ ననుబంపుడం"చనెను దీప్తినాంజనేయప్రభూ! 191

"అరయన్నాదగు విన్నపంబు కడుసాధ్యంబంచు వాక్రుచ్చి, సం
వరణీయంబగు నన్నపాదముల సంభావించి సేవించుచున్
చరియింతున్ గహనప్రదేశమున, రాజ్యస్వామిఁ గానోప, నం
చరుదౌరీతి వచించె"రాకొమరుఁడప్పా! ఆంజనేయప్రభూ! 192

**భరతాదులను గుహుఁడు గాంచుట**

ఋషులున్ మంత్రులు వాహినీపతులు సంప్రీతిన్ జనానీకమున్
వెసవెన్నంటి గమించుచున్ మిగుల నావేగంబుతోరాగ, సం
తసమొప్పన్ భరతుండు జాహ్నవిని నుద్భాసిల్లగాఁజేరె, వె
క్కసముప్పొంగ గుహుండుగాంచె నరిశంక, న్నాంజనేయప్రభూ! 193

"జననీయుక్తునిగా "మహాత్ముఁడగు నాస్వామిన్ రఘూత్తంసునిన్
వనసీమన్ వసియింపఁదోలితివి, నీపంతంబు నీడేర్పఁగా
ఘనతన్మీరి వధింపవచ్చితివె? నీకార్యంబు సిద్ధించునే!
జననాథా!' యనియడ్డగించె గుహుఁడీశా! ఆంజనేయప్రభూ! 192

అనిరౌద్రంబున నడ్డగింప, భరతుండాహ్లాదవర్షాంబువుల్
జినుకన్‌గాంచి "కిరాతనాథ! కడు సంసేవించి, శ్రీరామునిన్
గొనిపోవచ్చితి రాజధానిపురి, కాక్రోశింపఁగానేల? యా
ఘను రాజ్యోత్సవ దీప్తి గాంచు"మనె వీఁకన్నాంజనేయప్రభూ! 195

## గుహుఁడు భరతాదుల గంగనుదాటించి చిత్రకూటగిరి జేర్చుట

పరమోత్సాహముతో కిరాతపతి సంభావించి, గంగానదీ
వరపూరంబు తరింపఁజేసి భరతున్, భవ్యప్రకారాప్తి సుం
దరతేజాంచిత చిత్రకూటగిరి సందర్శింపఁగాఁజేర్చె, బం
ధురపౌరాప్తసమేతుఁడై బరఁగ బంధూ! ఆంజనేయప్రభూ! 196

స్థిరమైత్రిన్‌దనరారు క్రూరమృగ సంక్షేమ ప్రకారంబులన్
స్వరయుక్తాంచిత వేదనాదలహరీ సక్తప్రసారంబులన్
వరయాగోద్భవ ధూమమేఘమయ భవ్యద్వ్యోమతీరంబులన్
పరికించెన్ భరతుండు తత్పరత నప్పా! ఆంజనేయప్రభూ! 197

భరతాదుల్‌గని రాశ్రమస్థలి భరద్వాజప్రపూర్ణాత్మునిన్
పరమాత్మాభుని, భక్తిసారమతులై భవ్యప్రకారాప్తిమై
శిరమున్‌వంచి నమస్కరింపఁగ, శుభాశీర్వాదసూక్తంబులన్
వరయోగీశ్వరుఁడొప్పఁజేసె మనసొప్పన్నాంజనేయప్రభూ! 198

## శ్రీరాముఁడు భరతాదులఁ గాంచుట

దొరలన్ రాజుల మంత్రులన్ భరతశత్రుఘ్న ప్రసన్నాత్ములన్
కరుణాపూర్ణుల, రామలక్ష్మణులు నుత్కంఠరంబుద్దైవార సం
వరణీయంబగు దృక్ప్రసారగతి సంభావించి రప్పట్టులన్,
ధరణీశుండు తలంపులో మెదల, శాస్తా! ఆంజనేయప్రభూ! 199

"అరయన్ దండ్రియు మాతృమూర్తులును క్షేమారోగ్యసంపన్నులై
వరరీతిన్నుఁటనున్నవారె? భరతా! భాగ్యప్రకారాత్ములై
మరదళ్ళున్ పురిలోనివారలను శుంభద్రీతిమైనుందురే?
కరమర్థిన్ వినగోరియుంటి"మని రోఘున్నాంజనేయప్రభూ! 200

## జనకుని మరణవృత్తాంతమును భరతుండు రామాదులకుఁ దెల్పుట

సతితోడన్ మునివృత్తిమై బరగుచున్ సౌమిత్రితోనొప్పు స
న్మతిలోకోత్తరు రామచంద్రుగని సంభావించి, శోకించుచున్
"జనకుండేగె దివంబునున్గదిసి శశ్వత్సత్యదీక్షోన్నతిన్
మనలన్వీడి"యటంచు ఁనాతఁడనెఁ బ్రేమన్నాంజనేయప్రభూ! 201

"తనయుండొక్కఁడుగూడలేనియెడలన్ దండ్రీ! పోతివే! యెంతగా
మనమందున్గనరానిబాధల మహాత్మా! గ్రుక్కివాపోతివో"
యనిరోదించుచు రామలక్ష్మణులు సత్యాత్మా! పితౄణంబునై
నను తీర్పన్నుఁట రాకయుంటిమని రప్పా! ఆంజనేయప్రభూ! 202

"తలపన్శక్యమె తల్లులార! కడుసంతప్తాంతరంగంబుతో
కలతన్జెందెడు మీయవస్థ, పతిపోకన్రేగు దుఃఖ స్థితిన్,
తొలఁగన్జేయఁగలేకపోయితిమి, బంధుస్ఫూర్తిమైఁగూడి, కా
నలయందుండుట"ఁజేసి మీ కనిరి"యంత న్నాంజనేయప్రభూ! 203

"మనుజుండొప్పు నిమిత్తమాత్రుఁడయి, సంభావించు దైవాజ్ఞలన్,
వనమందుండుట, తండ్రిపోవుట, విధివ్రాతంచు లోనెంచుమీ!
మనతల్లుల్గన చెప్పుమీ!"యనుచు సన్మాన్యప్రకారాప్తి పు
త్రుని ధర్మంబును దీర్పనెంచిరఁట శంభూ! ఆంజనేయప్రభూ! 204

**రామలక్ష్మణులు తండ్రికి (దిలోదకాదుల నర్పించుట**

అలవాసోదకముల్ దిలోదకము, లయ్యావాసరార్ఘ్యాంబుగా,
శిలపైనర్పణఁజేసి రంచితగతిన్, శిష్టప్రకారాప్తి న
ర్మిలి సౌమిత్రియు రామభద్రులఁట, నాప్రేతంబు సంప్రీతిమై
నలరన్, భూస్థలి వీడునప్పుడు, మహాత్మా! ఆంజనేయప్రభూ! 205

మతి నైక్ష్మాకునరేంద్రులన్‌గనుచు సంభావించిరాసోదరుల్
పితృకర్మాంచిత వాసరంపుగతులన్ విస్విధిపైరాజు స
మ్మతిదీవించుచునొప్పె, రిక్కలట సేమంబొప్పునాశీస్సులన్
నుతరీతిన్‌గురిపించిమించెనఁట, బంధూ! ఆంజనేయప్రభూ! 206

**సూర్యోదయవర్ణన**

తన వంశస్థుల (జూడవచ్చెనన, బద్ధ స్నేహరాగోన్నతిన్
తనరారెన్నుదయాద్రిపై నినుఁడు, చైతన్యప్రభల్‌పంచుచున్,
జనులెల్లన్‌దగ నిత్యకృత్యము లనుష్ఠానంబులన్ జేసి, నె
మ్మనముప్పొంగగ నొప్పిరప్పుడు మహాత్మా! ఆంజనేయప్రభూ! 207

**భరతుఁడు శ్రీరామచంద్రు నయోధ్యకు నాహ్వానించుట**

దివిపై నుండి యినుండుచూడ విషయోద్దీప్తప్రపూర్ణాత్ముఁడై
వివరించెన్ భరతుండు "సోదర! మహావీరా! దయాసాగరా!
నవచైతన్యముతోడ రాజ్యమున సన్తాపంబుబోనాడి నీ
భువిపాలింపఁగ రమ్మటంచనుచు శంభూ! ఆంజనేయప్రభూ! 208

"పితరున్ గాంతుము నీదు రూపమున, నీవేమాకు దైవంబు, మా
హితమున్‌గోరెడు పెద్దదిక్కగుట, సంప్రీతిన్ ప్రభుత్వంబు సం
తతమార్యోక్తవిధిన్ వహింపదగు, వంతల్‌మాని నాస్వామి! నా
మతమున్‌గైకొని రమ్మయోధ్య"కనె ప్రేమన్నాంజనేయప్రభూ! 209

**శ్రీరాముఁడు వనవాసవ్రతమాచరించి అయోధ్యకు వత్తునని చెప్పట**

భరతుండట్టుల వేడుకొన్నవిని, సంభావించి రాముండు, "సో
దర! యిక్ష్వాకుల సత్యధర్మగతి చిత్తస్ఫూర్తి గాదంచు, నా
వరసంకల్పముమాని, రమ్మనుట భావ్యంబౌనె? నీకెంచఁగా
ధరణీశాత్మజ!" యంచుఁబల్కెఁ గడుబాధన్నాంజనేయప్రభూ! 210

"వనవాసవ్రతమాచరించి, పితృభావంబొప్పఁగాఁజేసి, స
ద్గుణరత్నాకర! సోదరా! పురికి సంతోషంబుతోవచ్చెదన్,
అనఘా! నన్నిఁక రమ్మటంచనక, భవ్యాత్ముండవై నీవు నా
ఘనరాజ్యంబు వహింపు"మంచనె కనంగా నాంజనేయప్రభూ! 211

**వరపాదుకలనిచ్చి భరతుని కోర్కెఁదీర్పమని వసిష్ఠుఁడు వచించుట**

గురుదేవుండు వసిష్ఠమౌని విని, వాక్రుచ్చెన్ మహోదాత్తుఁడై,
భరతుండొప్పఁగ కోరినట్టిగతి సంభావింపు మోరామ! నీ
స్థిరసంకల్పము వమ్ముగానియటు లుద్దీపింప నీతండ్రిదౌ
వరయుగ్మంబు నటంచు నొక్కవిధి" దేవా! ఆంజనేయప్రభూ! 212

"వరణీయంబగు నీదుపాదుకల నప్పా! యిమ్ము సంప్రీతిమై,
వరసింహాసన మందునుంచి కడుసంభావించి కైకాత్మజుం
డరయన్ రాజ్యమునేలు, నీ బదులుగా నార్యోక్తమౌరీతి, నం
చెరు"గన్‌జెప్పె వసిష్ఠమౌనియఁట స్వామీ! ఆంజనేయప్రభూ! 213

మునివాచస్ప్రతి నాజ్ఞ, రాఘవుఁడు సమ్మోదంబుతోనిచ్చె, త
మ్మునిడెందంబున మోదమున్‌దనర, శంభుస్ఫూర్తి వీక్షించుచున్
తనదౌపావల, భక్తిమై భరతుఁడత్యంతోల్ల సన్మూర్తియై
కని నేత్రంబులకద్దుకొంచుఁగొనె, వీకన్నాంజనేయప్రభూ! 214

## శ్రీరాముని పాదుకల భరతుఁడయోధ్యకుఁగొనిపోవుట

వరభక్తిన్ శిరసావహించి, కడుసేవాస్ఫూర్తి గొంపోయి, సిం
ధురకుంభస్థలి నుంచె పాదుకల, శత్రుఘ్నుండువెన్నంటిరాన్
భరతుండంత, వసిష్ఠమౌనియుతుఁడై, భాస్వంతుఁ డీక్షింప, బం
ధురసేనాతతి ముందునొప్పనఁట బంధూ! ఆంజనేయప్రభూ! 215

వరమత్తేభము సాగుచుండెనఁట, శుంభత్కుంభ పీఠంబుపై
నరుదౌపాదుకలన్ వహించి, భరతుండత్యంత సంప్రీతిమై
వరఛత్రంబునుబట్ట, చామరము భవ్యస్ఫూర్తి శత్రుఘ్నుఁడున్
గరమొప్పన్ ధరియించి వీవఁ, గడువీఁకన్నాంజనేయప్రభూ! 216

తగురీతిన్ రఘురామచంద్రుఁడు సముద్యద్రాగచిత్తంబుతో
నగరాజంబగు చిత్రకూటగిరినంటన్సాగి వీడ్కొల్పె, బం
దుగు లొప్పంగ నయోధ్యకున్, భరతశత్రుఘ్నప్రపన్నాత్ములన్
జగమెల్లన్గొనియాడ, సత్యగతి శాస్తా! ఆంజనేయప్రభూ! 217

## పాదుకా పట్టాభిషేకము

వరసైన్యంబు నయోధ్యలోనునిచి, సేవాస్ఫూర్తి శత్రుఘ్నుతో
స్థిరసంకల్పుఁడు రామశూన్య నగరిన్జేరంగ ఁగాలాడ, కా
పురిహద్దున్గల నందినీనగరి శంభుప్రీతిమై నుండి, యి
ద్ధరణిన్నేలఁగ నెంచె నాభరతుఁడంత, న్నాంజనేయప్రభూ! 218

అఖిలోర్వీసురులుల్లసిల్లగ, సముద్యద్భక్తిమై, పాదుకా
ముఖమందొప్ప ప్రభుత్వమున్, భరతుఁడుత్ఫుల్లాత్ముఁడై భూప్రజల్
సుఖముల్ బొందఁగనేలసాగె, నపుడస్తోక ప్రభావోన్నతిన్
నిఖిలైక్ష్వాక పథానువర్తియయి, శాంతిన్నాంజనేయప్రభూ! 219

**జనస్థానమున ఖరుఁడు విజృంభించుట**

వరశౌర్యున్ రఘురాముఁగన్గొని, భరద్వాజుండువాక్రుచ్చె"నో
ధరణీశాత్మజ! గావుమీ! మునుల, నార్తత్రాణ శీలుండవై,
యరుదౌరాక్షసమాయలున్ జెడఁగ, నత్యంతస్ఫురన్మూర్తివై
ఖరునిన్‌జంపుము, శాంతిఁగూర్పుమనెఁ" గాకన్నాంజనేయప్రభూ! 220

"ఖరుడన్‌దైత్యునియండతో, నడవులన్ గ్రవ్యాదులున్మాదులై
వరయజ్ఞంబుల సంయమీంద్రులను విధ్వంసంబుగావించి, యి
ద్ధరలోమీరి చెలంగుచుండిరి, జనస్థానంబు నిస్తేజమై
పారిపోయె"న్నని చెప్పిరామునులు శంభూ! ఆంజనేయప్రభూ! 221

**అత్రిమునీంద్రుని రాముఁడు సేవించుట**

మునులన్‌సాధులఁగావఁగాఁజనుచు, శంభుస్ఫూర్తి రాముండు ల
క్ష్మణ సీతాసహితుండునై యఁట, జనస్థానంబురంజిల్లఁ బా
వనసేవాంకితభావుఁడై మునిభరద్వాజాజ్ఞఁ గర్తవ్యమున్
గనఁగా నత్రిమునీంద్రుఁజేరెను శుభాంగా! ఆంజనేయప్రభూ! 222

చిత్రప్రాభవుఁ డత్రిసంయమి, శుభాశీఃపూర్వ వాగ్రీతులన్
పుత్రస్ఫూర్తినియాదరించెను సతీమోదంబు చెన్నొంద సౌ
మిత్రిన్‌గూడిన జానకీపతిని సంప్రీతిన్ రఘూత్తంమునిన్
పిత్రానందకరున్ జగత్ప్రియకరాప్తి న్నాంజనేయప్రభూ! 223

అలముమ్మూర్తులు పాపలైదనర నుద్యత్‌స్ఫూర్తి లాలించి, జో
లలనూగించినతల్లి, నత్రిముని సల్లాపంబులూకొట్టు న
క్కలికిన్‌గాంచి, నమస్కరించిరఁట నాక్రాంతాత్ములై, జానకీ
కలితాప్తుల్ రఘురామలక్ష్మణులు, వీఁకన్నాంజనేయప్రభూ! 224

జనకక్ష్మాప్రజ రామలక్ష్మణుల, శశ్వద్భూరి దీవించుచున్
చనువొప్పన్‌గని యత్రిపత్ని కడునాశ్వాసిల్లగాఁజేసె, స
ద్గుణరత్నాకరు లుల్లసిల్ల, వ్రతసందోహంబు గావించె, న
య్యనసూయమ్మ వరోన్నతుల్‌జెలఁగ దేవా! ఆంజనేయప్రభూ! 225

## అనసూయ సీతాకల్యాణమును వినఁగోరుట

"వినఁగానిచ్ఛజనించె నాకిపుడు, సంవేద్యంబుగాదెల్పవే!
ఘనమౌమీదు వివాహవృత్తమును భక్తవ్రాతమింపొందగా
నని"కోరెన్ననసూయ జానకిని, భవ్యంబైన తద్వృత్తమున్
కనులన్‌గట్టఁగఁదెల్పె సీతయు, శుభాంగా! ఆంజనేయప్రభూ! 226

సీతారాముల పెండ్లిచూచినటులన్, జిత్తంబు లుప్పొంగ, సం
స్ఫీతప్రాభవవృత్తిమై జెలగె, నాసీమంతినీ వ్రాతమున్
చేతఃప్రీతికరంబుగా శిరములూచెన్ వృక్షబృందంబులున్,
మాతృస్ఫూర్తిరహించె నత్రిసతి, భీమా! ఆంజనేయప్రభూ! 227

## చంద్ర సూర్యోదయవర్ణనములు

స్తుతులన్‌జేయుచు నీడలన్‌గదిసె సంతోషంబుతోబక్షు, లా
పతగుండేగెను వారుణీప్రమద కీవార్తన్‌బ్రబోధింపఁగా,
జితరాగుల్‌సహితంబు నిద్రయొడి నాశ్లేషించి రచ్చోట, సం
గతుఁడై వెన్నెలరాజుగాంచఁగ శుభాంగా! ఆంజనేయప్రభూ! 228

ఇనుఁడొప్పె న్ననురాగపూరితుఁడునై యింద్రాశచెన్పొందఁగా
ఘనుఁడాయత్రిమునీంద్రు దీవెనల నాక్రాంతాత్ముఁడై రాముఁ డ
వ్వనమున్‌దాటిగమించె, క్ష్మాజ కడు సంభావించి వెన్నంటె, ల
క్ష్మణుఁడేతెంచెను తోడునీడగుచు, వీఁకన్నాంజనేయప్రభూ! 229

తెనుఁగున్‌జేసెను వత్సగోత్రుఁడిల భక్తిప్రాభవోపేతుఁడై
నినుసేవించుచు శ్రీనివాసకవి సందీప్తాంతరంగంబుతో
ఘనరామాప్తి నయోధ్యకాండము లసత్కావ్యంబు నార్ద్రంబుగా
జనభావాంచిత కార్యధుర్య! పరమేశా! ఆంజనేయప్రభూ! 230

సమాప్తమ్

శుభం శుభం శుభమ్

స్వస్తి

శ్రీవాణీ ప్రసన్నాభవతు





## ప్రార్థన

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

## అంకితము

అంకితంబుగాఁ జేసితి నందుకొనుము
లోక కల్యాణ సిద్ధికై ప్రాకటముగ
సరస సుందర సౌభాగ్య శతకశైలి
నీదు గాథల వినుతించి నీకెయిచట
కడలి జలములఁ గొనివచ్చి కడఁగి మొగులు
మగిడి కడలి కర్పించు నమ్మాడ్కిదోప
దురిత సంహార! తిరుపతి పురవిహార!
రమ్యగుణసాంద్ర! కోదండరామచంద్ర!

# శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణము

## (వాల్మీకి రామాయణమునకు సంగ్రహానువాదము)

# అరణ్యకాండము

శ్రీవత్సాంకితమూర్తియై శ్రితజనశ్రీకార్యసంవర్ధియై
జీవవ్రాతమనోబ్జమందిర వసత్క్షేమోల్లసత్కర్తయై
భావానందముఁగూర్చు రాఘవుఁడు శుంభద్రీతినైఁ గావ నా
దేవున్వేడెద రామభక్తినిలయున్ ధీరాంజనేయప్రభున్! 1

### సీతారామలక్ష్మణుల వనవాసము

సెలవున్గైకొనిసాగె, నత్రిముని యాశీఃస్ఫూర్తిపెంపొంద, నె
చ్చెలి సౌమిత్రులఁ గూడి రాఘవుఁడు, వాసించెందు కీకాటవీ
స్థలిగానొప్పెడు దండకాటవికి, ప్రస్థానక్రమారూఢతన్,
వలనొప్పన్ జనకాజ్ఞ దీర్పనఁట దేవా! ఆంజనేయప్రభూ! 2

ధరణీజన్ రఘురామలక్ష్మణుల బద్ధస్వాంతులైగాంచి, ర
వ్వరణీయాత్ములు దండకస్థముని విప్రస్వామి లుప్పొంగుచున్,
"కరమొప్పన్దగ రక్షణీయులము, సౌఖ్యంబొప్పఁగానీవు భా
స్కరతేజా! యిఁటనుండు మంచ"నిరి వీఁకన్నాంజనేయప్రభూ! 3

మునులన్ బ్రోవఁగ గొన్నివాసరము లామోదించి యచ్చోట నొ
ప్పెను, క్రూరోత్కట జంతుసంగతుల నుద్భేదించి వారించుచున్,
వినమచ్ఛీలుఁడు రాఘవుండు పరమప్రీతిప్రపూర్ణాత్ముఁడై
కనిసేవింపఁగ దమ్ముఁడున్సతియు వీఁకన్నాంజనేయప్రభూ! 4

ఇసుమున్జల్లిన రాలనట్టి యడవిన్నిద్ధ ప్రభాసారులై
పసమీరన్ రఘురామలక్ష్మణులు శుంభత్బాణయోగంబులన్
మసిగావించిరి దైత్యనాయకుల; సంభావింపగా సంయముల్,
కసిగాఁజూచుచుజానకీరమణి రాగ, న్నాంజనేయప్రభూ! 5

## విరాధుని శాపవిముక్తి

కనిరచ్చో నతిదీర్ఘదంష్ట్ర, చటులోగ్రస్ఫారగాత్రాఢ్యు, స
జ్జన విధ్వంసు, విరాధు, రాక్షసకుల స్వామిన్, మదోద్రేకునిన్,
ఘనశౌర్యుల్ రఘురామలక్ష్మణులు సత్కార్యప్రకారాత్ముల
వ్వనమార్గంబున పొగుచుండుతరి, దేవా! ఆంజనేయప్రభూ! 6

"ముని మాంసాశనుఁ డీవిరాధుగని, సమ్మోదస్ఫురన్మూర్తులై
మనినారే! నరులెన్నదండకమున్నన్, మౌనీంద్రువేషంబుతో
ఘనచాపంబులు దాల్చి వచ్చితిరె! ఢాకన్జూడరే!"యంచు రా
మునిసౌమిత్రినిగాంచి పల్కెనఁట శంభూ! ఆంజనేయప్రభూ! 7

"ఇదె మీనెత్తురు పీల్చి దాహగతినెంతేన్దీర్చికొందిప్పు డీ
ముదితన్జీల్తునుదొల్త దంష్ట్రముల నామోదంబుతోనింక"నం
చుదితస్ఫూర్తికరంబులన్గొన దురుద్యోగప్రకారాస్థితిన్
కదియన్జేరె విరాధుఁడయ్యెడల ఢాకన్నాంజనేయప్రభూ! 8

"వనితారత్నము జానకీసతిని క్రవ్యాదప్రభుండెన్నగా
తనయంకంబునజేర్పనెంచ, చటులాత్తక్రోధ దుర్వారుఁడై
ఘనఁడాలక్ష్మణుఁడంత, ఖడ్గము మహోగ్రస్ఫూర్తిమైనెత్తి, దై
త్యుని ఖండింపఁగనేగె వేగముగ బంధూ! ఆంజనేయప్రభూ! 9

పటుక్రవ్యాధుని యాగడంబుగని, దివ్యస్ఫూర్తినైమించి, యు
ద్భటనారాచమువేసె రాఘవుఁడు, కంపంబొందుచున్గూలె, నం
తటభూమీజము నేలకూలుగతి భూతవ్రాతమగ్గింప చెం
గట భూమీజ కనన్, విరాధుఁడఁట ఁగాక న్నాంజనేయప్రభూ! 10

అసువుల్బాసి, నిశాచరుండచట దివ్యస్ఫూర్తి గంధర్వుఁడై,
నసిమీరంగ నమస్కరించి, "ధనదస్వామిప్రశాపాహతిన్
వసుధన్దైత్యుఁడనైన నన్ను నాశ్వాసిల్లగాఁజేసి మీ
పసతోడన్దగఁ గా"చినారనెను దేవా! ఆంజనేయప్రభూ! 11

"అనురాగంబున రంభతో మెలఁగ నత్యంతోగ్రచిత్తుండునై
ధనదస్వామి శపించెఁదొల్లి; కడుసంతప్తుండనై యుండ, నా
ఘనుడంతన్గని రామబాణహతి నుత్కర్షంబుగల్గించు నీ
కని, శాపావధిఁదెల్పెనప్పు"డనె నప్పా! ఆంజనేయప్రభూ! 12

"కలదిచ్చోశరభంగునాశ్రమము, వీఁకన్సాగుఁడచ్చోటికిన్
వలనొప్పన్దగఁ గారవించు మిము, దేవా! రామచంద్రా" యటం
చలగంధర్వుఁడు తుంబురాఖ్యుఁడు మహోద్యత్స్ఫూర్తిమైఁదెల్పి ని
శ్చలబుద్ధిన్జనె నాకలోకమున, కీశా! ఆంజనేయప్రభూ! 13

## శరభంగమహర్షి దర్శనము

శరభంగున్గొలువంగ రాఘవుఁడు శస్తస్ఫూర్తి చిత్తంబుతో
ధరణీపుత్త్రికతోడ లక్ష్మణునితో ధర్మప్రకారోన్నతిన్
దరిఁజేరెన్, దగనాశ్రమస్థుల బద్ధప్రీతిరంజిల్ల, న
వ్వరమౌనీంద్రుఁడు సత్కరించె గురుదేవా! ఆంజనేయప్రభూ! 14

మునిదేవోత్తము నాశ్రమభావమటు సమ్మోదంబుగల్గింప, నె
మ్మనముప్పొంగ, రఘూత్తముండు "మిము సంభావించి సేవింప ని
వ్వనిలో నుండఁగ చోటుచూపుఁ, డిఁక దివ్యస్వాంతవిస్ఫూర్తిమై,
నని కోరెన్" శరభంగ సంయమిని దేవా! ఆంజనేయప్రభూ! 15

## సుతీక్ష్ణ మునివరుని గాంచుట

"ససిగానేగిన గంగదాటి, సురభాస్వత్తేజపూరుండు నా
ఋషివర్యుండు సుతీక్షణాఖ్యుఁడట సంప్రీతిన్ నివేదించు, రా
క్షసవాసంబునుగాని సద్వనము, దీక్షస్ఫూర్తినందుండుఁడీ!
యొసలార"న్ననె నమ్మహర్షివిని, స్వామీ! ఆంజనేయప్రభూ! 16

కనువిందౌ సుమనోవిరాజితము, నుత్కర్షప్రభారూఢమున్,
ఘనవేదాంత విచారపూరము, దయోద్గాఢోల్లసత్తీరమున్,
వెనువెంటన్ జని గంగదాటి కనె సంప్రీతిన్ సుతీక్ష్ణాఖ్యస
న్ముని రాజేశ్వరు నాశ్రమంబఁతడు శంభూ! ఆంజనేయప్రభూ! 17

కనిజొచ్చెన్దగ రాఘవుండఁట, సుతీక్ష్ణస్ఫూర్తిమైనొప్పు న
మ్ముని దివ్యాశ్రమసీమనంత ఋషులామోదంబుదైవార రా
మునిసీతమ్మను లక్ష్మణార్యుగని, సంపూర్ణాంబుకుంభంబుతో
ఘనమౌస్వాగతమొప్ప బల్కిరి, శుభాంగా! ఆంజనేయప్రభూ! 18

అఁటసేవించి, మునీంద్రులెల్ల, కటుదైత్యానీకముల్బెట్టు సం
కటముల్ మౌనిగతప్రభావమున సాకల్యంబుగాదాటుటల్,
స్ఫుటరీతిన్ వినిపించిరయ్యెడల, శంభుస్ఫూర్తి దైవారఁగా
పటుశౌర్యాత్ముఁడు రాఘవుండు విన, దేవా! ఆంజనేయప్రభూ! 19

విమలాత్ముల్ రఘురామలక్ష్మణులు దీప్తిన్‌జెందు స్వాంతంబులన్,
తమిఁదీరంగ వసించుచున్, జటుల కాంతారప్రదేశంబునన్
గ్రమమున్‌దప్పిచరించు రక్కసుల సంరంభము వారించుచున్,
ప్రమదంబొప్పఁగ జేసిరామునులకప్పా! ఆంజనేయప్రభూ! 20

"కలయన్‌జొచ్చి రఘూత్తమా! యనుజాతోగాలించి క్రవ్యాదులన్
చలమొప్పన్‌దగ నేలగూల్చితివి, శశ్వద్ధైర్యమేధానిధీ!
వలనొప్పన్‌మముఁగాచినాఁడ విఁట, సంభావించి కీర్తింప మా
తలమే!" యంచునుతించి రామునులు శాస్తా! ఆంజనేయప్రభూ! 21

## మందకర్ణి మహామునిచరిత్ర

మునులన్ వీడ్కొని సాగుచుండ, కడుసమ్మోదంబుతో రాఘవుం
డనుజుండున్ సతికూడిరాగ, వనసీమానంతదృశ్యంబులన్,
ఘనమౌనీంద్ర నివాసభూముల మహోత్కంఠాప్తి సేవించుచున్,
గనెఁగాసారము నొక్కదానినఁట, వీఁకన్నాంజనేయప్రభూ! 22

తదుపాంతంబగు నాశ్రమంబునకు జిత్తంబొప్పఁగా సాగి, స
మ్మదమొప్పన్‌గని రంత, ధర్మభృతు డన్మాన్యోత్తమున్ సంయమిన్
మదికిన్‌గూర్చెడు నంబుమధ్యమున, క్రమంబైనగీతంబులన్
ప్రథితస్ఫూర్తిని నాలకించిరి, శివప్పా! ఆంజనేయప్రభూ! 23

జలపూరంబున నొప్పువాద్యగతి కాశ్చర్యాత్ముఁడై, లోన సం
ధిలు సందేహముతోడ, కారణము లుత్తేజప్రకారాప్తిమై
తలపొప్పన్‌గని గోరె రాఘవుఁడు, చిత్తస్ఫూర్తిమైఁజెప్పె రా
జిల నా ధర్మభృతుండు వారువిన, స్వస్తి న్నాంజనేయప్రభూ! 24

"అలమౌనీంద్రుఁడు మందకర్ణియను పుణ్యాత్ముండు, యోగంబుతో
సలిలాంతర్గృహమొందుగట్టి, యఁటనాశ్చర్యంబుగా నచ్చరల్
కలగానంబుల నృత్యముల్ సలుప నుత్కర్షంబుగాఁజేసె, సం
ధిల పంచాప్సర"మంచుఁబిల్వ నని దీప్తి న్నాంజనేయప్రభూ! 25

అతులంబౌ మునిమందకర్ణి కథ నాఖ్యాయంబు సంధిల్ల స
న్నుతి మీరన్విని, రాఘవాదులఁట సంతోషంబుతోఁబుచ్చి స
న్మతులయ్యాశ్రమవాసులొప్ప గని సన్మానించి వీడ్కొల్ప, సు
స్థితినచ్చో పయనింపసాగిరి ప్రదీప్తి న్నాంజనేయప్రభూ! 26

పదియేండ్లిట్టుల ఘోరకాననములన్ భవ్యప్రకారాప్తిమై
పదిలంబొప్పఁగ నుండి, రాఘవులు సంపన్నాత్ములౌ మౌనులన్
విధియుక్తంబుగఁగొల్చి, వెండియు మహాప్తిన్ వారలేతెంచి రా
సదయున్జేర సుతీక్ష్ణసంయమిని శాస్త్రా! ఆంజనేయప్రభూ! 27

**అగస్త్యమహాముని మాహాత్మ్యము**

అరయన్వేడె, సుతీక్ష్ణమౌనివరు విద్యానందసంధాయినిన్,
కరముల్లాసముతోడ రాఘవుఁడు, విజ్ఞానోల్లసన్మూర్తి సం
వరణీయాత్మ నగస్త్యసంయమిని, సంభావించి సేవింప, సు
స్థిర మార్గంబును దెల్పుడంచనుచు ఁబ్రీతి,న్నాంజనేయప్రభూ! 28

తతభక్తిన్ మునిదారిఁజూపెను, నగస్త్యస్వామి దృగ్గాగరం
జిత దివ్యాశ్రమభూమికిన్, క్షితిజ సంసేవింప, సౌమిత్రి సం
గతుఁడై రాఘవుడేగె నయ్యెడకు నుత్కర్షప్రకర్షోన్నతిన్
సతితోడన్గనవచ్చె గుంభజుఁడు, శాస్త్రా! ఆంజనేయప్రభూ! 29

మునిరాజేశ్వరు గుంభసంభవు పదాంభోజంబులన్ దాకి, యా
ఘనుడుప్పొంగ నమస్కరించిరి, సముత్క్రాంతస్ఫురచ్చిత్తులై
జనకక్ష్మాపసుతానువర్తులగుచున్ శ్రద్ధోన్నతిన్ రామ ల
క్ష్మణు, లచ్చోఁబ్రమదాంబువుల్ గురియ, వీఁకన్నాంజనేయప్రభూ! 30

చులుకప్రాయముగాఁగ నంబుధిని సంస్ఫూర్తిప్రకారాప్తి భూ
తలమొప్పన్ దగనాచమించిన నగస్త్యస్వామి సేవించుచున్,
వలనొప్ప న్నటనుండె నాశ్రమమునన్ భక్తిప్రపన్నాత్ముఁడై
యలసీతాపతి, లక్ష్మణుండెసఁగ దేవా! ఆంజనేయప్రభూ! 31

దనుజస్ఫార మదోద్యమాంతకుఁడు, వైదర్భీ వినోదాస్పదుం,
డినవంశోద్భవుఁడైన రాఘవుని, రాజేంద్ర ప్రభుస్ఫూర్తిమై
గని దీవించియొసంగె వైష్ణవమయోత్కర్షాత్తకోదండమున్
ఘనఖడ్గంబు, నగస్త్యమౌనియఁట వీఁకన్నాంజనేయప్రభూ! 32

"అలగోదావరి చెంత, పంచవటి విఖ్యాతంబుగానొప్పు, భూ
తలమందెన్నఁగ, రామచంద్ర! కడుబద్ధస్నేహచిత్తంబుతో
చెలితోడన్ దగమీరలుండుఁడఁటఁనక్షీణ ప్రభల్మీర,"నం
చెలమిన్జెప్పె నగస్త్యసంయమి పురారీ! ఆంజనేయప్రభూ! 33

**జటాయు దర్శనము**

మునిరాజేశ్వరు నాశ్రమంబపుడు సమ్మోదంబుతోవీడి, ల
క్ష్మణ సీతాయుతుఁడై రఘూత్తముఁడు శుంభద్వృత్తిమైనేగుచున్
గనె, పక్షీంద్రుని నొక్కనిన్ నడుమ సాక్షాద్వైనతేయాభునిన్
జనసేవాంచితకార్యధుర్యుని, మహేశా! ఆంజనేయప్రభూ! 34

పతగస్వామి వచించె, రాఘవుని సంభావించి వీక్షించి "మీ
పితరుండొప్పఁగ నాకుమిత్రుఁడు, లసత్ప్రీతిన్ మనస్ఫూర్తిమై
స్తుతులొప్పన్ గురిపించు, మిమ్ముఁగని, సంతోషంబుతోనుంటి, న
ప్పతినిన్గాంచిన యట్లు"గాననెను దేవా! ఆంజనేయప్రభూ! 35

"భువనంబెన్న జటాయువంచుఁ బిలుచున్ బొల్పొందగా నన్ను; బాం
ధవరాజిన్ మహదాప్తిమైమెలఁగు నాతమ్ముండు సంపాతి; మీ
శివసౌందర్య పరాక్రమంపుగతి సంసేవింప, మీతండ్రిఁ గ
న్గవవీక్షించిన యట్లుతోచె"నని వీఁకన్నాంజనేయప్రభూ! 36

అనిభాషించిన పక్షిరాజుగని, దివ్యస్ఫూర్తి సేవించి, య
వ్వనసీమన్ నవపర్ణశాల మునిసేవాస్ఫూర్తి నిర్మించి, ల
క్ష్మణదేవుండుఁటఁ గొల్వ, రాఘవుఁడు శశ్వద్ప్రీతిసీతమ్మతో
మననెంచెన్ వనవాసశేషమును భీమా! ఆంజనేయప్రభూ! 37

**శూర్పణఖ తారసిల్లుట**

చెలులున్గూడి వనంబులో జనుచు, వీక్షించెన్ మహావీరునిన్,
నళినాక్షున్, నవమన్మథాంగు, నయనానందస్వరూపోన్నతున్,
గలిత ప్రాభవు, రామచంద్రుఁ,గడునాక్రాంతప్రపూర్ణత్మయై
యలదైత్యాంగనయైన శూర్పణఖ దేవా! ఆంజనేయప్రభూ! 38

వని, దైత్యాంగన లారఘూత్తముని రూపస్థైర్యసౌభాగ్యముల్
గని, "యీవీరుని కౌగిలింపని సముత్కర్షంబులింకేల?, యౌ
వనదర్పంబదియేల? రాచరిక భవ్యస్ఫూర్తులేల"ంచు, రా
వణుతోబుట్టువుతోడ బల్కిరట దేవా! ఆంజనేయప్రభూ! 39

పరమప్రీతిని భూమిజన్గనుచు, భవ్యస్ఫూర్తిమైనుండు సుం
దరరామున్గని, దైత్యవృత్తగతి సద్ధర్మంబు బోనాడి, బం
ధురకామంబునఁజేరి, శూర్పణఖ తోడ్తోఁగౌగిలింపంగఁ, దొం
దరఁబెట్టెన్ రఘురామచంద్రునఁట, శాస్త్రా! ఆంజనేయప్రభూ! 40

వెగటైతోపఁగ, రాక్షసాంగనమదోద్వేగంబు వారించి, నె
వ్వగతోడన్గని, రామచంద్రుఁ"డిది భావ్యంబౌనె? స్త్రీజాతికిన్
మగువా! గేస్తుఁడ నాసతిన్గనవె! యమ్మా! పాపమీచేష్ట నీ
తెగువన్ జూడఁగ నీచమయ్యె"నని నీతిన్నాంజనేయప్రభూ! 41

"తెరవా! యెవ్వతెవీవు? సంయములతో దీక్షోల్లసద్వృత్తిమై,
కరముగ్రాటవి నున్నమమ్మునిటులన్, గామింపగాజెల్లునే!,
సరిగాదెన్నగ, నీప్రదేశమున సంచారంబుగావించుటల్,
త్వరగా పొమ్మని" చెప్పెరాఘవుఁడు శాస్త్రా! ఆంజనేయప్రభూ! 42

చిరునవ్వుల్ దళుకొత్తునేత్రగతి నుచ్ఛేదించి యమ్మాటలన్,
"వరణీయుండవు నామనోహరుఁడ, వీభాషించుటల్మాను, మి
ద్ధరణీచక్రమునేలు రావణుని సిద్ధస్ఫూర్తిమైనేలు సో
దరి, నే శూర్పణఖంచు గాంచు"మనె నంతన్నాంజనేయప్రభూ! 43

"సతితో నొప్పెడు నాథుఁడన్యలలనా సాంగత్యమున్గోరునే!
మతిలేకుండగరాకు"మంచనుచు, క్షేమస్ఫూర్తిమై రాముఁడం
చితరీతిన్గని పల్కి, సీతపయి "కిస్సే!" యంచులంఘించు, నా
దితి రాజాంగన నాపె, లక్ష్మణుఁడు దీప్తి న్నాంజనేయప్రభూ! 44

కామోద్రేకమణంపలేక కడుధిక్కారంబుతోరేగ, సం
క్షేమస్ఫూర్తిని లక్ష్మణుండసుర నాక్షేపింప "ఛూ" యంచు, నె
మ్మోముగాంచుచు (గోసెనయ్యెడల సంపూర్ణప్రకారాప్తిమై
కామోల్లాసము(దెల్పు ముక్కుచెవులన్, గాకన్నాంజనేయప్రభూ! 45

## ఖరదూషణాదుల వధ

భంగంబొందిన చుప్పనాక, చటులవ్యాఘ్రాకృతిన్ రోజుచున్
నింగిన్దాక(గ నేడ్చుచు న్నరిగి, యంధీభూతచిత్తంబుతో,
పొంగుల్వారెడు దుఃఖపూరమున వాపోయెన్, మహోద్వేగ బ
ద్ధాంగస్ఫూర్తి, సహోదరుల్ గన(గ, దేవా! ఆంజనేయప్రభూ! 46

కటురీతిన్, ఖరదూషణాసురులు, రక్తస్ఫారనేత్రంబులన్
చటులక్రోధము పొంగులెత్త( గని, యాశ్వాసిల్లు"మో సోదరీ!
పటురీతిన్ గడదేర్తుమా నరుల ఢాకన్జీల్చి; క్రవ్యాదులు
త్కటరీతిన్ జెలగంగ, నంచ"నిరి శాస్తా! ఆంజనేయప్రభూ! 47

రక్షోనాథుని యాజ్ఞదాల్చి భయదక్రవ్యాదసేనాపతుల్
రూక్షస్ఫూర్తిని నెత్తి వచ్చిరి, సమారూఢాయుధోపేతులై,
కక్షన్దీర్ప(గ రామలక్ష్మణులు విక్రాంతస్ఫురద్రుద్రులై,
దీక్షన్వారిని రూపుమాపి రనలాప్తి, న్నాంజనేయప్రభూ! 48

ఖరు(డంతన్ బుసగొట్టు నాగముగతిన్ గర్వాంధు(డైరేగె భీ
కరరీతిన్ దనతోడ దూషణు(డు విక్రాంతప్రకారాప్తి బం
ధురదైత్యాప్తులు నొప్ప, శూర్పణఖ యత్యుగ్రంబుగా రాముపై
గురిచూపన్ గని సంగరప్రసరదిక్కు న్నాంజనేయప్రభూ! 49

"అలనైరావతమెక్కి, వజ్రమును సాహాయ్యంబుగాఁదాల్చి, సం
ధిలనేతెంచిన వాసవుండయిన, మైధీయుక్తులింపొందఁగా
కలనైనన్ మననేర్చునే!"యనుచు నాక్రవ్యాధనాథుండు మ
త్తిలి వాక్రుచ్చుట, రాఘవుండుగని దీప్తి న్నాంజనేయప్రభూ! 50

ఖరుమత్తోక్తుల నాలకించి, యఁటవేగన్ "లక్ష్మణా! జానకీ
తరుణిన్ శైలగుహాంతరంబున ప్రసిద్ధస్ఫూర్తి రక్షింపుమీ!,
ఖరునిన్దూషణునిన్ వధించి పటు దుష్కార్యంబు వారింతు,"నం
చెరుగన్ రాముఁడుచెప్పె తమ్మునికి, వాసిన్నాంజనేయప్రభూ! 51

అమితోగ్రంబులు దుర్నిరీక్ష్యములు క్రవ్యాదాకృతుల్గాంచి, యా
సుమసంకాశ ధరాత్మజాహృదయ సంక్షోభంబు ఁగాకుండఁగా,
భ్రమదంబొప్పఁగ ఁగాచె లక్ష్మణుఁడు శ్రీరాముండు రాకాసులన్
యమునిన్జేరఁగఁ దోలసాగె, రణభీమా! ఆంజనేయప్రభూ! 52

మఱువుల్సించుచు, కైదువుల్ విరచుచున్, మారెందులేకుండగా
శిరమున్డొల్లగ రాల్చుచున్, దనుజా లస్థిమంబుతోఁబారఁగా,
శరయోగంబున రాఘవుండెసఁగె, శశ్వద్భానుసంకాశుఁడై,
సురగంధర్వులు మెచ్చ, నింగిపయినచ్చో నాంజనేయప్రభూ! 53

జ్యానాదంబులు పిక్కటిల్లె శరముల్సారించి యోగింపఁగా,
దీనారావము దిక్కులన్విరిసె, నిస్తేజంబుతో దానవుల్
నానాదిక్కులఁ బారసాగిరి, ప్రచండస్ఫారదావాగ్నికి
న్నేణానీకము పారుతీరున, పురారీ! ఆంజనేయప్రభూ! 54

వడి వెన్నిచ్చుచు పారుచున్న, దనుజవ్రాతంబు వీక్షించి, వెం
బడి లంఘించెడు రోషభీషణగతుల్ భావంబులోరేగఁగా,
కడునుద్రేకముతోడ దూషణుఁడు రూక్షస్ఫూర్తిమై, రాముపై
జడిగాగన్ గురిపించె బాణముల, శాస్త్రా! ఆంజనేయప్రభూ! 55

శరవర్షోద్ధతి ఁదూలిపోవఁగ మనస్స్థైర్యంబుతో, రాఘవుం
డరుదౌరీతిఁగ మారుతాస్త్రమటులుద్యద్వృత్తి యోగించి య
ప్పరనారాచములెల్ల డిందుపడఁగా వారించి, జృంభించి, యి
ద్ధరపై ఁగూలగఁజేసె దూషణుని, శాస్త్రా! ఆంజనేయప్రభూ! 56

హరిశౌర్యప్రభనోపలేక, యసహాయస్ఫూర్తిమైఁబారు న
క్కరియూథంబులమాడ్కి, తక్షణము కక్షన్దీర్పఁగాలేక కిం
కరదోషాచరవీరులెల్ల కడువేగంబొప్పఁగా పారి ర
త్తరి మన్నీను శవంబువీడి, కడుచింత న్నాంజనేయప్రభూ! 57

తన తమ్ముండగు దూషణుండఁట విషాదస్ఫూర్తిమైనీల్గుటల్,
విని, క్రోధానలదగ్ధుఁడై ఖరుఁడు, నుద్వేగప్రకారాప్తిఁ జ
య్యన నైక్ష్వాకు వధింతునంచని మహావ్యాళాకృతిన్ మీరుచు,
న్నని గావింపఁగవచ్చె నంత, రణభీమా! ఆంజనేయప్రభూ! 58

త్రిశిరాదిప్రముఖుల్ మహాసమర శక్తిన్ ప్రాభవోన్మత్తులై
దశకంఠానుజు, ఘోరకార్యపరు యుద్ధక్రీడ భీతావహున్
విశదస్ఫూర్తినిఁ జేరి రావహమునన్ విస్తారవేగోన్నతిన్
దిశలెల్లన్గడు దద్దరిల్ల పురబదీ! ఆంజనేయప్రభూ! 59

ఖరునాజ్ఞన్, త్రిశిరాదివీరదనుజుల్ గర్వాంధులైరేగి, య
ద్ధరణీజప్రియవర్తి రాఘవుని, సద్ధర్మోల్లసన్మూర్తిని,
న్నరుదౌ శౌర్యముతోడ మార్కొనిరి క్రవ్యాదోగ్రమాయాప్తి, నా
హరితోఁబోరు మదేభయూథగతి, నప్పా! ఆంజనేయప్రభూ! 60

ఖరుఁడగ్గింపఁగరేగి రంత, త్రిశిరాఖ్యఖ్యాతముఖ్యాసురుల్
కరవాలంబులతోడ, రాఘవుని ముక్కల్ సేయ నొక్కుమ్మడిన్,
పరగుల్దీయఁగఁజేసె దాశరథి శుంభచ్ఛౌర్య దైవారి బం
ధురనారాచతతిప్రసారగతి బంధూ! ఆంజనేయప్రభూ! 61

కసితీరన్ నిశితాశుగంబుల సముద్గాఢప్రయోగంబులన్,
పసిమీరన్నుసిఁజేసె, రామవరుఁ డాశ్చర్యప్రకారోన్నతిన్,
వెసతోడన్ ద్రిశిరాఖ్యు కాయమట దీప్తిన్నేలపైడుల్లగా,
పసవీడన్ ఖరుఁడార్చి ఁగంపిలుచు, దేవా! ఆంజనేయప్రభూ! 62

కోపోద్రేకముపెచ్చురేఁగ ఖరుఁడాక్రోశించుచున్దూకె, ను
ద్దీపజ్వాలల పైకి సాగు శలభాప్తిస్ఫూర్తిరూపింప, నా
పాపాత్మున్ బరిమార్ప రాఘవుఁడు దివ్యస్ఫారశౌర్యోన్నతిన్
చాపోద్భూతశరాగ్నులన్ బరపె, నీశా! ఆంజనేయప్రభూ! 63

మసిగానయ్యెనుసేనతో ఖరుఁడు, సంభావింపఁగా సంయముల్,
వెసతోడన్ రఘురాముఁజేరి, విలసద్ప్రీతిన్ మనోజ్ఞంబుగా
"నసలాదేవుఁడ వీవుమా"కనుచు నాహ్లాదప్రకారాప్తిమై
దిసలెల్లన్గొనియాడఁబల్కిరి ప్రశాంతి న్నాంజనేయప్రభూ! 64

విలసద్రీతిగ నొప్పె దండకము, సేవింపన్ మునీంద్రోతముల్
మలయన్‌జొచ్చెను హోమధూమములు, సంభావింప దివ్యోత్తముల్
కలయన్‌బ్రాకెను శాంతసౌఖ్యగతి, నుత్కర్షప్రకర్షంబుతో
విలసిల్లె ఋషినందనంబనఁగ దీప్తిన్నాంజనేయప్రభూ! 65

## అకంపనుఁడు రావణునకు రాముని వృత్తాంతంబుదెల్పుట

కనఁగా రాముని బాణసంగతికి లక్ష్యస్ఫూర్తిగాకుండ ని
ల్చిన, రాకాసుఁడకంపనాఖ్యుఁ, డలగాసిన్‌జేరి లంకేశ్వరున్,
"వినుమోస్వామి! త్వదీయసోదరుల నుద్ఛేదించె ఘోరంబుగా,
పెనుకయ్యంబున రాఘవుండ"నుచు చెప్పె న్నాంజనేయప్రభూ! 66

అనిలోనన్ ఖరదూషణాదులను సంహారంబుగావించి, మా
నిని సీతాంగనతోడ రాఘవుఁడు సందీపించు తమ్ముండు ల
క్ష్మణుఁడొప్పన్ దగసేవసేయ, వనిలోక్షాత్రప్రభోపేతుఁడై
మునివృత్తిన్ నివసించు"నంచనెను శంభూ! ఆంజనేయప్రభూ! 67

ఖరునిన్ దూషణునిన్ నరుండొకఁడు ధిక్కారంబుగావించి, సం
గరమందెన్న వధించుటల్‌విని మహోగ్రస్ఫారనేత్రంబు లు
ద్ధురబద్ధాగ్నిభరంబులై రగుల, నుద్యోతించు దృగ్వృత్తి, సో
దరులన్‌గాంచెను పంక్తికంధరుఁడు, శాస్త్రా! ఆంజనేయప్రభూ! 68

అరి దుర్వారు, నుపాయమార్గమున సంహారంబుగావింపఁగా
కరణీయంబని పల్కిరప్పుడఁట సౌకర్యంబుగా మంత్రు, ల
త్తరి మారీచుని శాంబరీకరుని చిత్తంబొప్పఁబిల్పింప, న
ప్పరివారంబును బంపె, రావణుఁడు దేవా! ఆంజనేయప్రభూ! 69

**శూర్పణఖ రావణునకు తనపరిభవంబునుదెల్పుట**

చెవులన్ ముక్కును గోయ లక్ష్మణుఁడు, నిస్తేజంబుతోవచ్చు నా
జవరాలిన్ నిజసోదరిన్‌గని, మహైశ్వర్యప్రభూతాత్ముఁడై,
భవనప్రాంగణమందు నార్ద్రగతి సంభావించె, పౌలస్త్యుఁడ
య్యవమానంబు భరింపలేక యపుడప్పా! ఆంజనేయప్రభూ! 70

దశకంఠున్‌గని యేడ్చి బోరన, విషాదస్ఫూర్తిరెట్టింప, దు
ర్దశ విన్పించెను చేరి శూర్పణఖ బద్ధస్ఫూర్తి సౌమిత్రి యా
శశిబింబానన సీతగాంఁచ నఁట, నాసౌందర్యంబు నాశంబుగా,
దిశలెల్లన్‌గనఁ, గోసెముక్కనుచు గస్తి న్నాంజనేయప్రభూ! 71

"నను లంకేశుని ముద్దుచెల్లెలిని, పంతంబొప్పఁగా రాఘవుం
డనుజున్ బంప, నతండుకోసె, కనుమన్నా! నాకురూపంబు, భా
వనగావింపఁగరాదు రాముసతి భాస్వద్రూపలావణ్యముల్,
కనిపొందన్‌దగు నీకు"నంచనెను గాక న్నాంజనేయప్రభూ! 72

"అఁట నీపేరును శౌర్యదర్పముల నన్నా! దెల్ప,"ఛూ"యంచు సం
కటురీతిన్‌గని, లక్ష్మణుండపుడు వేగన్‌గోసె, నా నాసికన్
స్ఫుటకర్ణద్వయి"నంచు శూర్పణఖ వాపోయెన్ విషాదంబుతోఁ,
బ్రటులంకేశుని చెంతనిల్చి మదినొంపన్నాంజనేయప్రభూ! 73

అని దైన్యంబున నేడ్చు చెల్లెలిని, నాప్యాయంబుదైవారఁగా
చనువొప్పన్‌దగ జూచి రావణుఁడు "నీస్వాంతంబు రంజిల్లఁగా
కనుమమ్మా! కసిదీర్తు, రాఘవుఁడు దుఃఖస్ఫూర్తిమైగ్రుంగ, యిం
తిని సీతాసతిదెత్తు, నమ్ము"మనె దీప్తి న్నాంజనేయప్రభూ! 74

**రావణుఁడు మారీచునికి శూర్పణఖ పరిభవమును దెల్పుట**

చటులోద్వృత్తి సహోదరిన్దనుప, నాశాస్ఫూర్తి జెన్నొంద, నా
త్రుటి లంకేశుఁడు కొల్వునాపి చనె, నుత్తేజంబుదైవార నా
దట మారీచుని యాశ్రమంబునకు నుద్యత్క్రోధచిత్తాప్తి, ముం
గిట బంగారురథంబునెక్కి ధృతశక్తి న్నాంజనేయప్రభూ! 75

కని మారీచుఁడు వచ్చి స్వాగతము నుత్కర్షప్రకర్షోన్నతిన్
దనరన్బల్కె దశాస్యుచిత్తమఁట సంధానింప, సూటిగ శూ
ర్పణఖోక్తంబగు వృత్తమంతదెలిపెన్ పౌలస్త్యుఁడుద్విగ్నతన్,
చనువొప్పన్దగు రీతి నాతనికి, శాస్తా! ఆంజనేయప్రభూ! 76

"ఘనుఁడా! చూడఁగలేను శూర్పణఖ దుఃఖంబెన్న, మారీచ! వం
చన తోడన్గొననెంతు రాఘవుసతిన్, సాయంబొప్పఁగావింపుమీ!
వనిలోఁద్రిమ్మరఁజేసి రాఘవుని తప్తస్వాంతుఁగావింప", నం
చని చెప్పెన్ దశకంఠుఁడయ్యెడల దేవా! ఆంజనేయప్రభూ! 77

**మారీచుఁడు రామునెదిరించుట యసాధ్యమనిదెల్పుట**

అతులావేశముతోడ రావణుఁడు సాహాయ్యంబు మారీచునిన్
స్తుతిమీరన్దగగోర, నమ్రగతి నచ్చో బల్కె "స్వామీ! మనో
గతభీతిన్ రఘురాముఁ జేరవెరతున్, గారుణ్యమున్జూపుమీ!
సతులన్గోరఁగ రాదటంచనుచు శాస్తా! ఆంజనేయప్రభూ! 78

"సమదాటోపముతోడ మున్నెసఁగి విశ్వామిత్రుయాగంబు వి
ఘ్నముసేయంజను మమ్ముగాంచి, తతయజ్ఞధ్వంసులన్ బాపి, ది
వ్యమహాస్త్రాప్తినిదూలఁగొట్టె నతిబాల్యంబందు రాముండు, త
ద్యమసాన్నిధ్యముజేర"ఁగా ననెను దేవా! ఆంజనేయప్రభూ! 79

"ఋషి లోకోత్తము చిత్తమున్‌గదిసి యార్జించెన్ మహాస్త్రంబులన్
రసనాగ్రంబుననొప్పు నస్త్రయుత శస్త్రస్ఫార శౌర్యాత్మునిన్
కసితో రాముని మార్కొనంగఁ దరమే! క్రవ్యాదరాజేంద్ర! నన్
నసిగానర్థముజేసికొమ్మ"నె మహేశా! ఆంజనేయప్రభూ! 80

"మరువన్నేపను నేటి కావిభుని శుంభద్బాణఘాతంబులన్,
చరియింపంగ వణంకుదా ప్రభుని సంచార ప్రదేశంబులన్,
అరిమత్తేభ హరీంద్రమైపరఁగు కవ్యాదేంద్రవిధ్వంసునిన్
మరలన్‌జేరుటమిత్తిగోరు",టనె భీమా! ఆంజనేయప్రభూ! 81

"నను మన్నించి త్యజింపు"మంచనుచు జింతన్‌దూలుచున్‌జెప్పె, రా
వణుచిత్తంబునకెక్కదయ్యెనది, కంపంబొందుడెందంబుతో
ప్రణుతుండై తలయొగ్గెనంత మదినారాటింప మారీచుఁడ
ద్దనుజేంద్రున్‌గని వెంబడించిచనె, శాస్తా! ఆంజనేయప్రభూ! 82

## మారీచుఁడు పైడిలేడియగుట

అవధానంబున లక్ష్మణుండు పరిచర్యల్‌సేయగా, జానకీ
ధవుఁడొప్పారు కుటీరమున్ నిగమనాదస్ఫారమున్ జేరెఁబం
చవటీసారము రావణుండు, కడునాశాస్ఫూర్తి మారీచుతో,
శివసౌందర్య ధరాత్మజన్‌గొనఁగ శక్తి న్నాంజనేయప్రభూ! 83

నవరత్నద్యుతిసారసంగతుల స్వర్ణస్ఫార విక్రాంతులన్
జవసత్త్వంబులఁ జిమ్ముచున్ పరుగులన్ సారించుసారంగమై
స్తవరీతిన్ రఘురామపత్నిగన నాశాస్ఫూర్తి మారీచుఁ డొ
ప్పె వరాకారముతోడ నంత కపటాప్తి న్నాంజనేయప్రభూ! 84

అఁటసీతాంగనగాంచ నిల్చు, తృణమాప్యాయంబుగామేయు, సం
స్ఫుటవృత్తిన్ కడుచౌకళించు, చని చూపుల్ గాంక్షలూరింపఁగా
నఁటగుప్పించు, సువర్ణకాంతి బహిరంతస్స్ఫూర్తిరూపింప, జెం
గట మారీచుఁడు లేడియై పరఁగి, వీఁకన్నాంజనేయప్రభూ! 85

"కరచామీకరదీధితుల్‌బరచి యాకర్షించునే! లేడి, బం
ధుర రత్నద్యుతులొప్ప భూతలము నుద్యోతింపగా జేయునే!
హరిణంబంచుదలంచి, దానవుల మాయాజాల మం"చన్నతో
స్ఫురియింపన్‌దగఁజెప్పె లక్ష్మణుఁడు శంభూ! ఆంజనేయప్రభూ! 86

## పైడిలేడిని సీతాదేవి కోరుట

అని సౌమిత్రి వచింప నంతఁగడునాప్యాయంబుతో రాము నా
నన మీక్షించుచుఁబల్కె జానకి మనోజ్ఞస్ఫూర్తిమై "నాథ! యి
వ్వనమందొప్పెఁ బసిండిలేడి, మదినాకర్షించె, మిన్నందుచున్
ఘనరత్నద్యుతిసంగతి"న్ననుచు వీఁకన్నాంజనేయప్రభూ! 87

"మనముప్పొంగఁజరించుచున్నదది శుంభత్సారలీలాగతిన్
కనివిందైయుసిఁగొల్పెఁ బైడిరుచి సంఘర్షించు రత్నద్యుతిన్,
నిను బ్రార్థింతును తెచ్చి"యిమ్మనుచు సందీపింపఁగాఁగోరె రా
ముని వీక్షించుచు సీతముచ్చటగ శంభూ! ఆంజనేయప్రభూ! 88

"వినుమింకెయ్యదికోర, దానిని మనఃప్రీతి ప్రకారాప్తిమై
కొనితెచ్చిమ్మిఁక, కానిపక్షమున నుత్కర్షంబుతో దానిదౌ
మున రుక్మద్యుతి నీనుచర్మమును వీఁకన్‌దెమ్ము నాథా!"యటం
చెనయున్‌గోరెను సీత దాశరథి నెంతే నాంజనేయప్రభూ! 89

సతిసీతాంగన కోర్కెఁదీర్చి మది నాశ్వాసిల్లఁగాఁజేయు సం
గతి సౌమిత్రికిఁ దెల్పి, విల్లుఁగొని వీఁకన్‌సాగు రామన్నకున్
నతుఁడై, లక్ష్మణుఁడంతఁ జెప్పె, "వలదన్నా! రాక్షసుల్ శాంబరీ
యుతులీలేడిని సృష్టిచేసిరని" శంభూ! ఆంజనేయప్రభూ! 90

"మమకారంబున సీతకోరెనిది, సంభావించుటల్‌నాదు ధ
ర్మము, వారింపకు, నేనువచ్చువరకామాన్యాత్మ రక్షింపుమీ!
రమణీయంబగు పైడిలేడిగతి, సారస్ఫూర్తి వెన్నంటి నే
శ్రమలేకుండఁగఁ దెత్తు"నంచనెను ధీరా! ఆంజనేయప్రభూ! 91

## రాముఁడు మారీచుని రూపుమాపుట

ఘను, సౌమిత్రి, నిజానుజున్ నిలిపి, సద్యస్ఫూర్తి వెన్నంటె కాం
చనసారంగము నారఘూత్తముఁడు, చంచల్లీల లంఘించుచున్
జను దూరంబుగ, దగ్గరై కనఁబడున్, సంతృప్తిమైఁజూచు, జి
క్కనయట్లొప్పును, చిక్కకుండు, మృగమాగిన్నాంజనేయప్రభూ! 92

కదియన్‌జేర రఘూత్తముండు మృగమాకాంతారమధ్యంబునన్
పదిలంబొప్పఁగమించు, మాయమగు, పెన్ బాణంబు సంధింపఁగా,
'మదివేసారి, వధించి గైకొనుటయే మార్గంబుగానెంచి' నె
మ్మది నారాఘవుఁడస్త్రమెక్కిడె మహాత్మా! ఆంజనేయప్రభూ! 93

వరమంత్రంబుజపించి, యస్త్రమును సంభావించి సంధించె, సుం
దరసారంగముపై రఘూత్తముఁడు రత్నస్ఫూర్తులున్‌జిమ్మ నా
హరిణంబంతట మూల్గు లుప్పతిలఁగన్, "హా! లక్ష్మణా!" యంచు ను
ర్వరపైఁగూలె, వరాస్త్రపాతమున ధీరా! ఆంజనేయప్రభూ! 94

అరుదౌ రాఘవబాణసారహతి, హాహాకారముల్రేగ, భీ
కరమారీచకళేబరంబగుచు భంగంబొందె సారంగము
ర్వరభేదిల్ల విహంగజంతుతతి మూర్ఛన్బొందఁగా నంత, దు
ర్భరఖేదంబున దానవుల్గనల దేవా! ఆంజనేయప్రభూ! 95

"నను దూరంబుగదెచ్చె నీమృగము కాంతారప్రదేశంబునన్,
కనిరాకాసులు జానకీసతిని నుగ్రస్ఫూర్తి రాపాడ, ల
క్ష్మణుఁడవ్వారిని నొంచెనోయెగసి, యాక్ష్మాపుత్త్రి యెట్లున్నదో"
యనిచింతించుచు సాగె రాఘవుఁడు దేవా! ఆంజనేయప్రభూ! 96

## సీతాలక్ష్మణుల సంవాదము

అలమారీచుఁడు "లక్ష్మణా!" యనుచు మాయావృత్తిమైఁ బిల్వఁ, గం
పిలుచున్ రామునియార్తనాదమని, యావేగంబుతో సీత సం
కలితార్తిన్గని "లక్ష్మణా! పిలిచె నాక్రందప్రకారార్తి ని
న్నలమీయన్న, రయాప్తి నేగు"మనె దేవా! ఆంజనేయప్రభూ! 97

"మృగమున్దెమ్మని రామునొంటరిగ సౌమిత్రీ! మహామోహమొ
ప్పఁగ బంపించితి, దైత్యులాతనిని రాపాడంగ జృంభించిరో!
పగదీరన్వధియింప బాల్పడిరొ! యప్పా! లక్ష్మణా!"యంచు నె
వ్వగతో లక్ష్మణునంపె సీతయపుడప్పా! ఆంజనేయప్రభూ! 98

"పలుమారశ్రువులొల్కఁబల్కుసతి సంభావించి, సౌమిత్రి, లోఁ
గలతన్జెందకుదల్లి! సోదరుని సాక్షాద్బ్రహ్మ రుద్రాదులున్
గలనన్దాకఁగలేరు, దైత్యుడొకలెక్కా! జూడ! మాయన్నకున్
వలదమ్మా! భయమొందనంచ"నెను దేవా! ఆంజనేయప్రభూ! 99

"అటులార్తినను బిల్చుటల్, గనుము క్రవ్యాదోల్లసత్‌మాయగా,
చటులక్రూరమృగోద్ధతిన్ దనుజవిస్తారాటవీమధ్యమం
దిటు లేకాకిగఁజేసి పోగలనె? తల్లీ! నిన్ను; మన్నింపు మిం
కిఁట, నంచేర్పడఁబల్కె లక్ష్మణుఁడు శూలీ! ఆంజనేయప్రభూ! 100

**సీత లక్ష్మణుని పరుష వాక్యములాడుట**

చటుల క్రోధవశాత్మయై కని, మనస్థైర్యంబు కోల్పోయి, "య
చ్చట రాజ్యంబుహరించె తమ్ముఁడొక డాశాస్ఫూర్తి వెల్గొంద; ము
చ్చటతో నాపతి చావుగన్గొని దురాశాస్ఫూర్తి నన్బొందఁగా
నిఁట నీవుంటి"వటంచు సీతయనె భ్రాంతిన్నాంజనేయప్రభూ! 101

అనుసీతమ్మ వచోగతుల్ ములుకులై యాత్మన్‌విదారింప, ల
క్ష్మణుఁడత్యంత విషాదమున్‌గదుర"నమ్మా! పోయి, మాయన్న రా
ముని సేమంబున నేనుదెత్తు నిను శంభుస్ఫూర్తిమైగాతు, ని
వ్వనమందెన్నఁగ దేవ"దేవుఁడనె నప్పా! ఆంజనేయప్రభూ! 102

కనులందశ్రువులొల్క, కాననమునన్ గన్జూపుస్ఫూర్శించు నం
దనుకన్, సీతకు సేమమున్‌గనుచు, కాంతారంబులోనేగె న
న్నను గాంచంగ సుమిత్రపుత్త్రుఁడఁట, సంధానించి చాపంబు న
వ్వనిలో గ్రూరమృగాళిఁజంపుచు, శివప్పా! ఆంజనేయప్రభూ! 103

బలవంతంబుగఁబంపి లక్ష్మణుని, నాశ్వాసిల్లగాలేక, సం
చలిత స్ఫూర్తిని నాత్మలోఁగనుచు నిశ్వాసప్రసారాప్తిఁగం
పిలి, రామానుజుఁగూర్చు పల్కినముడుల్ భేదించి గారింప, న
ల్లలనారత్నములోఁదలంచె, విధి లీల, న్నాంజనేయప్రభూ! 104

కనఁగానెంచెను సీత"పైడిమృగమున్గాంక్షింపఁగానేల? దా
నిని తేన్ నాపతి పోవనేల? మఱి చింతింపంగ నాకేక నే
విని సౌమిత్రినిఁ బంపనేల? మది నుద్భేదించు వాగ్రీతి నా
తని గారింపగఁనేల?"యంచనుచు నాత్మన్నాంజనేయప్రభూ! 105

**రావణుఁడు సన్యాసివేషంబున సీతకడకు వచ్చుట**

వెలిస్వచ్ఛంబగుబూదిపూసికొని, దీప్తిన్దాల్చి కాషాయమున్
సలిలంబొప్పు కమండలంబు పెరహస్తంబందు చెన్నొంద, గా
నల సన్యాసిగఁదోచువేషమున ఛన్నస్ఫూర్తి పౌలస్త్యుఁడు
జ్వలరీతిన్నఁట వచ్చె సీతఁగొనఁగ నాశన్నాంజనేయప్రభూ! 106

తనియన్గాంచె సుగంధబంధుర లసత్తారుణ్యసౌందర్య రా
మునియర్ధాంగిని జానకీరమణి, సమ్మోహాత్ముఁడై రావణుం
డనిమేషత్వముఁబొంది, మైమఱచి, యుద్యత్కామలోలుండునై,
యునికిన్గానక యొప్పుచున్నచట, శంభూ! ఆంజనేయప్రభూ! 107

శివదీక్షాపరుఁడైన యోగియని, యాశీర్వాదమున్బొంద, రా
ఘువునిల్లాలటువచ్చి భక్తిమెయి భిక్షన్దెచ్చి యర్పించె, సం
స్తవమున్జేసి "నమశ్శివాయ"యని యాసన్యాసి లంకేశ్వరుం
డవలోకించి వచించె, నిట్టులపుడప్పా! ఆంజనేయప్రభూ! 108

**సీతా రావణ సంవాదము**

"వనితా! యెవ్వరిదానవీవు? భవదావాప్రకారము
వనమెట్లయ్యెను? నామమేమి? వరసౌందర్యాత్తతారుణ్యమున్
వనికర్పించుచు గాసిపొందుటలు సంభావ్యంబె? రాగంబుతో
వినఁగాజెప్పు"మటంచుఁబల్కె నతఁడాప్తి న్నాంజనేయప్రభూ! 109

వనవాసస్థితి పొందునందనుక సర్వస్వంబు విన్పించి జిం
కను వెన్నంటి రఘూత్తముండరుగుటల్, గష్టాప్తిమైనంత"ల
క్ష్మణ"యంచయ్యెడ నొక్కకేకవిని సంభావించి, సౌమిత్రి రా
మునికైబంపుటఁ దెల్పె, జోగికఁట, శంభూ! ఆంజనేయప్రభూ! 110

"మునిలోకోత్తమ! విశ్రమింపుఁడిఁక సమ్మోదంబుతో, మిమ్ము నె
మ్మనముప్పొంగఁగ సత్కరించును, మహాత్మా! సత్యశీలుండు ల
క్ష్మణుఁడుద్యద్గతి గొల్వ నావిభుఁడు రామస్వామియేతెంచి, యీ
క్షణమందొప్పఁగనంచు" సీతయనె వీఁకన్నాంజనేయప్రభూ! 111

"భవదీయంబగు వృత్తమంత ననుసంభావించి విన్పించి తీ
వు, విశేషస్థితినొప్పు నాతెరఁగు నంభోజాక్షి! యాలింపుమీ!,
భువనస్రష్ట పితామహుండగును, శంభుస్ఫూర్తి రాజిల్లు వి
శ్రవసోబ్రహ్మకు పుత్త్రుఁడౌదు"నని నీశా! ఆంజనేయప్రభూ! 112

"నవరత్నద్యుతిసారసంకలిత సౌందర్యప్రభాపూరమై,
భువనాతీతభయప్రకారయయి, యంభోరాశిమధ్యంబునన్
శివరూపాంకముతోడి లంక పురమై చెన్నొందు, దైత్యేశుడన్,
భవుడన్, రావణుడంచె"యుంగుమనె దేవా! ఆంజనేయప్రభూ! 113

"తనివారన్ నినుగూర్చివింటి మును, నీ తారుణ్యసౌందర్యమున్
గనినాఁడన్, మరుఁడేచె నన్నిపుడు, రాకాచంద్రబింబాననా!
వనిలోనన్ బడరానిపాట్లు వడ భావ్యంబౌనె? నీ బోటికిన్,
మనసారన్ననుగొమ్ము రమ్మ"నె మహాత్మా! ఆంజనేయప్రభూ! 114

"దశకంఠుండను నాదునామ మిల సంత్రాసంబుగల్గించు, నా
పశుపక్ష్యాదులు మానవేంద్రులును భావస్ఫూర్తి లేకుంద్రు దు
ర్దశమీరన్దలవంచి దిక్పతులు కర్తవ్యంబుగా గొల్వ నా
వశురాలిన్ నరుఁడెట్లుగాచు"నని దేవా! ఆంజనేయప్రభూ! 115

"తరుణీ! రామునికై ప్రయాసపడ, కుత్సాహంబుతో లంకలో
స్థిరరాజ్యోన్నత సంపదల్గనుము, వాసింగాంచి భోగింపుమీ!
పరువంబొప్పగ నన్నుగూడి, నినుకాపాండగ రానేర్తురే?
నరదేవేంద్రులునైన"నంచనె ప్రతిజ్ఞ న్నాంజనేయప్రభూ! 116

ఖలుడౌ రావణుమాటలెల్లవిని, దుఃఖంబొంది వైదేహి, "య
న్నళినాక్షున్ రఘురాముదక్క, మది నన్యద్రూపమేనెంతునే?
శలభంబగ్నిని చేరుటలన వినాశప్రాప్తికైగాదె! యో
తులువా! పొమ్మని"జెప్పె సీత బుధబంధూ! ఆంజనేయప్రభూ! 117

"పతిలేనప్పుడు జోగివేసమున నావాసస్థలిన్జొచ్చు దు
ర్మతి చోరుండగుగాక! శూరుఁడగునే! మారాడ కున్మాదివై,
యతిగావాగకపొమ్ము సత్వరము, నీవాయుస్సుఁగోల్పోక" యం
చతి రోషంబునఁబల్కెసీత యపుడప్పా! ఆంజనేయప్రభూ! 118

"మశకంబెక్కడ! హంసయేడ?యల సామ్యంబెన్నఁగావచ్చునే?
దశకంఠా! కనబ్రహ్మవంశ మధమస్థానాప్తిమైగ్రుంగ, దు
ర్దశపాల్జేయకపొమ్ము రావణ! మదాంధస్ఫూర్తి లేకుండ నో
పశువా!" యంచువచించె సీత యపుడప్పా! ఆంజనేయప్రభూ! 119

"ఘనకామాతురచిత్త శూర్పణఖ యత్యుగ్రవ్యాదజృంభించి, రా
మునికామించి మదోద్ధతిన్నెనఁగి, యాపూర్ణేర్ష్యతో, నామె నన్
గని బాధింపఁగ, నంత లక్ష్మణుఁడు వీఁకన్గోసె నద్దాని నా
సను కర్ణంబుల, గాంచవే!"యనె మహేశా! ఆంజనేయప్రభూ! 120

"ఖరునిన్జంపెను, దూషణాదులను ముక్కల్గాఁగఖండించె భా
సురశౌర్యంబున నా విభుండు, కను మిచ్చోనిన్నువీక్షించినన్
పరిమార్చున్గసితోడ, రావణ! యసద్భావంబుఁబోఁద్రోలి, స
త్వరవృత్తిన్ జను"మంచుసీతయనెనప్పా! ఆంజనేయప్రభూ! 121

**రావణుఁడు సీతను రథంబుపై నుంచుకొనిపోవుట**

అనుడున్ క్రోధముతోడగాంచి, దశకంఠాప్తిన్ బ్రదర్శించె, న
వ్వనితారత్నముఁజూడ రావణుఁడు, కంపంబొంది మూర్ఛిల్లె సం
జనితోద్గాఢ విషాదచిత్తయగుచున్ క్ష్మాపుత్రి, యాత్మేశు రా
మునినామంబును పల్వరించుచఁట శంభూ! ఆంజనేయప్రభూ! 122

కనిసీతాసతి నంత రావణుఁడు విక్రాంతప్రకారాప్తి ద
క్షిణ వామోద్ధత బాహులన్బొదివి, సంక్షేమంబుగానెత్తి స్యం
దన మందొప్పగ నుంచి, వాయుగతి సిద్ధస్ఫూర్తిమై వ్యోమవీ
ధిని సాగెన్ మలి సంధ్యవేళ, కడుదీప్తి న్నాంజనేయప్రభూ! 123

**సీతావిలాపము**

తెలివొందన్గని సీతయంతఁగడుచింతీభూతచేతస్కయై
విలపించెన్"నను రామపత్ని గనుఁడో! వేగాప్తి గొంపోయెడున్
బలవంతంబుగ రావణాసురుడు, దుర్భావంబుతోమింటిపై,
చెలిమిన్ గావుఁడ"టంచుదీనగతిఁ గాసి న్నాంజనేయప్రభూ! 124

"నరనాథా! రఘురామచంద్ర! ననుబంతంబొప్పఁగా రావణా
సురుఁడిచ్చో గొనిపోవుచుండెను, పశుస్ఫూర్తిన్ విడంబించుచున్,
వరశౌర్యంబున నన్ను నీసతిని సంభావించి కాపాడవే!
చెరమాన్పించి",యటంచునేడ్చె కడుగస్తి న్నాంజనేయప్రభూ! 125

"కనమో! లక్ష్మణ! నిన్ను నిష్ఠురగతిన్ గ్రవ్యాదమాయాప్తి నే
గనకుండన్, జగదేకవీరుడని యుత్కర్షంబుతో రామునిన్
మనమందెంచక, నాపతిన్గన నహంభావంబుతోఁబంపితిన్,
నను రక్షింపఁగరావా!"యంచనెను చింతన్నాంజనేయప్రభూ! 126

"నదులారా! గిరులార! రాఘవుసతిన్ నన్నీదశాస్యుండు దు
ర్మద చిత్తుండు బలాత్కరించి కొని సంరంభంబుతో సాగె, నీ
మదనోన్మాది వశంబు నుండి సదయాత్మన్మీరు రక్షించి, నా
హృదయావేదనఁబాపరో"యనె మహార్తి న్నాంజనేయప్రభూ! 127

"కనుఁడో! రావణుఁ డాదశాస్యుఁడిటు లుగ్రస్ఫూర్తి విన్వీధిలో
నను వైదేహిని రాముపత్నిఁ గడుపంతంబొప్పఁగాబఁట్టి లం
కనుజేర్పన్ గొనిపోవుచుండె, ఁబటువేగన్వచ్చి రక్షింపరే!
ఘనదిక్పాలకులార!"యంచనెను గాక న్నాంజనేయప్రభూ! 128

"స్థిరచిత్తంబునువీడి లక్ష్మణుఁడుగాసింజెంద నిందించి, దు
ష్కరమౌపాపముఁగట్టుకొంటి, నదియుగ్రంబౌచుగారించె, నా
కరయన్గావలెనిట్టి శిక్షయని" దుఃఖావేశముప్పొంగ న
ద్ధరణీపుత్రిక యేడ్చుచున్బలికె నంత, న్నాంజనేయప్రభూ! 129

**జటాయువుసీతను రక్షింప రావణునితో బోరుట**

"వినుమమ్మా! యిఁట నిన్నుగాచెదను, దీప్తిన్నేను దుర్మదు రా
వణుదర్పంబణగంగజేతు"నని శశ్వద్వృత్తి పక్షీంద్రుఁడ
ద్దనుజేంద్రాప్త శతాంగమున్గదిసి, సీతాదేవినోదార్చి, పెం
పున మిన్నంది జటాయువన్యనుఁడు, శంభూ! ఆంజనేయప్రభూ! 130

"ఓరీ రావణ! ధూర్తకార్యచతురా! యుగ్రప్రకామాప్తి ని
న్నారీరత్నము జానకీసతిని పంతంబొప్పగొంపోదువే!
జారా! సీతనువీడకున్న, నఖరస్ఫారోగ్రఘాతంబులన్
పారన్జేతును గాలునింటి"కనె నప్పా! ఆంజనేయప్రభూ! 131

కని యారావణుఁడుగ్రుడైయుఁట తిరస్కారప్రకారాప్తిమై
జనుచుండంగ, జటాయువ చ్చదల విస్తారోగ్రపక్షంబులన్
పెనురీతిన్విదలించి, యడ్డముగ నాపెన్ నింగిపైనేగుటల్,
వనవీధిన్ దిగివచ్చె దానవుడు దేవా! ఆంజనేయప్రభూ! 132

పవిఘాతాభములైన చంచునఖరస్ఫారోగ్రఘాతంబులన్
రవితేజుండు జటాయువుగ్రగతి నాక్రవ్యాదు బాధించె దా
నవ రాజేంద్రుడు రావణుండెగసి పెన్నారాచయోగంబులన్
ధ్రువరీతిన్ఖగరాజుపైఁ బరపె, బంధూ! ఆంజనేయప్రభూ! 133

విషనారాచములెల్ల, చంచునఖరస్ఫీతప్రహారంబులన్
దిసలెల్లన్ బడిపోయె ముక్కలుగ, నుద్దీప్తోగ్రుఁడై దైత్యుఁడ
ప్పసమీరంగ జటాయువున్గదియుచున్ "పక్షీ! కుఠారంబుతో
నసువుల్దీసెద"నంచు పైకురికె, దేవా! ఆంజనేయప్రభూ! 134

అజుఁడొప్పన్ మునుపిచ్చినట్టి వర, మత్యంతంబుగానెంచి యా
రజనీకాంతుఁడుచూడ రావణుండు సంరంభంబుతోరేగి, యా
ద్విజనాథోత్తముచంచువున్ పదములన్ భేదించె నొక్కుమ్మడిన్,
భుజరాజిన్గడునొత్తి, సీతకన, శంభూ! ఆంజనేయప్రభూ! 135

## జటాయువు మరణము

ధీరాగ్రేసరమూర్తి పక్షివిభు ఁడార్తిన్గూలె భూమీస్థలిన్,
హారామా! యనుచున్ మహాచలవిడంబాకార సంస్ఫూర్తిమై,
పారావారముఁ జేరనేగుఁతరిఁ, గంపంబొంది భూషావళిన్
దారిన్వైచెను జానకీసతి మహాత్మా! యాంజనేయప్రభూ! 136

"ననుగొంపోవుట యెట్లెరుంగు? నిఁక నానాథుండరణ్యంబులో
కనరానంతఁగదూరమయ్యె, మదికాకన్జెందుచున్ రామునిన్
కనఁగానేగిన లక్ష్మణుండెటుల నాగస్తిన్ సమీక్షించు,"నం
చనిశోకించుచునార్చె సీతయపు డీశా! ఆంజనేయప్రభూ! 138

చెరలోబెట్టఁగ రావణసురుఁడు గాసిన్బెట్టి గొంపోవుటల్
హృదయేశుండు రఘూత్తముండెరుఁగ, నార్తిన్గాంచ సౌమిత్రి, నా
పదరీతిన్ జనులెల్లన్ కన్గొనఁగ, నావైదేహి భూషావళిన్
పథమందొప్పగ వైచె నేలపయి, దేవా! ఆంజనేయప్రభూ! 137

వినువీధిన్ వ్యథతోడనేగునపు, డావేగంబుతో సొమ్ములన్
తనకౌశేయపుఁగొంగులోనునిచి, యత్యంతార్తి మైనేసె నా
ఘనశైలోన్నతశృంగముల్దనర, సంకల్పంబుఁదెల్పంగ, రా
మునియర్ధాంగి కపీంద్రులున్గనఁగ, శంభూ! ఆంజనేయప్రభూ! 139

గిరిశృంగంబుల మీఁదఁబడ్డ పటమున్, గీల్కొన భూషావళిన్
సురకాంతల్పడవైచిరంచు, మదిలో సుగ్రీవుఁడుద్వేగుఁడై
వరభూషాదులదాచఁబంచె కడుసంభావించి వీక్షించి, భా
స్కరదీప్తిన్ వెదజల్లు వానిని, మహేశా! ఆంజనేయప్రభూ! 140

## రావణుఁడు సీతను లంకలో నుంచుట

తనకున్మిత్తినిబోలు సీతఁగొని, సంద్రంబొప్పఁగాదాటి రా
వణుఁడచ్చోఁగనె లంక నాత్మపురి, నా వైదేహి నచ్చోట దిం
చెను నెయ్యంబున చిత్రరీతి దనుజస్త్రీలెల్ల వీక్షింప, నం
గననున్గొల్వఁగఁబంచె నంత త్రిజటాఖ్య న్నాంజనేయప్రభూ! 141

రణవిక్రాంతుల ఘోరరాక్షసుల, నాక్రవ్యాదనాథుండు త
క్షణమంపెన్ మసిజేయగా మునిజనస్థానంబు సర్వస్వమున్,
ఘనశౌర్యంబున రామలక్ష్మణుల వీఁకన్గూల్చి, కాంతారమున్
దనుజవ్రాతముతోడ జేయుటకు, నంతన్నాంజనేయప్రభూ! 142

కృతకృత్యుండగు రావణాసురుఁడు, నారీరత్నమున్ జానకిన్
మతినూహించుచు, సంబరంబెసఁగ, కామప్రాభవోపేతుఁడై
యతిమోహంబునవచ్చె, నశ్రుగతులాసారంబుఁగనేడ్చుచున్
పతిలో నెంచుచు నుండె, సీతయపుడప్పా!, ఆంజనేయప్రభూ! 143

శునకంబుల్ దరిఁజేరి కాపెసఁగ నస్తోకంబుఁగాఁగొల్వ కా
ననమధ్యంబున లేడి భంగి, ఁబటుచింతాభీతచేతస్కయై
కనులందశ్రువులొల్కుచుండ, మహాక్రవ్యాదమధ్యంబునన్
వినమచ్ఛిర్షఁగ నుండె సీత పరమాప్తిన్నాంజనేయప్రభూ! 144

**త్రిజటాది రాక్షసాంగనలు సీతను సేవించుట**

ఘనరత్నాభరణంబులన్, ప్రవిలసత్కౌశేయముల్, నూత్నవా
సనలన్ జిమ్మెడుమేనిపూతల బ్రశస్తంబైన పానీయముల్,
మనమాహ్లాదమునొందు భక్ష్యముల క్రమంబొప్ప క్ష్మాపుత్రికై
కన దైత్యాంగనలంతదెచ్చిరఁట వీఁకన్నాంజనేయప్రభూ! 145

వరభూషాదులపై మనంబిడక, సంభావింపకచ్చోట భీ
కరదైత్యాంగనలొప్పబల్కుటను, దుఃఖస్ఫూర్తిమైఁగ్రుంగి, య
ద్ధరణీపుత్రిక రావణాసురుని సంత్రాసంబుతో గాంచుచున్
స్మరియించెన్ రఘువీరునయ్యెడల నీశా! ఆంజనేయప్రభూ! 146

**వ్యామోహంబున రావణుఁడు సీతతో భాషించుట**

వ్యతిరిక్తంబగు జానకీగత మనోభావంబునూహించి, దు
ర్మతి లంకేశ్వరుఁ డామెతోడ "పడతీ! రాముండు రాబోఁడు, నీ
మతి భావింపుము, యౌవ్వనోల్లసిత కామంబంతఁజల్లారునే?
పతికైచూడక నన్నుగొమ్మ"నెను దేవా! ఆంజనేయప్రభూ! 147

"కనుమా! పద్మసరోవరంబుల, సమాకర్షించువృక్షంబులన్,
ఘనమౌకతసీమలన్ సుఖమయాక్రాంతాప్తసౌధంబులన్
జని యచ్చోట సుఖింతమొప్పఁగ ఁబ్రశస్తంబైనకామేచ్ఛల"
న్నని లంకేశుఁడుబల్కె సీతఁగని యంతన్నాంజనేయప్రభూ! 148

"అల నీరాముఁడు గీముడున్ గనఁడు, కామానంద సారంబులన్
విలసద్భూర్తుల జుట్టుకొందమిఁక దీప్తింజెందఁగా, జానకీ!
విలపింపన్దగునే! సమక్షమున, నుద్వేగంబుఁ బోఁద్రోలి నీ
వలపుల్నింపు"మటంచు దైత్యుఁడనె నప్పా! ఆంజనేయప్రభూ! 149

## సీత రావణుని ఛీత్కరించుట

అనుడున్ గన్నులనిప్పులూర, నధరంబల్లాడ, నుగ్రాకృతిన్
తృణమడ్డంబుగవైచి సీత మన ముద్రేకింప, "కామాంధ! రా
వణ! నీకాయువు మూడె, నీదయిన దర్పస్ఫూర్తి భగ్నంబుగా
ఘనరామాగ్నికి బుగ్గియౌదు"వనె శంభూ! ఆంజనేయప్రభూ! 150

"కనవైధవ్యముతోడలంక సిరిపోఁగా, శోకచిత్తంబునన్
దినమున్గ్రుంగఁగఁజేయు రాముఁడిఁక, సందేహంబు లేదింక త
ద్దినముల్ పెట్టెడువారులేక పురినిస్తేజంబుతోనేడ్వఁగా
కనుమోరీ"!యని పల్కె సీత మదికాక న్నాంజనేయప్రభూ! 151

"అలబ్రహ్మాన్వయమందు పుట్టితివి సద్యాగప్రకారోన్నతి
న్నిలసేవింపక, కామదర్పగతులన్ నీచా! పరస్త్రీలు వి
హ్వాలతన్బొందఁగ, పట్టితెచ్చుటలు సంభావ్యంబె? నీకెన్న నీ
లలనల్మెత్తురె? చూడుమంచ'నెను మ్రోల న్నాంజనేయప్రభూ! 152

తనశౌర్యంబు గణింపకుండ, హితబోధన్జేసి పొమ్మన్న సీ
తను వీక్షించి దశాస్యుఁడంత నిజపంతంబొప్పఁగాఁజెప్పె" నీ
ఘనులంకేశుని శక్తిసంపదల నాకైలాసనాథుండె! మె
చ్చెను, కాంతా! నరులెంతవారలనె"వాసిన్నాంజనేయప్రభూ! 153

"అరినిర్భేదనధుర్యుఁడౌ సకల శస్త్రాస్త్రప్రభాసారుడౌ
స్థిరమాయానిధియౌ దశాస్య, విలసత్తేజోల్లసన్మూర్తియై
స్ఫురదంభోనిధి మధ్యమందెసగుచున్ బొల్పొందు లంకాపురిన్
నరుడౌ రామునికౌనె? చేర"ననెనంత న్నాంజనేయప్రభూ! 154

**రావణుఁడు సీతకు సంవత్సరము గడువునిచ్చుట**

"అయినన్ ద్వాదశమాసముల్ గడువు నోయంభోజప్రత్రేక్షణా!
దయతోనిత్తు, ననంతరంబయిన చిత్తంబొప్పఁగామించి నన్
బ్రియమారన్గని చేరకున్న, దనుజస్త్రీలంతఖండించి ని
ర్దయతోమెక్కెదరం"చుఁదెల్పెనఁట శాస్త్రా! ఆంజనేయప్రభూ! 155

అటులన్జెప్పి, దశాస్యుడంత త్రిజటాఖ్యన్బిల్చి "యీ జానకి
న్నెటులైనన్ నను గోరునట్లుగ లసత్ప్రీతిన్బ్రయత్నించి ము
చ్చట నాప్యాయముతో నశోకవని నాశ్వాసిల్లఁగా నుంచు"మం
చఁట గోప్యంబుఁగ నానతిచ్చెను మహేశా! ఆంజనేయప్రభూ! 156

దనుజస్త్రీ పరివేష్ఠయౌ త్రిజట, యత్యంతప్రమోదంబుతో
గని వైదేహి నశోకనామవనిలోఁ గ్రమంబుఁగానొప్పి, నె
మ్మనముప్పొంగఁగఁ జేయు వృక్షమును సంభావించి", తచ్ఛాయలో
నునిచెన్ రాక్షసనాథునాజ్ఞమెయి శంభూ! ఆంజనేయప్రభూ! 157

**రాముఁడు మారీచుని సంహరించి పంచవటికేగుట**

మనమందెన్నఁగ రామలక్ష్మణుల సంభావించి చింతించుచున్
జనకక్ష్మాప్రజ లంకనుండె, విలసత్కాంతిన్ రఘూత్తంసుఁడ
య్యినలోకేశుఁడు, మట్టుబెట్టి పటుమారీచాసురున్ నీచునిన్,
గనవచ్చెన్ జనకాత్మజన్, తలఁపులీగన్నాంజనేయప్రభూ! 158

"అలమారీచుని శాంబరీస్వరము, నాదౌకంఠరావంబుఁగా
కలతన్జెందుచు, నన్నుఁగావ నఁట లక్ష్మయ్యన్దగన్బంపెనో?
తెలియన్వచ్చెనా? తమ్ముడొంటిమెయి, వైదేహిన్విడన్బుచ్చి నా
చెలియేమయ్యెనా?"యంచునెంచె విభుఁడీస్సీ! ఆంజనేయప్రభూ! 159

## రామునికి లక్ష్మణుఁడెదురుగా వచ్చుట

ఎదురైవచ్చిన లక్ష్మణున్‌గని మనంబేంతేని శంకింపఁగా
"పదిలంబే? వనిలోన సీతయుని కప్పా! దుర్నీతితో దానవుల్
ముదితంగైకొని పోయిరో?" యనుచు రాముండంతఁ బ్రశ్నించె నె
మ్మది నారాటమెసంగఁగానఁట మహాత్మా! ఆంజనేయప్రభూ! 160

"అటవిన్ సీతకు కాపుఁగా నునుచి యప్పా! నిన్ను, సారంగమున్
బటువేగంబునఁ బట్టవచ్చితిని, నావైదేహినట్లొంటి మై
cగటురీతిన్‌దిగఁబుచ్చి వచ్చితివి వక్కాణింపుమీ! కారణం
బిఁట నాక"ంచని కోరె రామవిభుఁడెంతే న్నాంజనేయప్రభూ! 161

"అలప్రాణేశ్వరి సీతఁబాసి, యిఁకసాధ్యంబౌనె? జీవింపఁగా
తలపన్‌బ్రాణములన్ త్యజించుటయ భద్రంబౌనునాకింక, వి
హ్వాలచిత్తంబున కుందుచున్ బ్రదుకుటల్ వ్యర్థంబుగాకున్నె!" యం
చలసౌమిత్రిని గాంచి రాముఁడనె దేవా! ఆంజనేయప్రభూ! 162

"నన్నుమన్నించి వినంగనొప్పు నఁట స్వర్ణస్ఫారసారంగమున్
గని, వైదేహియభీష్టమున్‌దెలుప, వేగంబొప్పమీరేగఁగా
వినిపించెన్నఁట "లక్ష్మణా" యనెడి వ్యాప్తిన్‌జెందునార్తస్వరం
బెనయన్ భీతిలె"నంచుఁదెల్పె పతికెంతేన్నాంజనేయప్రభూ! 163

"విని భీతిల్లుచు నన్నుగాంచి కడునావేగంబుతో "లక్ష్మణా!
యని, మీయన్న విపత్తులోఁబడి, సహాయంబిట్టులర్థించె, త
క్షణా మచ్చోటికి నేగు"మంచనుచు, నాజ్ఞాపించెఁగష్టాత్మయై,
'జనకక్ష్మాపజయాజ్ఞ' వచ్చి"తనె శాస్తా! ఆంజనేయప్రభూ! 164

కన దుఃఖంబున జానకిన్గని, మహాక్రవ్యాదులేగాదు మా
ర్గాన ముల్లోకములొక్కటై యెదుర నారూఢిప్రకారాప్తి వ
చ్చిన, మాయన్ననుగెల్వనోపరని నీక్షేమస్థితిన్దెల్పినన్,
వినకుండె"న్నని చెప్పె లక్ష్మణుఁడు దీప్తి న్నాంజనేయప్రభూ! 165

**లక్ష్మణుఁడు సీతను విడిచివచ్చుటకు రాముఁడు చింతించుట**

విని సౌమిత్రి మనోగతంబు "క్షితిజావేశంబుతోఁబల్కినన్
విననట్లుండక నీవురాఁదగునె? భావిన్జూడకాసీత ని
వ్వనమందొంటిగపుచ్చివచ్చితివె"యని భావ్యంబె! విలోకింపుమీ!
యని బాధన్ వివరించె రాముఁడఁట దేవా! ఆంజనేయప్రభూ! 166

తతవేగాతురచిత్తులై మునిజనస్థానంబునందున్న సం
గతశీలన్ జనకాత్మజన్ గనఁగ, విక్రాంతాత్ములైసాగి రం
చితరీతిన్ రఘురామలక్ష్మణులు, గాసింబెట్టు రాకాసులన్
ప్రతిలేకుండగ మట్టుబెట్టుచు శివప్పా! ఆంజనేయప్రభూ! 167

చనుచున్నట్టి పథంబులోగనెడు దుష్టంబౌనిమిత్తంబులన్
మనమందెన్నుచు రాఘవుండనుజు సంభావించి, "సౌమిత్రి! ల
క్ష్మణ! యేమైనదొ? జానకీసతికి - రాకాసుల్ మదోన్మత్తులై
వనినేకీడును గూర్చిరో?"యనెను దేవా! ఆంజనేయప్రభూ! 168

కనరాదయ్యెను సీతపంచవటిలోఁ గన్విందుగా!, దీపకాం
తినిఁగోల్పోయిన పర్ణశాలగతి, నిస్తేజంపుభావాప్తి నె
మ్మనమారాటముఁ జెందగాఁ, గుములుచున్ మాన్యాత్ములాసోదరుల్
వనితాన్వేషణచిత్తులౌచుఁ జనిరప్పా! ఆంజనేయప్రభూ! 169

అలవైదేహి చరించుతావులను, భవ్యస్ఫారకూటంబులన్
కలయన్జూచిరి రామలక్ష్మణులు, కాకన్జెందు డెందంబుతో
మలయన్గాంచిరి యాశ్రమంబులను, సంభావించి ప్రశ్నించి ర
క్కలనున్ సాగుమునీంద్ర పత్నులను, కనంగా నాంజనేయప్రభూ! 170

అలగంగానది తీరసంగతుల, నయ్యాశైల దుర్గంబులన్,
కలయన్జూచిరి రామలక్ష్మణులు, దుఃఖస్ఫారచిత్తంబులన్
బిలముల్గహ్వరనిర్ఝరీతతుల నుద్వేగాప్తి శోధించి, మై
థిలి చొప్పున్గనలేక యేడ్చిరఁట, నార్తిన్నాంజనేయప్రభూ! 171

"కనుమీ! జానకి! వచ్చినారమిఁట! వక్కాణింపుమీ! నీస్థితిన్
వినుమీ! పైడిమృగంబుదెచ్చితిమి దీప్తిన్దాని భేదించి, నీ
మనముప్పొంగఁగ రమ్మ, దానిగని సంభావింపుమీ"యంచు నా
వనమందార్చిరి రామలక్ష్మణులు దేవా! ఆంజనేయప్రభూ! 172

ధరమౌర్వీరహితంబుగా వరలు కోదండంబుగానయ్యె! బం
ధుర దుఃఖంబున నిస్సహాయగతి సంతోషంబుగోల్పోయి భూ
వరుఁడా రాముఁడు జానకీరహితుఁడై, భారార్ద్ర చిత్తంబుతో
వరసౌమిత్రిగమింపఁగా నఁట శివప్పా! ఆంజనేయప్రభూ! 173

"తను రక్షించెడివారులేరనుచు, సంత్రాసంబుతోఁ బారుచో
వనసీమన్ గడునుగ్రతన్మసలుచున్ భక్షించెనోబెబ్బులుల్
కనఁగానెచ్చట కానరాదు, సతిదుఃఖస్ఫూరినెందున్నదో?"
యనిశోకించుచు సాగె రామవిభుఁడప్పా! ఆంజనేయప్రభూ! 174

"ఘనశోకార్తిని నొంటిమైనడలు, నాకంజాక్షిఁగొంపోయిరో!
కని క్రవ్యాదులు, పొట్టఁబెట్టుకొనిరో!, గాన్పింపదే! సీత యీ
వనమందెచ్చటనున్నదో! కుములుచున్ వాపోవుచున్ తమ్ముఁడా"!
యని దుఃఖించుచునేగె రాముఁడఁట దేవా! ఆంజనేయప్రభూ! 175

తన ప్రాణేశ్వరి నెందుఁగానక జనస్థానాంక, దేశంబునన్
తనువున్దూలఁగ నేడ్వసాగె పటుసంతాపంబు నుప్పొంగ, నె
మ్మన మందాశనువీడి రాఘవుఁడు, కంపంబొందు కంఠధ్వనిన్
కనియోదార్పఁగ లక్ష్మణుండపుడు కాకన్నాంజనేయప్రభూ! 176

"అన్నా! తత్త్వమెఱింగినట్టి యతులప్రాజ్ఞుండ వీవెంచఁగా,
ఖిన్నాత్మన్ దపియింపఁగాఁదగునె? యీఖేదంబుమోదంబులున్
పన్నాగంబున వచ్చిపోవుటలు సంపన్నాత్మ! వీక్షింపవే!
కన్నీరుంచఁగనేల?"నంచనెను కాక న్నాంజనేయప్రభూ! 177

"భువనంబుల్ వెలిగించు భాస్కరుని సంపూర్ణోల్లసత్తేజమున్
దివమందొప్పఁగనీక కమ్ముకొని, బాధింపంగ నారాహువున్,
నవచైతన్యముతోడ మించి, విశ్వజనులానందింపఁగానొంచు, ప్రా
భవు నాదిత్యుని గాంచమం"చనెను దేవా! ఆంజనేయప్రభూ! 178

"మనమెట్లైనను జానకిన్వెదకి, క్షేమంబొప్ప రక్షించి, దు
ష్టుని సీతాపహరున్వధింతమిఁక నిచ్చోఁగాంచుమీ! "యంచు ల
క్ష్మణుఁడోదార్చెను రామచంద్రునఁట సంభావించి సేవించుచున్,
ఘనశోకాగ్ని శమింపగానపుడు, కాకన్నాంజనేయప్రభూ! 179

చిరుహాసంబు దృగంబు పూరమును విచ్ఛేదించి వెల్గొంద బం
ధురవాత్సల్యముతోడ గాంచెఁగడు నుద్యోతించు చిత్తంబుతో
వరణీయుండగు రామచంద్రుఁడఁట సేవాతత్పరున్ సోదరున్
కరణీయంబగు కార్యమెంచుచు కనంగా న్నాంజనేయప్రభూ! 180

**జటాయువు సీతాదేవి వృత్తాంతమును దెల్పుట**

క్షితిజాన్వేషణ సంగతిన్మసలుచున్, జీర్ణచ్ఛదానీకుఁడై
క్షితిపై మూల్గుచుఁ గూలియున్న యొక పక్షిస్వామినిన్గాంచె, నా
క్షితినాథేంద్రుకుమారుడయ్యెడల, సంశ్లిష్టాంగు నిష్టాత్మునిన్
వెతతోడన్ నిజసోదరుండుగన దీప్తి, న్నాంజనేయప్రభూ! 181

"అలవైదేహిని పొట్టఁబెట్టుకొని క్రవ్యాదుండు పక్షీంద్రుఁడై
తలపింపన్బడియుండెనంచు, మదిభ్రాంతస్ఫూర్తిమైనెంచి, ము
క్కలుగా వీనిశరీరమున్గనఁగ నేఖడింతు నిచ్చోట, సం
ధిలమోదం"బని లక్ష్మణుండనెను దీప్తి న్నాంజనేయప్రభూ! 182

అని ఖండింపఁగనెత్తె ఖడ్గమును శౌర్యస్ఫూర్తి సౌమిత్రి పా
వనుఁడచ్చోఖగరాజుపల్కె కడుసంభావించి "శ్రీరామ! మీ
జనకుండొప్పఁగ నాకు నెచ్చెలి, మహాస్వాంతుండు, శ్రేయోభిలా
షిని మీకౌదు, జటాయువందు"రనె గస్తి న్నాంజనేయప్రభూ! 183

"బలవంతబుఁగ జానకీసతిని దుర్భావుండులంకేశ్వరుం
డల గొంపోవుచునుండ నడ్డుకొని, కయ్యంబొప్పగావించి, యా
ఖలువిల్లంబులఁ, దేరు, గుఱ్ఱముల నేఖడింప, నాదైన ఱె
క్కల ఛేదించె నతండ"టంచనెను గాకన్నాంజనేయప్రభూ! 184

కనిపక్షీంద్రుని ధర్మతత్పరత నుత్కర్షంబుగానెంచి, వం
దనమొప్పన్దగఁజేసి, రాముఁడు "మహాత్మా" మీ సహాయోన్నతిన్
కొనియాడన్ వశమే! శుభంబెపుడు చేకూర్పంగ నారాయణున్
మనసారన్స్తుతి యింతు"నంచనెను ప్రేమ న్నాంజనేయప్రభూ! 185

నలినాక్షున్ రఘురామచంద్రుగని "యన్నా! రావణుండంత నీ
చెలి రోదించుచునుండ, దక్షిణ దిశాశీర్షప్రదేశంబుగాఁ
గలయన్గాంచుచు, సాగిపోయె"నని, సాకల్యంబుగాఁజెప్పుచున్
పొలిసెన్ జూడ జటాయువయ్యెడల, శంభూ! ఆంజనేయప్రభూ! 186

అనఘాత్ముండు జటాయువయ్యెడల నత్యంతార్తిమైఁ గూలఁగా
కనిశోకించుచు రాఘవుండపుడు "సాకల్యంబుగా స్నేహితుం
డను శబ్దంబిఁట సార్థకంబు, కనుమప్పా! నీవె యాదర్శమై
జనులస్వాంతములందు నిల్తు"వనె శాస్తా! ఆంజనేయప్రభూ! 187

పలురీతుల్ ఖగరాజు శౌర్యమును సంభావించి కాష్ఠంబులన్
కలయన్బేర్పఁగ లక్ష్మణుండచటఁ, గాకన్ రాఘవుండంత సం
చలితుండై, కడుదీక్షతో దహన సంస్కారంబుగావించి, యం
జలితోడన్ గడసారి వీడ్కొలిపె నీశా! ఆంజనేయప్రభూ! 188

సరిలేనట్లుగ రాఘవుండు ఖగరాజస్వామికిన్జేసె, ను
త్తరకర్మక్రియలంత శాస్త్రగతి, శాంతప్రాభవస్ఫూర్తిమై
పరలోకోన్నత సంస్థితిన్గలుగ సంభావించి యర్పించె న
త్తరి ధర్మోదకపిండముల్దనర,0 శాస్తా! ఆంజనేయప్రభూ! 189

అరుణుండప్పుడు పశ్చిమాద్రివెనుక న్నంభోనిధిన్ గ్రుంకె, న
త్తరి యేతెంచి, కుటీరమున్‌గదిసి, సంతాపంబుతోఁ గ్రమ్మరన్
శరచాపంబుల దాల్చి సాగిరట, నాశాస్ఫూర్తి సీతాస్థతి
న్నరయంగా రఘురామలక్ష్మణులు, దేవా! ఆంజనేయప్రభూ! 190

## రామలక్ష్మణులు కబంధుని గాంచుట

చనుచున్‌గాంచిరి రామలక్ష్మణులు, దోషస్ఫారదేహాచలున్,
ఘనదీర్ఘాయుత బాహుయుగ్మకలితున్, గర్వాంధనిర్మగ్నునిన్,
కనదాభీలమయాగ్ని నేత్రయుగళున్, కాలోగ్ర వక్త్రోజ్జ్వలున్,
ఘనసంకాశు కబంధ రాక్షసుని, ధాకన్నాంజనేయప్రభూ! 191

అంట జంఘారహితోగ్రకాయుఁడగు క్రవ్యాదుండు గర్వాంధుఁడై
పటుచాపాయుధులొచు వచ్చితిరి, బోవన్‌శక్యమే! మీకు నా
కటు దీర్ఘాయుత బాహులన్ నలగి, యుగ్రస్ఫూర్తిమైఁజాఁక, య
న్నిట లాక్షుండును కాచునే!"యనెను భ్రాంతిన్నాంజనేయప్రభూ! 192

అని దీర్ఘాయుత బాహులన్ బఱచి, క్రవ్యాదుండు బంధింప, రా
ముని వీక్షించి "నిరాయుధుండితఁడు బాముల్‌బెట్ట రాదంచు, నీ
మనమందెంచక, మట్టుబెట్టు"మని శుంభత్ఖడ్గమచ్చో నొసం
గెను సౌమిత్రి, వధించె రాముఁడఁట, శక్తి న్నాంజనేయప్రభూ! 193

కరయుగ్మంబఁట ముక్కలైపడఁగ, నాక్రందించుచున్ దైత్యుఁడు
ర్వరపైగూలెను రక్తసారమటు దుర్వారప్రకారంబుఁగా,
త్వరతోడన్ దనుజుండులేచి కడుసంభావించి "మీరెవ్వరో
యెరుఁగన్‌జెప్పుడ"టంచు కోరెనఁట శూలీ! ఆంజనేయప్రభూ! 194

"ఇతఁడే రాముఁడు, నేను లక్ష్మణుఁడ, రాజేంద్రాజ్ఞమై జానకీ
సతితోగూడి యరణ్యవాసమున కీసత్యాత్ముఁడేతెంచె, ని
ష్ప్రతి రామేశుఁడు రాక్షసాపహృతయౌ భార్యార్తి వేధింప, నీ
గతి వచ్చెన్నని" చెప్పె లక్ష్మణుఁడు వేగన్నాంజనేయప్రభూ! 195

## శాపవిముక్తుఁడై కబంధుఁడు స్వీయవృత్తమును దెల్పుట

అని చెప్పంగ కబంధుఁడప్పుడు, సముద్యన్మోదచిత్తంబుతో
"ఘనలారా! నశియించె శాపగతి, కాకన్దీరెనా"కంచు దా
వినిపించెన్ నిజపూర్వగాథ కడుదీప్తిన్ జెందునాగ్న్యైఖరిన్,
దనమేనిన్దహియింపఁగోరెనతఁడంతన్నాంజనేయప్రభూ! 196

"దను"వాఖ్యన్ విలసిల్లుచున్ మునుపు, మత్తస్ఫూర్తి జృంభించి, స
న్మునులన్సాధుల బాధపెట్ట నటసంభూతోగ్రకోపంబుతో
గని యచ్చో ముని "స్థూలశీర్ష"చటలోక్తంబైనశాపంబు, త
త్తను దాహంబున రూపుమాసె"నని శాస్తా! ఆంజనేయప్రభూ! 197

అఁట దివ్యాకృతితో కబంధుఁడపుడుద్యద్దీప్తిబెంపొంది చెం
గటకేతెంచి "రఘూత్తమా! వినుము లంకాపట్టణాధీశుఁడు
ధృటరీతిన్గొనిపోయెజానకిని, శుంభద్యోగి వేషంబునన్
పటుమాయావిధి"నంచుఁ జెప్పెను శివప్రా! ఆంజనేయప్రభూ! 198

## కబంధుఁడు సుగ్రీవునితో మైత్రిజేయుమని రామునకుఁ దెల్పుట

"అతిమాయాబల శౌర్యసంయుతుని, క్రవ్యాదేశు, లంకాపతిన్
ప్రతివీరుండొకఁడెన్న మార్కొనుట, సంప్రాప్తంబుగాఁబోదు, స
మ్మతితోమీరలు ఋష్యమూకగిరిసీమన్నేలు సుగ్రీవుతో
మతి విస్ఫూర్తిని మైత్రి చేయుఁ"డనె ప్రేమన్నాంజనేయప్రభూ! 199

"అలసుగ్రీవుని పోనడంచె ఘనరాజ్యభ్రష్టు గావించి, సం
ధిలు దర్పంబున వాలి, మంత్రియుతుడై ధీమంతుఁడారాజు బా
ధలతో శైలగుహాళిలో దిరిగెడున్, ధర్మోన్నతిన్బ్రోచి, వా
రలమైత్రిన్గొనుఁ"డంచుఁజెప్పెనఁట ధీరా! ఆంజనేయప్రభూ! 200

"కనగావానరవీరులెల్లఁగడుసముత్కర్షప్రకర్షంబుతో
జని, వైదేహినిగాంచితెత్తురు, మనశ్శాంతిప్రకారాప్తిమై
జననాథా! విలసిల్లజేసెదరు విశ్వాసంబుతోనిన్ను, స
జ్జనమైత్రిన్శుభమొప్పున"ంచనె శాస్త్రా! ఆంజనేయప్రభూ! 201

నవచైతన్యముతో కబంధుఁడు మహానందప్రకారాప్తి, రా
ఘవునాశీస్సుల ఁబొంది యేగెను, నవార్కస్ఫూర్తిమై నొప్పుచున్
దివమున్జేరఁగ, రామలక్ష్మణులు ప్రాగ్దిగ్సీమలన్గాంచుచున్,
ధ్రువసంకల్పముతోడ సాగిరఁట బంధూ! ఆంజనేయప్రభూ! 202

**రామలక్ష్మణులు శబరిని గాంచుట**

కృతసంకల్పముతోడసాగి, పరమప్రీతి ప్రసారోన్నతిన్
మతికాహ్లాదముఁగూర్చు, చిత్రవన శుంభస్ఫూర్తిమైనొప్పు, వి
స్తృతపంపాతటినంత గాంచిరి ప్రశాంతిప్రాభవోల్లాసమున్,
తతరీతిన్ రఘురామలక్ష్మణులు, శాస్త్రా! ఆంజనేయప్రభూ! 203

కనిరాపశ్చిమతీరమందు, పరమోత్కర్షప్రకర్షోన్నతిన్
కనువిందైతనరారు భక్తశబరీక్రాంతప్రదేశంబు, చ
య్యనచేతెంచి సుమాంజలిప్రభల భవ్యస్ఫూర్తిగ్సేయు యో
గిని వీక్షించిరి, రామలక్ష్మణులు, సక్తి, న్నాంజనేయప్రభూ! 204

"పరమప్రీతికరంబుగాఁ గనుచు భాస్వత్తేజులారాఘవుల్
కరమొప్పన్ "శబరీ! భవత్తపము విఘ్నంబులేకుండ వర్తించునే?
స్థిరవృత్తిన్‌గొనసాగుచున్నవే! ప్రశాంతస్ఫూర్తి నాచారముల్
వరయోగంబున నంచువారడిగి రప్పా! ఆంజనేయప్రభూ! 205

"మునివృత్తిన్ నిరతంబు భద్రముగ, సంపూర్ణాత్మ సేవించుచున్
ఘనులారా! మనుచున్నవారమిఁట, వీకన్‌ధ్యానయోగంబులన్,
వనిలోఁక్రూరమృగాళి శాంతగుణ విస్ఫారంబులైయొప్పె, పా
వనమయ్యెన్ వనమెల్ల నంచ'నెను దేవా! ఆంజనేయప్రభూ! 206

"కలకాలంబుగ మిమ్ము గాంచనిట నుత్కంఠంబుతోనుంటి, సం
ధిలెమోదంబు మహాత్ములార! కడు సందీపించెనాచిత్తమున్
విలసద్రీతిగ పూజ్యులార!" యని యావేగప్రసన్నాత్మయై
తలపుల్‌మీరవచించె నాశబరి శాస్త్రా! ఆంజనేయప్రభూ! 207

"వలనొప్పన్‌మిముగంటి తృప్తగతి దివ్యస్ఫారతేజంబులన్
కలయన్‌గాంచితి, ధన్యనైతి, కడు వీఁకన్ మీకు రుచ్యంబులౌ
ఫలపానీయములొప్పదెచ్చితిని, నాభక్తి ప్రపూర్ణాత్మ సం
ధిల యందుంచితిఁ, గైకొనుం"డనె మహాప్తి న్నాంజనేయప్రభూ! 208

పరిపక్వంబగు సత్ఫలంబుల తతిన్ భక్షింపఁగానిచ్చె శ్రీ
హరి సంకాశుని రామచంద్రుఁగని యత్యంతప్రసన్నాత్మయై
వరసంకల్పముతోడ నాశబరి, శుంభద్రీతిమై రాఘవుల్
పరమానందముతోడ గైకొనిరి దేవా! ఆంజనేయప్రభూ! 209

"దనుపుత్త్రుండు భవత్ప్రభావమును మోదంబొప్పగాజెప్పె నో
యనఘ! కంటి కృతార్థనైతిని, మతంగాఖ్యన్ విరాజిల్లు నీ
వనమందెల్ల ఫలాళి పుష్పతతి శుంభద్దీప్తగంధంబులన్
ఘనరీతిన్ కలకాలమొప్ప"నని వీఁకన్నాంజనేయప్రభూ! 210

వనమాహాత్మ్యము సంయమీంద్రమహిమన్ వర్ణించి, యాతిథ్యమున్
మనసారన్‌దగజేసి, రాఘవుల సంభావించి, తత్పుణ్య కా
ననసీమన్ మృతిజెందె నాశబరి, చింతన్వారు సంస్కారమున్
ఘనవృత్తిన్నొనరించిరప్పుడు కనంగా, నాంజనేయప్రభూ! 211

ఘనరీతిన్ వనసంయమీంద్రమహిమల్, గ్రమంబుగానెంచుచున్,
జనిరంతన్ రఘురామలక్ష్మణులు, శస్త్రస్ఫూర్తిమై జానకిన్
గనుయత్నంబున, ఋష్యమూకగిరి కాక్రాంతోల్లసత్స్వాంతులై
ఘనుసుగ్రీవుని గాంచఁగా నపుడు, వీఁకన్నాంజనేయప్రభూ! 212

**రామలక్ష్మణులు పంపా సరోవరమును గాంచుట**

అలకాంతారము దాటి సాగుచు మహోద్యత్స్ఫూర్తిమై గాంచి, రు
జ్జ్వలకాసారము సారసాంచిత రసాసార ప్రపూరంబు, సం
కలితోత్తుంగతరంగ పారము, సముత్కర్షప్రభాధారమున్
జలజాతేక్షణులా రఘూత్తములు శాస్త్రా! ఆంజనేయప్రభూ! 213

పరమాహ్లాదకరంబుగానెసఁగు పంపాపుష్కరోపాత్త సుం
దర తీరంబున (బక్షియుగ్మముల నాప్యాయంబు(తోఁగాంచుచున్
విరహార్తిన్‌మదిగుందె రాఘవుడు, దీప్తిన్‌జెంది యోదార్చె న
త్తరి సౌమిత్రి నయాప్తి నగ్రజుని శాస్త్రా! ఆంజనేయప్రభూ! 214

## ఋష్యమూక పర్వతమును జేరుట

అలపంపాసరముత్తరించి, కనిరత్యంతప్రహర్షాప్తి, ను
జ్జ్వలరత్నాంచిత శోభితంబు, నిగమస్ఫారప్రదీప్తంబు, పు
ష్కల గంధోరుఫలప్రసూన తరుసంఘాతంబు, ఋష్యాగమున్,
కలయన్‌జేరిరి రామలక్ష్మణులు, వీఁక న్నాంజనేయప్రభూ! 215

తెనుఁగుఁజేసెను వత్సగోత్రుఁడిల భక్తి ప్రాభవోపేతుఁడై
నినుసేవించుచు శ్రీనివాసకవి సందీప్తాంతరంగంబుతో
ఘనరామాప్తి నరణ్యకాండము లసత్కావ్యంబుగానొప్ప స
జ్జనభావాంచితకార్యధుర్య! పరమేశా! ఆంజనేయప్రభూ! 216

సమాప్తమ్

శుభం శుభం శుభమ్

స్వస్తి

శ్రీవాణీ ప్రసన్నాభవతు





## ప్రార్థన

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

## అంకితము

అంకితంబుగాఁ జేసితి నందుకొనుము
లోక కల్యాణ సిద్ధికై ప్రాకటముగ
సరస సుందర సౌభాగ్య శతకశైలి
నీదు గాథల వినుతించి నీకెయిచట

కడలి జలములఁ గొనివచ్చి కడఁగి మొగులు
మగిడి కడలి కర్పించు నమ్మాడ్కిదోప
దురిత సంహార! తిరుపతి పురవిహార!
రమ్యగుణసాంద్ర! కోదండరామచంద్ర!

# శతకరీతి పద్యాంధ్ర సంగ్రహ రామాయణము

## (వాల్మీకి రామాయణమునకు సంగ్రహానువాదము)

## కిష్కింధాకాండము

శ్రీలక్ష్మీ పరిరంభ సౌఖ్యజలధిన్ జెన్నొంది, ధాత్రీసతీ
లాలిత్యంబువహించి, శేషగిరి నుల్లాసంబుతోఁ జొక్కి భూ
శ్రీలన్గ్రాలెడు జానకీసతిని వాసిం గాంచు శ్రీరాముఁడు
ద్వేల స్ఫూర్తినిఁగావఁ గొల్తు కడుదీప్తిన్నాంజనేయప్రభున్ 1

### శ్రీరామసుగ్రీవులకు హనుమంతుఁడు సఖ్యముఁ గూర్చుట

వనమందున్ జనుదెంచు చాపధరులన్ భావించి, సుగ్రీవుఁ"డా
ఘనులెవ్వారలొ? మౌనివేషధరులై క్షాత్రప్రభల్చిమ్ముచున్,
కనఁగా భార్గవరామ సన్నిభులుగాఁ గాన్పించిరో! మారుతీ!
కనిరమ్మా!"యని పంపఁడే! నిను శుభంగా! ఆంజనేయప్రభూ! 2

కడుదూరంబున వచ్చు శూరుల, సమాకర్షించి, యవ్వారి సం
గడికాఁడై కొని తేవె! యంతట సముత్కర్షంబుదైవార, లో
నడలున్బాయఁ గపీంద్రసత్తముఁడు కార్యజ్ఞుండు సుగ్రీవుఁ డిం
పడరన్ స్వాగత మొప్పఁబల్క, నపుడప్పా! ఆంజనేయప్రభూ! 3

ఘటనారంభుల సత్యధర్మరతులన్ గంభీరులన్ ధీరులన్
బటుచాపాయుధలైనవారిఁ గడుసంభావించి సుగ్రీవుఁడ
చ్చట నాతిథ్యమునిచ్చె గాదె! నియతిన్ సంతోషముప్పొంగి, సం
స్ఫుటరీతిన్మది సోక నయ్యెడల శంభూ! ఆంజనేయప్రభూ! 4

"అకలంకోన్నతమూర్తులార! మదికత్యంతార్తిఁ గల్గించె, నీ
సకలోర్వీతలమెల్లనేలఁగల భాస్వద్ధైర్యసంపన్నులై,
వికలస్వాంతముతోడ మీరడవి నుద్వేగంబుతోసాగుటే
లకొ? తెల్పు"ండని కోరఁడే! విభుఁడు లీలన్నాంజనేయప్రభూ! 5

అనినన్ లక్ష్మణుఁ "డీమహాత్ముఁగనుమప్పా! రాఘవోత్తంసుఁగా,
నను సౌమిత్రిఁగ, తండ్రిపంక్తిరథునాజ్ఞన్ దీర్చుచిత్తంబుతో
వనమందుండఁగ, రావణుండు కపటోపాయంబునన్ రాఘవాం
గనఁగొంపోయెన"టంచుఁజెప్పెఁగద! కాకన్నాంజనేయప్రభూ! 6

అని రామానుజుఁడార్తిమైఁదెలుపఁగా, నారామవృత్తంబు, నె
మ్మనమందూను విషాదమున్దాలఁగ, సంభావించి యోదార్చు, న
య్యినపుత్రున్గనుచుండెఁగాదె! కడుసంతృప్తాత్ముఁడై రాముఁడ
వ్వనదంబున్గను మాడ్కి నత్తరిని దేవా! ఆంజనేయప్రభూ! 7

నరనాథున్ రఘువీరసత్తముని డెందంబొప్పఁగాఁజూచు, వా
నరనాథుండఁట సమ్మతింప "సమయజ్ఞా! నీవు రామయ్యకున్
గరమారాటముతోడ నీప్రభునిదౌ గష్టస్థితిన్ సర్వ మ
త్తరి విన్పింపవె! ధీనిధీ!" సునిసితాత్మన్నాంజనేయప్రభూ! 8

"చటులస్ఫారబలాఢ్యుఁ డుగ్రమతి దుష్టస్వాంతుఁ డవ్వాలి, యి
చ్చట సుగ్రీవుని మాప్రభూత్తముని, రాజ్యభ్రష్టుఁగావించి సం
కటముల్గల్గఁజేసె, మీర లిఁక మాకామ్యార్థ మీడేర బా
సటగానిల్వుఁడ"టంచుఁగోరవె! మహేశా! ఆంజనేయప్రభూ! 9

స్వామిక్షేమముఁగోరి నీవపుడు, విశ్వాసంబుతోఁబల్కుటల్
నేమంబొప్పెడి వర్తనంబుగతులన్, నిష్ఠాగరిష్ఠత్వమున్,
రామస్వామి మనంబులోఁగనుచు, మీ రాజేంద్రుతో మైత్రికిన్
క్షేమస్ఫూర్తిని సమ్మతించెఁగద! వాసిన్నాంజనేయప్రభూ! 10

కని వైశ్వానరుసాక్షిగా, మిగుల నుత్కర్షంబుతో మైత్రి జే
సిన సుగ్రీవుఁడు, రామలక్ష్మణులతో "సీతామహాదేవిఁ గ
న్గొని తేఁబంచెద"నంచు చెప్పెగద! సంతోషంబుతోనంత నా
వనిలో వానరవీరులెల్లఁగన దేవా! ఆంజనేయప్రభూ! 11

## సుగ్రీవుఁడిచ్చిన భూషణంబులను రాముఁడుగనుట

"అని సుగ్రీవుఁడు రామచంద్రుఁగని "యార్యా! ఋష్యమూకంబుపై
మునుమేముండఁగ, క్రూరరాక్షసుఁడు గొంపోవంగ, రోదించుచున్
దన భూషావళివైచెఁ గొండపయి, సంతాపంబుతో నొక్కయం
గన, వానిన్గను"మంచునిచ్చెఁగద! కాక న్నాంజనేయప్రభూ! 12

కని వైదేహి విభూషణాళిఁగ, సముత్కర్షంబుతో నెంచి, సీ
తను వీక్షించిన రీతిగాఁదలఁచి, సంతాపంబుఁద్రైవార, రో
దనగావించుచు మూర్ఛఁబొందఁడె! మహోదాత్తప్రకారుండు స
జ్జనమిత్రుండు రఘూత్తముండపుడు శాస్త్రా! ఆంజనేయప్రభూ! 13

ఘనమూర్ఛస్థితినుండి తెప్పరిలి దుఃఖస్వాంతుఁడై రాముఁ"డీ
మణిహారంబులు మాసిపోయినవి, రామారత్నమా జానకీ
తను సాంగత్యమువీడి, హంసకములాధారంబుగోల్పోయి స్వం
దనలేకున్నవ"టంచు వాకొనఁడె! చింతన్నాంజనేయప్రభూ! 14

తనపార్శ్వంబున శోకతప్తుఁడయి, స్తబ్ధస్వాంతుఁడైయున్న ల
క్ష్మణమూర్తిన్‌గని "సోదరా! కనుము! రామారత్నమౌజానకీ
తనువున్‌బాసిన భూషణంబులివి, ధ్వస్తప్రాభవస్ఫూర్తితోఁ,
గనుభారంబుగ నున్నవంచ"నఁడె! కాకన్నాంజనేయప్రభూ! 15

చటులావేశముతోడ లక్ష్మణుఁడు "రాజా! భానుజా! రాక్షసుం
డెటులేదిక్కుననేగెనో? తెలుపుమా! నారీరత్నమున్‌గొంచు, నా
పటుబాణంబున వానిఁగూల్చెదను, దుర్వారప్రకారాప్తి నా
నిటలాక్షుండెదురైన"నంచనఁడె! క్రాంతి న్నాంజనేయప్రభూ! 16

"అరయన్‌దక్షిణ దిక్తలంబునకు శౌర్యస్ఫూర్తిమైనేగి వా
నరవీరుల్, దనుజాధముండదర కంఠంబుల్ విదారించి, య
ద్ధరణీజన్‌గొని తెచ్చి గూర్తురని" బద్ధస్ఫూర్తిమై జెప్పఁడే!
హరిరాజంతట రామలక్ష్మణులకు దేవా! ఆంజనేయప్రభూ! 17

కనఁగాఁబ్రాంజలియై కపీంద్రుఁడటు లుత్కర్షంబుతోఁ బల్క, నె
మ్మనమొప్పంగ రఘూత్తముండు, కడు సంభావించి సంతృప్తిమై
"ననఘాత్మా! భవదీయవాగమృత మాహ్లాదంబుఁ గల్గించె, మై
త్రిని బెంచెన్‌మ"దినంచుఁ బేర్కొనఁడె! రక్తిన్నాంజనేయప్రభూ! 18

## సుగ్రీవుఁడు రామునితో నిజవృత్తాంతముఁజెప్పుట

అనఘుండాకపిరాజు కన్గొనుచు నాప్యాయంబుతో రాఘవున్
"ఘనవీరా! మదిలోన శల్యగతి నుద్గాఢంబుగా జీల్చుచున్
ననుబాధించు విషాదమున్ వినుము, బ్రాణంబొప్పరక్షింపుమీ!"
యని ప్రార్థింపఁడె! భక్తితత్పరత నప్పా! ఆంజనేయప్రభూ! 19

"బలవంతంబుఁగ నాదుపత్ని కడుదుర్భావంబునన్ బట్టి, యా
వలరాజ్యంబున నుండి నెట్టి వెలికిన్ బారంగ, రాజోత్తమా!
బలుఁడౌ వాలియుఁబెట్టు బాధలటు దుర్వారంబులైమించ, కా
నలశైలంబులనుంటి"మంచనఁడె! చింత న్నాంజనేయప్రభూ! 20

"మమురక్షించెడి దిక్కులేక, రఘురామా! మేమనాథస్థితిన్,
హిమవర్షాతపబాధలున్‌గదియ, శైలేంద్రాటవీసీమలన్
జముగంటల్ వినిపింప, భీతిని మనస్థైర్యంబుఁగోల్పోయి, క్షే
మములేకుండఁగనుంటి"మంచనఁడె! భీమా! ఆంజనేయప్రభూ! 21

## వాలిశౌర్యమును సుగ్రీవుఁడు శ్రీరామునితోఁ జెప్పుట

"జముతుల్యుండగు వాలి బాహుబల శశ్వచ్ఛౌర్యసంపన్నతన్,
మమకారంబునువీడి చెప్పెద, మహాత్మా! సాంతమాలింపుమీ!
శ్రమలేకుండఁ జతుస్సముద్రములఁ బారంబంటఁగా నీదుఁ దు
ర్గమరీతిన్"న్నని తెల్పెఁడే! యపుడు ధీరా! ఆంజనేయప్రభూ! 22

"చిరుబంతుల్‌వలె శైలరాజముల రాశింబట్టి, వ్యోమంబుపై
పరువన్వైచు; మహోదధుల్‌గలఁగ దుర్వారంబుగాఁజేర్చు, ను
ర్వరనేకంబుగ; దిఙ్ముఖంబులను జేరన్‌గూర్చుఁదాళాకృతిన్
ధరణీనాథ!"యటంచుఁ జెప్పెఁగద! శాస్త్రా! ఆంజనేయప్రభూ! 23

"మదగర్వోద్ధతి దుందుభిన్ గనుచు, శుంభద్వృత్తిమై మీఁటఁగా
రుధిరాసారము ఋష్యమూకగిరి నారూఢంబుగాఁగప్పె, సు
ప్రథితుండైన మతంగమౌనిపయి ధారాపాతమైఁబారె"నం
చదురన్ బల్కెఁడె! రాఘవుండు విన నీశా! ఆంజనేయప్రభూ! 24

"తనువంతన్ రుధిరప్రసారగతి, సిక్తంబై నసహ్యంబుఁగా
మునిరాజైన మతంగుఁడయ్యెడ సముద్భూతప్రకంపాంగుఁడై
కని రౌద్రంబున హూంకరించి చటులోగ్రస్ఫూర్తిమైఁబల్కె వా
లిని దూషించుచు"నంచు రాజనఁడెఁ శూలీ! ఆంజనేయప్రభూ! 25

"అఁటవాలిన్గని క్రోధమున్గదుర "ధూర్తా! ఋష్యమూకాద్రిపై
నిఁటమీఁదన్జరియింతువేని, శిరమెంతేన్ఖండఖండబులై
పటురీతిన్బడు"నంచుఁదెల్పు ముని శాపప్రాభవస్ఫూర్తి నా
ఘటికుండిగ్గిరిపైకిరాఁ"డనెను గింక న్నాంజనేయప్రభూ! 26

"కన వీరుండగువాలి దుందుభిని నుద్గాఢాప్తిమైమీఁటఁగాఁ,
ఘనుఁడాదైత్యుఁడు నేలపైకొరిగె, విక్రాంతిన్మహేశుండు కా
లిని యానించి, యనుగ్రహించె నతనిన్, లీలావినోదాత్ముఁడై"
యని సుగ్రీవుఁడు వాకొనెన్గద! శివప్వా! ఆంజనేయప్రభూ! 27

"అనిలోమార్కొనలేరు వాలిగని, శౌర్యస్ఫూర్తి సన్నద్ధులై
దనుజేంద్రుల్దివిజేంద్రులైనను, మహాత్మా! వాలి సామర్థ్యమున్
గనులన్గట్టఁగఁజెప్పినాఁడ, నిఁకవిక్రాంత ప్రకారాఢ్యతన్
నను రక్షింపఁగ నీవెదిక్క"నఁడె! చింత న్నాంజనేయప్రభూ! 28

## వాలితో శత్రుత్వము గల్గుటను సుగ్రీవుఁడుదెల్పుట

అని సుగ్రీవుఁడు చెప్పఁగా విని "వయస్యా! వాలి మీయన్న; యా
తనితోడన్ బగయేలఁగల్గె? నిను నిర్దాక్షిణ్యభావంబునన్
వనిలోనుండగనేలఁజేసె?"ననుచున్ ప్రశ్నింపఁడే! యంతటన్
వనజాక్షుండు రఘూత్తముండెరుఁగ దేవా! ఆంజనేయప్రభూ! 29

"పగఁగల్గన్దగుకారణంబెరిగి, యవ్వాలిన్ విదారింతు, నీ
వగఁదీర్తున్, సుఖమొప్పఁగూర్తునని"శశ్వన్మైత్రిమైఁగోరఁగా
సుగుణాత్ముండగు రామచంద్రుఁడట, నా సుగ్రీవుఁడుద్వేగుఁడై
యొగినొప్ప"న్నిటు లంత వాకొనఁడె! శంభూ! ఆంజనేయప్రభూ! 30

"మును కిష్కింధకు రాజుచేసె కడు సమ్మోదంబుతోఁదండ్రి; వా
లిని జ్యేష్ఠుండని, శక్తిమంతుఁడని, పాలించెన్ బలోపేతుఁడై,
కన మాయావియనంగ దానవుఁడు వీఁకన్దాకె శౌర్యోన్నతి"
న్నని సుగ్రీవుఁడు చెప్పఁడే! విభునకప్పా! ఆంజనేయప్రభూ! 31

కని "మాయావి"యనంగ దైత్యుఁడొకఁడాకన్లేక గర్వింపఁగా
ఘనకోపంబున వాలివానిఁగని హుంకారంబు గావింప, న
ద్దనుజుండొక్క బిలంబులోనికటు లుద్దామప్రకారాప్తిమైఁ
జనుటల్ దెల్పఁడె!" భానుజుండఁట మహేశా! ఆంజనేయప్రభూ! 32

'వివరద్వారము గాపుగాయు'మసురున్భేదించి నేవత్తు"నం
చు విరోధిన్వధియింపవాలిజని, నాశూరుండు రాకుండె, భూ
ధవుడున్లేని ప్రభుత్వమొప్పదని, శస్త్రస్ఫూర్తిమైనన్ను, బాం
ధవులంతన్ బ్రభుచేసి, రం"చనఁడె! బాధ న్నాంజనేయప్రభూ! 33

"బిలమందున్ గడుదవ్వుగానరిగి, యాభీలప్రకారంబుఁగా
నలమాయావినిఁ జంపి, వాలియొక నాఁడచ్చోటికిన్వచ్చి న
న్నల రాజేంద్రుఁగఁ జూచి, యుగ్రుఁడయి, యేరా! నన్నువంచింతువే?
ఖలుఁడా!" యంచనుటల్ వచింపఁడె! శుభంగా! న్నాంజనేయప్రభూ! 34

"అలుకన్జెందిన వాలి నన్నపుడె రాజ్యభ్రష్టుగావించి, నా
చెలువన్జేకొని, తర్మిగొట్టె మము, సంక్షేమంబుఁగోల్పోయి, బా
ధల నిచ్చోటను దాగియుంటిమని" చిన్తన్దెల్పఁడే! భానుజుం
డలగాధన్ రఘురామచంద్రునకు దేవా! ఆంజనేయప్రభూ! 35

"మునిశాపంబున ఋష్యమూకగిరికిన్ ముమ్మాటికిన్రాఁడు, వ
చ్చిన ప్రాణంబులు పోవునంచతఁడు, సంస్థేమంబుమైనుంటి, మై
నను, గారించుచునుండె వాలి మము, నజ్ఞాతంబుగానొప్పుచున్,
అనఘాత్మా!మముఁగావవే!" యనఁడె! దేవా! ఆంజనేయప్రభూ! 36

"అమరేంద్రాత్మజుడంతఁ గాలుఁడయి దేవా! మమ్ముగారించెడిన్
ప్రమదంబొప్పెను మిమ్ముఁగాంచ, చటులస్ఫారప్రతాపోన్నతిన్
మమురక్షింపుము స్వామి!" యంచనుచు సంప్రార్థింపఁడే! భానుజుం
డమలాత్మున్ రఘువీరునప్పుడు శివప్పా! ఆంజనేయప్రభూ! 37

**శ్రీరాముఁడు సప్తతాళములఁ గూల్చుట**

తతసుగ్రీవుని వృత్తమంతవిని, బద్ధస్వాంతుఁడై రాముఁడు
న్నతచాపంబును సాక్షిగా, నఁటప్రతిజ్ఞాస్ఫూర్తిమైనంత "దు
ర్మతివాలిన్వధియింతు లెమ్మ"నుచు సంభావింపఁడే! మిత్రసం
గతచిత్తున్ రవిపుత్త్రు నీయెదుట వీఁకన్నాంజనేయప్రభూ! 38

అలసుగ్రీవుఁడుమెచ్చ, రాఘవుఁడు దివ్యాస్త్రప్రయోగోన్నతి
న్నిలపై గూలఁగ సప్తతాళముల భేదించెన్ వినోదాత్ముఁడై,
'లలినొక్కుమ్మడి వాలినప్పగిది నేలన్గూల్తు జూడంచు' లో
దలఁపన్జేయఁగ భానుజున్ గపులచెంత న్నాంజనేయప్రభూ! 39

"జననాథా! భవదీయశక్తి మదికాశ్చర్యంబుఁ గల్గించె, నే
మని శ్లాఘింతు?"నటంచుఁ బల్కఁగని, నెయ్యంబొప్పఁగాఁ గౌగిలిం
చెను నచ్చో రఘురామభూవరుఁడు, సంస్తేజంబుదైవారఁ, గాం
చెను సుగ్రీవుఁడు బద్ధచిత్తుఁడయి వాసి న్నాంజనేయప్రభూ! 40

## వాలి సుగ్రీవుల ప్రథమ యుద్ధము

"మునుకిష్కింధకు సాగి, వాలి నీఁక నిర్మూలింపఁగానొప్పు" నం
చని భాషింపఁగ రాఘవుండు, కపిరాజచ్చోటికిన్‌బిల్వ నా
ఘనులేతెంచరె! వీరవానరులు, సత్కార్యాప్తిలోనెంచి త
క్షణ మూహించుచు శౌర్యసంగతుల నీశా! ఆంజనేయప్రభూ! 41

అరయన్‌రాముఁడు "నీవుపోయి యని కాహ్వానింపుమవ్వాలి, న
ద్దురమందొక్క నిశాతబాణమున నాదుర్మార్గు ఖండింతు, సు
స్థిరశాంతిన్‌గలిగింతు నీ"కని సముత్సేకంబుతోఁబల్కఁగా
హరిరాజంతట సాగిపోఁడె! యఁటకప్పా! ఆంజనేయప్రభూ! 42

అటు కిష్కింధ సమీపమున్‌గదిసి, యుగ్రారావమున్‌జల్ప, ను
ద్భట నాదార్భటి విన్నవాలి, కుహర ద్వారంబులో నుండి వా
కిట సుగ్రీవునిగాంచి, మండిపడి, దిగ్భ్రమంబులల్లాడ ను
త్కట నాగాకృతి ఘీంకరింపఁడె! మహాత్మా! ఆంజనేయప్రభూ! 43

ఘనరీతిన్‌దొడలప్పళించుచు, నిరాఘాటంబుగా వాలమున్
పెనువృత్తిన్ మెలివైచుచున్, మిగులనావేశంబుతోగాంచుచున్
గనులన్‌నిప్పులురాల, వాలి కడువిక్రాంతిన్ విజృంభించుచున్
గనవచ్చెన్‌గద! భానుజుండదర వీఁకన్నాజనేయప్రభూ! 44

దిశనాగంబులు దద్దరిల్ల, చటులుద్రేకంబవార్యంబుగా
విశదస్ఫూర్తిని మల్లయుద్ధగతి, నుద్వేగస్ఫురన్మూర్తులై,
యశనిప్రోద్ధతవృత్తి ఘట్టనము లుద్యద్భీతిమిన్నందఁగా
వశమున్దప్పుచుఁ బోరుసల్పిరె! శివప్పా! ఆంజనేయప్రభూ! 45

అలసుగ్రీవుఁడు వాలి, యొక్కగతి రూపాకారదీప్తాంగులై
వలనొప్పన్గనిపింప, రాముఁడఁట దుర్వారభ్రమస్ఫూర్తి సం
ధిల బాణంబుల నేయకున్న, నపుడుద్రేకంబుతో వాలి కం
పిలఁజేసెన్ బటుముష్టిఘాతముల దీప్తి న్నాంజనేయప్రభూ! 46

పలుగాయంబులఁ గాయమంతరుధిరప్రాయంబుగా, వాలి న
క్కలనన్మార్కొన లేకపారెఁ, గడువీకఁన్గేలి సేయంగ, దు
ర్బలుఁడై తూలుచు భానుజుండు, భయభావస్ఫూర్తి పైదోడుగాఁ,
గలయన్గాంచడె! రామలక్ష్మణులఁ గాకన్నాంజనేయప్రభూ! 47

## క్షతగాత్రుఁడగు సుగ్రీవుఁడు రామునితో నిష్ఠురోక్తులాడుట

క్షతగాత్రుండయి మూల్గుభానుజు, సమాశ్వాసింపఁగాఁజేయ, నం
చితగాత్రుండు రఘూత్తముండరుఁగ, గాసిన్దూలుచున్ వచ్చి "నా
స్థితి వీక్షింపుమటంచుబల్కఁడె!" సముద్వేగంబుతో నీప్రభుం
డతి దీనంబుగ మొకరిల్లుచు మహాత్మా! ఆంజనేయప్రభూ! 48

"చని కవ్వించితి వాలి నాజికని, రోషంబొప్ప నీమాటపై,
ననిలో మొత్తె నతండు, భీతిమెయి బుష్యాగంబు నేఁజేరితిన్
గనుమప్పా! రఘురామచంద్ర! యిది యుత్కర్షంబుగానున్నదే!"
యని నీరాజువచింపడే! యపుడు దేవా! ఆంజనేయప్రభూ! 49

"ఫలితంబిట్టులనుండె, సత్యనిధివప్పా! నీవుచూడంగ, నా
తలపై వ్రాతయునిట్టులుండె, బలిమిన్‌దప్పింప నీకౌనె? చిం
తిల నీకేల? నమస్సులందుకొను మెంతేన్‌స్నేహచిత్తుండవై
జలజాక్షా!"యని భానుజుండనఁడె! శాస్త్రా! ఆంజనేయప్రభూ! 50

కినుకన్‌జెందిన భానుజున్‌గని, మనఃక్లేశంబునన్ రాముఁడా
తనితోఁ"గోపమునుజ్జగింపు, మఁటభేదంబింత లేకుండె నీ
కును, నీసోదరుఁడైన వాలికిని, సంకోచంబుదైవార నే
ననుమానంబుననుంటి"నంచనఁడె! ధీరా! ఆంజనేయప్రభూ! 51

"ఒకటే రూపము, చూపులొక్కగతిగా, నొండైయెలుంగొప్పె, నే
నికటంబందున నుండిచూచినను, సందేహంబవార్యంబుఁగాఁ
బ్రకటస్ఫూర్తిని నేయకుంటి, నరిపై బాణంబుసంధించి" యం
చకళంకుండగు రాఘవుండనెఁ గదప్పా! ఆంజనేయప్రభూ! 52

తెలియన్‌బల్కఁగనట్లు రాఘవుఁడు సందేహంబు, సుగ్రీవుఁడా
పలుకున్‌గాంచి, మనంబులో వగచి, సంభావించి శ్రీరామునిన్,
చెలువొప్పన్‌దగఁగౌగిలించి పరమోత్సేకాప్తిమై వాలితో
కలనున్‌జేయఁగ సిద్ధమయ్యెఁగద! వేగ న్నాంజనేయప్రభూ! 53

## సుగ్రీవుఁడు వాలితో ద్వితీయ యుద్ధముఁజేయనేగుట

"అలనీరూపముగుర్తుఁబట్ట, నిడుమీ! హారంబుకంఠంబునన్,
సులభంబౌనఁట వాలిజంపఁ, జటులాస్తోకప్రతాపోన్నతిన్
గలనన్‌గాంచఁగ నంచు రాముఁడనగాఁ, గంఠంబునన్ రాజు సం
ధిల పూమాలనుదాల్చెఁగాదె!, విశదాప్తి న్నాంజనేయప్రభూ! 54

అలరన్ రాముఁడు, నీవు, వీరకపిరాయంద్రంత వెన్నంటిరాన్,
వలనొప్పన్ గజపుష్పమాలికను, గ్రీవంబుందుఁగ్రైసేసి, ని
శ్చలధైర్యంబున సాగఁడే! మిగుల నుత్సాహంబుతో భానుజుం,
డలకిష్కింధకు వాలిమార్కొనఁగ నీశా! ఆంజనేయప్రభూ! 55

"ఇదె కిష్కింధ! రఘూత్తమా! బలియునాయింద్రాత్మజున్ గాంచుమీ!
వధగావింపుము, నన్నుగావ, సమయస్ఫారప్రకారాప్తిమై,
ప్రథితంబౌ మనమైత్రి, సార్థకముగా, రాజిల్ల సామర్థ్యమున్,
గదియన్ సాగు"మటంచు వాకొనఁడె! వీఁకన్నాంజనేయప్రభూ! 56

అని సుగ్రీవుఁడు బల్కఁ, రాఘవుఁడు "నీవత్యంత వేగంబుగాఁ
జని, యవ్వాలి వసించు గహ్వరముఖస్థానంబునన్జేరి, నీ
ఘనగర్జారవమాచరింపుము, మహోగ్రస్ఫూర్తి జృంభించుచు"
న్నని వాక్రుచ్చుఁడె! సత్యనిష్ఠమెయినప్పా! ఆంజనేయప్రభూ! 57

అనినన్ భానుజు డుత్సహించి చని బ్రహ్మాండంబుభేదిల్లఁగా
ఘనగర్జారవమొప్పఁజేయ విని ఫీంకారంబుఁగావించుచున్
జనుదెంచెన్గపిరాజు వాలి, బలవచ్ఛౌర్యాత్ముఁడై, రేగుచున్
ఁగని సుగ్రీవుని బట్టనెంచెఁగద! వీకఁన్నాంజనేయప్రభూ! 58

## వాలికిఁ దార హితోపదేశంబుఁ గావించుట

కని సుగ్రీవునిఁబట్టబోవునెడ, నుత్కంఠంబుతోవచ్చి, వా
లిని యాలింగనమాచరించి, నుడివెన్ లీలాగతిన్దార, "నా
మనవిన్జేకొనుమయ్య! పోవలదు, క్షేమంబొప్పదీవేళ, త
మ్ముని పైకేగు టపాయమం"చనదె! శంభూ! ఆంజనేయప్రభూ! 59

"కనఁగా నిన్నటి ముష్టిఘాతముల కాకన్నొంచ, కీనాఁడు తా
ననికేతెంచుట కేమికారణము? నాథా! లోనభావింపుమీ!
ఘనవీరుండొకఁడొప్పు బాసటఁగ సంగ్రామంబుఁగావింప, నీ
వని జేయన్దగ"దంచుఁ జెప్పెఁగద! యీశా! ఆంజనేయప్రభూ! 60

"దగవింటిన్, మనయంగదుండుదెలిపెన్, ధైర్యప్రభావాత్ముఁ డా
మగధీరుండు రఘూత్తముండు, కడుసంభావించె సుగ్రీవునిన్,
సుగుణాత్మున్ తనమిత్రుఁగాఁ, గనఁగ నిచ్చోనిన్నుఁ గూల్పంగ శీ
ఘ్రగతిన్ జేరున"టంచుఁ బేర్కొనదె! ధీరా! ఆంజనేయప్రభూ! 61

"అల సుగ్రీవున కిచ్చినట్టిపలు కుద్యస్ఫూర్తిమైఁ దీర్పఁగాఁ,
దలపన్రాముఁడు వచ్చె నిచ్చటికి, నాధర్మాత్ము చిత్తంబు సం
ధిల, మైత్రిన్బచరింపుమయ్య! మది సందేహంబుఁబోనాడి, నీ
కిల శ్రేయంబగు"నంచుఁదెల్పెఁగద! శూలీ! ఆంజనేయప్రభూ! 62

## వాలి తారకుఁబ్రత్యుత్తరమిచ్చుట

అని పల్కంగ హితోక్తులాగతిని, భార్యన్, వాలి వీక్షించి, "రా
మునితో వైరములేదు నాక, నుజుఁడామోదంబుతోనొప్ప, నీ
ఘనరాజ్యంబును వీడలేను, ననుధిక్కారంబుగావింప నో
ర్వను, తారా!" యని పల్కెఁగాదె! యపుడప్పా! ఆంజనేయప్రభూ! 63

"బలశౌర్యంబులు నాకుఁదక్కువగునే! భావింపఁగా, భానుజుం
డలదాసోహమటంచు, రాముఁ గడుదైన్యస్ఫూర్తిమైఁజేరె, ని
క్కలనన్జూడఁగ మట్టుబెట్టెద సముత్కర్షప్రతాపంబు సం
ధిల సుగ్రీవుని రాముని"ంచనఁడె! దీప్తి న్నాంజనేయప్రభూ! 64

"శరణంబంచు విరోధిఁగోరుట, మహాశౌర్యాత్ముఁడౌ వాలికిన్
కరణీయంబగునే! గనంగ, నని నుగ్రస్ఫూర్తిఁ బోరాడి, నే
మరణంబైననుబొందువాఁడ, వినుమీ! మారాడగాఁబోకుమీ!
స్థిరచిత్తంబున నుండు"మంచనఁడె! దీప్తి న్నాంజనేయప్రభూ! 65

"అనిఁ బోరాడఁగలేక పారి, కడుధైర్యంబారఁగావచ్చె రా
ముని తోడొప్పఁగ భానుజుండు, సమరస్ఫూర్తి ప్రకారాప్తి జ
య్యనసిర్జించి, జయంబుఁగైకొనుచు, తారా! వత్తు"నంచాలితో
నని పోయెన్గద! వాలి యుద్ధమునకప్పా! ఆంజనేయప్రభూ! 66

**వాలి సుగ్రీవుల మలిపోరు**

చటులక్రోధముతోడ, తీవ్రతర నిశ్వాసంబులున్రేగ, ను
త్కటరీతిన్ భువిదద్దరిల్లఁ జని, శీఘ్రస్ఫూర్తిజృంభించి, దు
ర్ఘటనాగంబునుబోలె హస్తమున నిర్బంధింపఁడే! వాలి, వి
స్ఫుట ఘీంకారరవంబులున్ జెలఁగ, నచ్చో నాంజనేయప్రభూ! 67

అలయింద్రాత్మజు బాహుబంధగతి నుద్యచ్ఛక్తిమైఁ బాసి, సం
ధిలుకోపంబున నొక్కవృక్షమును నుద్రేకంబుతో నెత్తి, ది
క్కులు మార్మ్రోగఁగ వైవ భానుజుఁడు సంకోచంబులేకుండఁగా,
నిలపైద్రోయఁడె! వాలి దానినఁట శూలీ! ఆంజనేయప్రభూ! 68

శిరమున్బట్టి మహోద్ధతిన్బెనఁగి, ముష్టిస్ఫారఘాతంబులన్
ధరపైబోర్లపడంగఁగొట్టి, రణదీప్తస్వాంతు సుగ్రీవునిన్,
కరముద్రేకముతోడ లేచి, యతఁడుగ్రస్ఫూర్తిమైఁగ్రుమ్మఁడే!
యురమున్జిట్లఁగ, వాలినయ్యెడల, శంభూ! ఆంజనేయప్రభూ! 69

అరయన్బోరరె! వాలిభానుజులు బాహాబాహినుద్రిక్తులై,
సరవిన్బోటులమీటుచున్నచట ముష్టాముష్టి ఘాతంబులన్,
కరిమత్తేభములట్లు, శక్తిమెయి వ్యాఘ్రవ్యాళసంస్ఫూర్తులన్,
గిరులల్లాడఁగ, సంద్రముల్గలఁగ, యుక్తి న్నాంజనేయప్రభూ! 70

బలదర్పంబులడంగ, భానుజుఁడు కంపంబొంది, దైన్యంబుతో
కలయంజూడ, రఘూత్తముండు పటువేగంబొప్ప నారాచమున్
విలసచ్చాపమునందుగూర్చి, కడుదీప్తిన్లాగి, యోగింప, వి
హ్వాలుఁడై కూలఁడె! వాలినేలపయి దేవా! ఆంజనేయప్రభూ! 71

## వాలి రాఘవుల సంవాదము

ఇలపైఁగూలినవాలి, రాముగని "రాజేంద్రా! మహాత్ముండవే?
వలనొప్పన్నిది ధర్మమే? బుధులు సంభావింతురే? యన్నద
మ్ముంలు పోరాడఁగ, మాటునుండి యొకయమ్ముంన్గ్రుమ్మఁగానేల? న
న్నులయింపన్ గతమేమి?"యంచడిగెఁగాదా! ఆంజనేయప్రభూ! 72

"జననాథా! రఘురామ! పంక్తిముఖునిన్ శాసించి బిల్పించి చ
య్యన నీపాదముచెంత నిల్పనె! సునాయాసంబుగా, జానకిన్
వనధిన్దాచిన, లంకలోనిడిన, శశ్వచ్ఛౌర్యసంపన్నతన్
గనియర్పింపనె"యంచు వాకొనఁడె! కాక న్నాంజనేయప్రభూ! 73

అని బాష్పాకులనేత్రుఁడై మిగుల నాయాసంబుతోఁదూలుచున్
గనువాలిన్గని రాఘవుండపుడు "దుష్కార్యంబులన్జేసి వా
సిని ధర్మంబును గూర్చిపల్కుట మహాచిత్రంబు, సుగ్రీవుప
త్నినిఁ జేకొంటివె! ధర్మమే!"యనఁడె! దీప్తి న్నాంజనేయప్రభూ 74

"అనుజస్త్రీరతి గోరినాఁడ, వటుకామాంధుండవై నీవు, త
మ్ముని రాజ్యంబును గొల్లఁగొట్టితివి, యామోదింతురే! పూజ్యుల,
య్యనిలో జంపుటగాక, యొండగునె, ప్రాయశ్చిత్తమో ధూర్త! నీ
ఘనపాపంబులకంచుఁ"జెప్పెఁగద! కాక న్నాంజనేయప్రభూ! 75

"పశువున్బొంచి వధించుటన్న, మృగయావ్యాపారమందొప్పగున్,
వశవర్తిన్ శరణాగతున్, నృపులు సంభావించి కాపాడుటల్,
విశదస్ఫూర్తి దలంచి, ధర్మమని దీప్తిన్మీర బోధింపరే!.
పశువర్తీ! కను"మంచుఁబల్కెఁడె! శివప్పా! ఆంజనేయప్రభూ! 76

"కనఁగా నన్నువధింప, నీవు శరముద్గాఢంబుగావైవ, నో
జననాథా! నిను ధిక్కరించితిని, పశ్చాత్తాపమున్గల్గె, న
న్గనిమన్నింపుము, పుండరీకనయనా! కల్యాణసంధాయకా!"
యని ప్రార్థింపఁడె! వాలి, రాముఁగని, దేవా! ఆంజనేయప్రభూ! 77

"బలగర్వంబున లెక్కసేయక, యహంభావప్రకారాప్తి, ని
న్నలదూషించితి, ధూర్తవృత్తిమెయి, నాయజ్ఞానమున్సైపుమా!
వలనొప్పంగ క్షమించి కావు"మని సంప్రార్థింపఁడే! వాలి, వి
హ్వలచిత్తంబునఁ దూలుచు, న్నపుడు దేవా! ఆంజనేయప్రభూ! 78

అని ప్రార్థించుచుఁ, బాసెఁ బ్రాణముల దైన్యస్ఫూర్తిమై వాలి, రా
ముని పాదంబుల చెంత, భానుజుఁడు సంపూర్ణార్తి చిత్తంబుతోఁ
గనుచుండన్, భటులంత శీఘ్రగతి దుఃఖస్ఫారవృత్తాంతమున్
జని విన్పింపరె! తారకత్తరి, మహేశా! ఆంజనేయప్రభూ! 79

## తారా విలాపము

రణరంగంబున వాలి కూలుగతి, నారాటంబుతోఁదారకున్,
కనభృత్యుండొగిఁ దెల్ప, నప్పడతి దుఃఖస్ఫూర్తిమచ్చిత్తయై
తనువున్‌దూల, శిరోజముల్ చెదర, స్రస్తస్ఫారభూషాంగయై
కనఁగా వచ్చెనుగాదె! తారయఁటఁగాకన్నాంజనేయప్రభూ! 80

హతునిన్ వల్లభునార్తియైఁగనుచు "నాథా! ప్రాణముల్‌బాసితే!
హితమున్ దెల్పఁగ గీటుబుచ్చితివి, నూరేళ్ళింతలో నిండెనే!
పతితుండైతివె! హీనశౌర్యగతి, సద్భావప్రకారాప్తి నీ
సుతునిన్‌జూడు"మటంచు నేడ్చెఁగద! యచ్చోనాంజనేయప్రభూ! 81

వగమీరన్ బతిఁగౌగిలించుకొని, కంపంబొందుడగ్గుత్తికన్
"మిగిలెన్ బ్రాణము నాశరీరమున, స్వామీ! స్వార్థమింపొందునే!
తగుఁగాదే! మముబోటివారి కిఁక వైధవ్యప్రకారస్థితుల్
మగధీరా!" యని యేడ్చదే!యఁట మహాత్మా! ఆంజనేయప్రభూ! 82

"కనుమీ! యంగదునొక్కమా, రతఁడు సాకాంక్షంబుతోఁ జూచె, నీ
ఘనవక్షంబున హత్తుకొమ్మతని, వాగాధప్రకారాప్తియై,
మనఁగా నెవ్వరుగాతురీసుతుని, క్షేమస్ఫూర్తియై నింక,"నం
చని వాపోవదె! తార ఖిన్నమతి దేవా! ఆంజనేయప్రభూ! 83

"బలశౌర్యోద్ధత వృత్తి, శత్రుతతిఁ గంపంబొంద మర్దించు నీ
విలపై నెత్తుటిముద్దగాఁబొరలుచున్, హీనప్రకారాప్తియై
పలవింపన్‌గని, మిన్నకుంటిని ప్రియా! బాధావిలస్ఫూర్తి సం
చలితస్వాంతముతోడ"నంచనదె! శాస్తా! ఆంజనేయప్రభూ! 84

"త్వరగావత్తును నిన్నుఁజేర నఁటకున్, స్వామీ! విలోకింపుమీ!
హరివీరా! క్షణమైననుండ"నని, దుఃఖావేశముప్పొంగ దు
ర్భరరీతిన్ విలపించుచున్నచట, దుర్వారార్తిమై సోలుచున్
ధరపై మూర్ఛిలెగాదె!, తార, పరమాత్మా! ఆంజనేయప్రభూ! 85

ఇనపుత్త్రున్గని, తెప్పరిల్లి, చటులోద్రేకంబుతోఁదార "య
న్ననుజంపించితి, నాకునీవు కడుదైన్యంబైన హీనస్థితిన్
ఘనమౌరీతి బహూకరించితివి, సత్కార్యంబు సాధించితే!
మొనగాఁడా!" యని పల్కెఁగాదె! యఁట శంభూ! ఆంజనేయప్రభూ! 86

అని నిందింపఁగఁ, దారమాటలకు నావంతైన మారాడ కా
త్మను జింతించుచునుండె, భానుజుఁడు ధర్మస్ఫూర్తిమై నంత, కాం
తునిమీఁదన్బడి యేడ్వసాగెగద! బంధుస్త్రీలు వారింపఁగా
వినకుండన్, గపిరాజపత్ని, చలితాప్తి న్నాంజనేయప్రభూ! 87

వివశాత్మన్ విలపించి తార, కడుదీప్తిన్ రాఘవున్ గాంచి "ప్రా
భవ శౌర్యాన్వితు నాదువల్లభుని జంపన్బాడియే! నీకు, భూ
ధవ! కయ్యంబుననఁగాక, మోసమున, క్షాత్రస్ఫూర్తి నేమార్చి, బాం
ధవులగ్గింతురె!"యంచు వాకొనదె! శాస్త్రా! ఆంజనేయప్రభూ 88

కడునిష్ఠూరపుమాటలాడు సతిదుఃఖంబంత, డెందంబులోఁ
దడువన్, రాఘవుడార్తితోఁ గనుచు, సద్ధర్మప్రకారస్థితిన్
వడిగాఁదెల్పఁడె! తారకయ్యెడల, దుర్భావంబుఁ బోనాడ, సం
గడికాఁడై, గురుఁడై, మహాత్ముఁడయి, వీఁకన్నాంజనేయప్రభూ! 89

అల తారాంగదు లంత లోఁదలఁచి, సత్యస్ఫూర్తి దీపింప, బా
ధలఁ బోఁగొట్టెడి ధర్మసూక్ష్మముల, మేధాశక్తి సంపన్నులై
కలయన్జూచి రఘూత్తమోక్తులు సమాకర్షింప, మోదోన్నతిన్
దెలివిన్జెందరె! సద్గతిన్ బరఁగ దీప్తి న్నాంజనేయప్రభూ! 90

## సుగ్రీవుఁడు వాలికి దహనకృత్యంబుల జరిపించుట

మృతుఁడౌ వాలికి, నుత్తరక్రియల సంప్రీతి ప్రకారాప్తి స
న్నుతరీతిన్బచరింప, నర్కజుఁడు బంధువ్రాతమున్ జూచి, స
మ్మతి తోడన్ దలయూప,ఁదారఁ గడుసంభావించి నీచేనితో
మతిమంతున్ నినుగాంచదే! యఁట మహాత్మా! ఆంజనేయప్రభూ! 91

భువిపై గూలెను సురేంద్రపుత్రుఁడన, సంభూతార్తి నచ్చోటికిన్
రవియేతెంచెను కొండనెక్కి నిజధర్మస్ఫూర్తిమై, నంతటన్
శిబికమ్మున్ ఘృత కాష్ఠవస్తుతతి వాసిన్గూర్చ బంపించఁడే!
శవసంస్కారము సేయ భానుజుడు, శాస్త్రా! ఆంజనేయప్రభూ! 92

జలకంబార్చి కళేబరంబునకు, పుష్పస్ఫారగంధాదులన్
వలనొప్పంగనలంకరించి, కడు సేవా స్ఫూర్తిమై నుంచఁడే!
కలతన్జెందుచు నంగదుండు, పెనుకాకన్ దారరోదింపఁగా
దలఁపన్నాశిబికంబుపైనపుడు, శాస్త్రా! ఆంజనేయప్రభూ! 93

కపివీరుల్జితి మీఁదఁబెట్ట, వరదీక్షాబద్ధుఁడై యంగదుం
డవలోకించి, నమస్కరించి తుదిపర్యాయంబు, సప్తార్చులన్
గవయన్జేయఁడె! తంత్రికాష్ఠమున, దిగ్రాజుల్ సమీక్షింపఁగా,
భువిపై మంటలు మింటిపైకెగయు, శంభూ! ఆంజనేయప్రభూ! 94

పటుదుఃఖంబు శమింప, నంగదుఁడు పంపావాహినిన్ స్నాతుఁడై
యఁట సుగ్రీవుఁడుతోడు రాగ, హరులత్యంతప్రపన్నాత్ములై
స్ఫుటరీతిన్గొలువంగ, వేదగతి నాపూర్ణప్రకారంబుఁగా
ఘటియించెన్గద! కర్మకృత్యములఁ గాక న్నాంజనేయప్రభూ! 95

## అంగదుని యువరాజ పట్టాభిషేకము

కృతనిష్ఠన్బచరించి కర్మతతి, భక్తిన్వాలికిన్ మారుగా
పితృపైతామహ రాజ్యమేల, పరమాప్తిన్జేయఁడే! యంగదున్
నుతిమీరన్ యువరాజుగా, జగతి సంతోషింపగానత్తరిన్
మతిమంతుండగు సూర్యపుత్త్రుఁడఁట, మహాత్మా! ఆంజనేయప్రభూ! 96

ఘనులెల్లన్గనియాడఁగా బుధజనోత్కర్షప్రకర్షాప్తి, రా
ముని చిత్తంబలరంగ, భానుజుఁడు శంభుస్ఫూర్తిమై నీవు, నె
మ్మన మందొప్పఁగ, దార మెచ్చఁ గడుసంరంభంబుతో నంగదుం
డనఘుండై యువరాజుగా, మనెఁగదప్పా! ఆంజనేయప్రభూ! 97

## సీతను గూర్చి రాముఁడు చింతించుట

చెలువొప్పన్నఁట రామచంద్రుని శుభాశీర్వాదమొప్పంగ, రం
జిలపాలింపడె!, రాజనామమట వాసిన్మీరి చెన్నొంద, సం
ధిల కిష్కింధపురీంద్రుఁడై పరగుచున్ ధీమంతుఁ డాభానుజుం
డలదిక్పాలుర రూపుదాల్చి, పరమేశా! ఆంజనేయప్రభూ! 98

"పరరాజ్యంబునబాధలన్బడుచు, నావైదేహి యెట్లున్నదో?
యరయన్జాలకయుంటి నింతవఱకప్పా!"యంచు రాముండు దు
ర్భరశోకంబున గుందుచుండఁగని, యారామయ్యనోదార్చఁడే!
వరసౌమిత్రి నయోక్తులున్ దనర, దేవా! ఆంజనేయప్రభూ! 99

ఇనపుత్త్రున్గని నీవు నెమ్మదిగ, "రాజేంద్రా! రఘూత్తంసు నె
మ్మన ముప్పొంగఁగ, జానకిన్వెదకి, సంభావించుటొప్పౌను, మై
త్రినిఁబాటించుచు సత్వరంబు, విలసద్రీతిప్రకారాప్తిమై"
ననియచ్చో వినిపింపవే! ప్రగతి నీశా! ఆంజనేయప్రభూ! 100

పరమాప్తుండవు నీవు దెల్ప, విని, సంభావించి నీతేఁడు, స
త్వరమావానరవీరసత్తముల నాహ్వానింపడే! యంత సు
స్థిరసంకల్పముతోడఁ గొల్వునకు, నుద్దీప్తస్ఫురన్మూర్తియై,
ధరలోనన్గలవారినెల్ల, పరమాత్మా! యాంజనేయప్రభూ! 101

అలరన్ లక్ష్మణుఁ డన్నతోనచట కార్యస్ఫూర్తి మైనొప్పుచున్
"తలపన్" రావణుఁడెంత? చూడఁగ!, శరత్కాలంబునేతెంచె, ను
జ్జ్వల శౌర్యోన్నత! యుద్యమింతమిఁక, దుశ్చారిత్రునిర్జించి నీ
లలనన్దెచ్చుట"కంచు వాకొనఁడె! గ్రాల న్నాంజనేయప్రభూ! 102

"దరహాసాద్భుత చంద్రికల్ విరియ, స్నిగ్ధంబౌప్రసన్నాకృతిన్
సరసంబైన సరోవరాకృతుల నాస్వాదించెవ్యోమంబు బం
బరనాదంబుల రాజహంసగతి సంభావించుచున్, సోదరా!
వరతేజా! యని"లక్ష్మణుండనఁడె దేవా! ఆంజనేయప్రభూ! 103

"ధరణీజన్గనుకాలమబ్బె"నని బద్ధస్ఫూర్తిమై రామ భూ
వరుడుత్తేజితమూర్తియై కనఁడె! "శుంభద్ధీర కాత్యాయినీ
వరలక్ష్మీకరశారదాకృతుల, దివ్యంబైన వ్యోమంబునన్
గరణీయంబగుదాని నెంచుచు" శుభాంగా! ఆంజనేయప్రభూ! 104

పరికించెన్గద! శారదాకృతుల భాస్వద్రాజయోగంబులన్
స్థిరసంకల్పము వెన్నుఁదట్ట నఁటమైత్రీస్ఫూర్తిచెన్నొంద భా
స్కరపుత్రుండు కపీంద్రుఁడయ్యెడల నుత్కంఠంబుతో జానకిన్
త్వరతోడన్గనివచ్చు వీరతతి నప్పా! ఆంజనేయప్రభూ! 105

"హరి శౌర్యోన్నతి దిక్కులన్బరువ, రామాధీశునర్ధాంగినిన్
ధరణీజన్ గనిరండు వారమున, బద్ధస్ఫారవేగంబునన్
శరధిన్దాటిగమించి పోయి"యని యాశస్ఫూర్తి శాసింపఁడే!
వరసుగ్రీవుఁడు వీరవానరుల నప్పా! ఆంజనేయప్రభూ! 106

**సుగ్రీవుఁడు రాకుండుటకు రాఘవుఁడు చింతించుట**

"ఘనులౌవానరవీరులన్ బనిపి, యుత్కర్షంబుతో జానకిన్
గనిదెప్పింతును నాల్గుమాసములఁ, గాకన్వీఁడు మంచొప్పఁగా
నను నోదార్చిన భానుజుం డిపుడు, గానన్రాఁడె సౌమిత్రి!"యం
చని రాముండఁట వాకొనండె! బుధపోషా! ఆంజనేయప్రభూ! 10

కలతన్జెందుచు, లక్ష్మణుండపుడు వేగన్బోయి కిష్కింధకున్,
జలమొప్పన్ రఘురాముభాషణముఁ బ్రస్తావింపఁ, గర్తవ్యమున్
విలసద్రీతిగ సాగుచుండగని, యావేశముబోనాడి, సం
ధిల శాంతిన్ వహియింపడే! యచట దీప్తిన్నాంజనేయప్రభూ! 10

కని సౌమిత్రిని నీవుమోదమున "నిక్కంబొప్పఁగా దేవ! స
జ్జనపూజ్యా! శపథప్రకారగతి విశ్వాసంబుతోరాజు స
ద్వినుతస్ఫార బలాఢ్యులన్, క్షితిజ నన్వేషింపఁగాబంపి దాఁ
గనుచుండెన్న"ని చెప్పవే! యపుడు వీకన్నాంజనేయప్రభూ! 1

ఘటితంబైన ప్రయత్నమున్దెలుపఁడే! కార్యజ్ఞుఁడౌ భానుజుం
డఁట సౌమిత్రిసమేతుఁడై యరిగి, యాహ్లాదస్ఫురన్మూర్తియై
స్ఫుటరీతిన్ గొనియాడి రాఘవుని, సంపుల్లాత్ములైయొప్పరే!
యఁట వారెల్లరు మాల్యవంతమున శాస్తా! ఆంజనేయప్రభూ! 110

**సీతాన్వేషణార్థము వివిధ దిక్కులకు వానరవీరులను బంపుట**

మునుబంపించినవారు రాకతడయన్, భూరిప్రభావాత్మనిన్
వినతున్బంపఁడె! పూర్వదిక్కునకు, నన్వేషింపవైదేహినిన్,
మనసుందోళన చెందుచుండ, రఘురామస్వామి వీక్షింపఁ, బా
వన శీలుండగు భానుజుండపుడు దేవా! ఆంజనేయప్రభూ! 111

స్థిరసంకల్పుని వీరశేఖరవరున్ దివ్యప్రభావాత్మనిన్
పరమాప్తున్ నుత వజ్రదేహ వరసంపన్నున్ మరున్నందనున్
హరిముఖ్యున్ నిను, దక్షిణంబునకు సీతాన్వేషణస్ఫూర్తి న
త్తరి పంపించఁడె! భానుజుండఁట మహాత్మా! ఆంజనేయప్రభూ! 112

ఘనలోనంగద జాంబవంతుల మహాకార్యాప్తిమై బంపఁడే!
నినువెన్నంటిగమింపఁ భానుజుఁడు, సందీప్తప్రకారాత్ముఁడై
కనియిచ్చెన్గద! యంగుళీయకము నీకన్రాఘవుఁడంత, మా
నిని గుర్తింపఁగ నిన్ను నయ్యెడల, శాంతిన్నాంజనేయప్రభూ! 113

"హనుమంతా! కనుమీ! సమర్థుఁడవు ధీరాత్ముండ వీవెన్నఁ గై
కొనుమీ! ముద్రిక, దక్షిణంబరుగుమీ! గూర్పొప్పఁగాఁజేయుమీ!
కని సీతమ్మను రామభూవిభునితోఁ, గర్తవ్యమీడేర్పుమీ"!
యని చెప్పెన్గద! భానుజుం డపుడు దేవా! ఆంజనేయప్రభూ! 114

"భువియందున్దివియందు నెన్నఁగ మహాంభోరాశిమధ్యంబునన్
పవమానాత్మజ! రావణుండొగిని నిర్బంధించు గాకేమి! నీ
కవరోధంబును గల్గబోదరయ, బ్రహ్మాండంబు గాలించి, రా
ఘువుపత్నిన్గని రమ్మ"టంచనఁడె! వేగ న్నాంజనేయప్రభూ! 115

శిరమందున్ రఘురామునుంగరము సంస్తేజంబుతోఁదాల్చి, సుం
దరరాముండఁట దీవెనల్ సలుప, నుద్యద్వృత్తిమై నత్తరిన్,
హరిముఖ్యుండవు నీవు, భానుజునితో నానందమున్బొంది, శ్రీ
హరిమధ్యస్థితినొప్పవే! యపుడు దేవా! ఆంజనేయప్రభూ! 116

పిదపన్సాగి కపీశ్వరుండు గనఁడే! ప్రీతిన్ విరాజిల్లుచున్
హృదయజ్ఞున్ దనమేనమామనఁట, వాగ్రీతిఁగ్రియారూఢమౌ
విధమున్దెల్పుచు, సక్తభక్తిగరిమన్ వేమారు శ్లాఘించుచున్,
ప్రథితుండైన సుషేణునయ్యెడల ధీరా! ఆంజనేయప్రభూ! 117

ఘనుఁడైనట్టి సుషేణునిన్ బనుపఁడే! కార్యజ్ఞుఁడౌ భానుజుం
డనుకూలించు ప్లవంగపుంగవులతో, నయ్యస్త్రాద్రిపైనుండి, సీ
తను క్ష్మాపుత్రిని గాంచితెచ్చుటకు, సంతాపంబుఁ బోఁద్రోలి రా
మునిచిత్తంబున మోదమున్దనర, శంభూ! ఆంజనేయప్రభూ! 118

రవిపుత్రుండు హరీంద్రు డంత, ఁగడువిక్రాంత ప్రకారాఢ్యునిన్
నవఖద్యోతసమానుఁడౌ శతబలిన్, ధైర్యప్రతాపోన్నతున్,
శివతేజంబుననొప్పు నుత్తరదిశన్, సంక్షేమ ప్రకారాప్తి, భూ
ధవపత్నిన్ వెదుకంగ నంపఁడె! మహాత్మా! ఆంజనేయప్రభూ! 119

"కనఁగాబంపితి పూర్వపశ్చిమది శాక్రాంతప్రదేశావళిన్
ఘనవీరున్వినతున్, సుషేణువరు, వేగస్ఫూర్తిమై నుత్తరం
బునకంపించితి శూరునిన్శతబలిన్, పుణ్యాత్ముడౌమారుతిన్
చనమంటిన్ గుడిదిక్కుగా" ననఁడె! యీశా! ఆంజనేయప్రభూ! 120

"నలుదిక్కుల్ ధరణీసుతన్వెదుక బంతంబొప్పఁగాఁ బంపితిన్
వలనొప్పన్దగువారి"నంచనుచు విశ్వాసంబుతో భానుజుం
డలరన్బల్కఁగ, రామలక్ష్మణులు నవ్యానంద పుల్లాత్ములై
చెలువొందన్ గనవే! మహాత్మ! కడువాసి న్నాంజనేయప్రభూ! 121

కనఁగానేగినవారిలోఁదొలుత నుద్గాఢంబుగాసాగి, కా
నన గోత్రోచ్చయ వాహినీతతుల, నానాపత్తనస్తోమమున్
గని, యందంత ధరాత్మజన్గనక, కాకన్జెందు వాగ్వైఖరిన్
వినతుండొయ్యదజెప్పఁడే! విభునకాప్తిన్నాంజనేయప్రభూ! 122

తతవేగంబునపోయి యాశతబలి స్థైర్యాత్ముఁడా, ప్రాంత సం
గతభూమీధర నిమ్నగల్ పురవరగ్రామంబులంభోనిధుల్
ధృతిమీరంగ గవేషణన్జలిపి, వైదేహిస్థితిన్గాన కం
చితరీతిన్విభుతోడ వాకొనఁడె! గస్తి న్నాంజనేయప్రభూ! 123

బలవంతుఁడు సుషేణుడంత జని, విశ్వాసంబుతో పశ్చిమా
ద్రులసంద్రంబుల పట్టణాళి వనసందోహంబులన్నేరులన్
కలయంగాంచి, ధరాత్మజన్గనక, దుఃఖస్వాంతుఁడై వచ్చి, యా
కలరూపున్ వచియింపఁడే! ప్రభునకెక్క న్నాంజనేయప్రభూ! 124

ఫలితంబెన్నఁగలేక, భూతనయ నాప్రాంతంబులన్ గాన, కా
బలవంతుల్ చనుదెంచ నయ్యెడ, జగత్ప్రాణస్వరూపాత్మజా!
కలయన్‌జూడఁడె! నీదురాకకయి యుత్కంఠంబుతో నర్కజుం
డల సంతప్తమనోగతుల్‌విరియ దేవా! ఆంజనేయప్రభూ! 125

**సీతనుగానక అంగదాదులు చింతించుట**

పటుసుగ్రీవుని యాజ్ఞ, దక్షిణది శాభాగప్రదేశాప్తి నీ
వటులాయంగదజాంబవంతులను భవ్యస్ఫూర్తిమైఁగూడి, సం
స్ఫుటరీతిన్ జనకాత్మజన్ వెదుక శంభుస్ఫూర్తిమైనేగి, య
చ్చట గాన్పింపకయున్న కుందవె! మహేశా! ఆంజనేయప్రభూ! 126

అరుదౌపల్లెల పట్టణావళుల, సాంద్రారణ్యదేశంబులన్,
పరువంబొప్పఁగపారునిమ్నగల, నభ్రంబంటు శైలంబులన్,
బిరుదౌరీతిగ మేరమీరి, కడు నన్వేషించి, వైదేహి న
త్తరి వీక్షింపక బాధపొందవె! మహాత్మా! ఆంజనేయప్రభూ! 127

**హనుమజ్జాంబవదాదులు స్వయంప్రభగుహలో బ్రవేశించుట**

కలఁతన్‌జెందుచు, క్షుత్పిపాసలు సముద్గాఢంబుగానొంప, సం
ధిల నచ్చోనొక శైలగహ్వరము, శాంతిన్‌బొందగాఁజేర, న
వ్వలనన్‌గాంచరె! యబ్బురంబొదవ శుంభచ్చారు దివ్యప్రభన్,
తలపుల్‌చల్లబడంగమీరలు మహాత్మా! ఆంజనేయప్రభూ! 128

మతికాహ్లాదముఁగూర్చు తత్‌ప్రభల, సంభావించుచున్‌సాగి, సం
గతయోగప్రభయౌ "స్వయంప్రభ" సముత్కర్ష ప్రహర్షాప్తి న
చ్యుత భావోన్నతధీప్రభన్ గనరె! యస్తోకస్ఫురన్మూర్తులై
ధృతభక్తిన్ బిలమందు మీరలు ప్రదీప్తిన్నాంజనేయప్రభూ! 129

## స్వయంప్రభ తన వృత్తాంతముఁదెల్పుట

అతులాశ్చర్యపుదృశ్యమున్గనుచు "నమ్మా! కంధరావాసివై,
తతదివ్యప్రభతోవిరాజిలుచు, విద్యానందసంధాయిగా,
ప్రతిలేనట్లుగనొప్పుచుంటివి, తపస్స్ఫారప్రకారాప్తి, నె
వ్వైత"వంచాసతి బృచ్ఛసేయరె! శివప్రా! ఆంజనేయప్రభూ! 130

"విలసత్కాంచనదివ్యమందిరము, లుర్వీవైభవస్ఫూర్తులన్
దలపించున్, వికచోల్లసత్కమలగంధస్వాపూరోన్నతుల్
గలవె ట్లొప్పుబిలంబులోన నెఱుగంగాదెల్పవే!"యంచు న
జ్జలజాక్షిన్గని కోరరే! యఁట మహేశా! ఆంజనేయప్రభూ! 131

ఫలసారంబులు శీతలోదకము లాస్వాదింపఁగానిచ్చి, మం
జులరీతిన్ నిజగాధఁదెల్పి, మయుడస్తోకప్రభాసాంద్రమౌ
బిలనిర్మాణముఁ జేసినట్టిగతి, దీప్తిన్జెప్పఁగాబూనదే!
జలజాక్షీమణి, యింగితంబెరిగి యీశా! ఆంజనేయప్రభూ! 132

"చెలువొప్పంగ స్వయంప్రభాభిహిత సంస్తేజాభిధానంబుతో,
విలసద్రీతిగ 'మేరుసావరిణికిన్' బ్రీతిప్రకారాత్మజన్,
జలజాక్షీమణి 'హేమకున్'జెలిగ, శస్త్రస్ఫూర్తిరాజల్లెదన్
లలిమీ"రన్నని తెల్పదే! యపుడు లీలన్నాంజనేయప్రభూ! 133

"అమరేంద్రుండొకమారు దానవులతో, నత్యుగ్ర శౌర్యోన్నతిన్
సమరంబొప్పఁగఁజేయునయ్యెడల వజ్రస్ఫారఘాతంబునన్
సమభాగంబుగఁగొట్ట నీగిరిని, శస్త్రంబౌబిలంబొప్పె, దా
నవరన్దీర్చె మయుండ"టంచనదె! దేవా! ఆంజనేయప్రభూ! 134

అరయన్నంత స్వయంప్రభాచరిత, దివ్యంబైన సత్కారముల్
కరమాహ్లాదముఁగూర్ప, మీరటఁ నమస్కారప్రకారాప్తిఁగాఁ
గరణీయంబగు కృత్యమున్దెలుప, నాకమ్రాంగి మిమ్మంత గ
హ్వరసీమావధిదాటఁజేయదె! శివప్వా! ఆంజనేయప్రభూ! 135

క్షణకాలంబునదాటి గహ్వరము, నుత్కర్షప్రకర్షోన్నతిన్
గనరే! మీరలు దక్షిణాబ్ధిగతి, సముత్కంఠంబుతో జానకిన్
కనఁగాసాగరె! తత్ప్రయోధికడ క్లైక్యస్ఫార చిత్తంబునన్
ఘనులౌమిత్రులు వెంటరాగఁ గడువీఁకన్నాంజనేయప్రభూ! 136

**సీతనుఁగానక అంగదాదులు చింతించుచు - ప్రాయోపవేశమునకుఁబూనుట**

అలపాథోదధి తీరమందెసఁగు కీకారణ్యకుంజంబులన్
కలయన్గాంచి, ధరాత్మజన్గనక, గాకన్జెందుడెందాన, "నీ
బిలమందెంచఁగనుండిపోదమిఁక గుప్తిన్మీరఁగా"నంచు పె
న్గలతన్జెందుచు నంగదుండనఁడె! చింతన్నాంజనేయప్రభూ! 137

"చలమొప్పన్ విఫలక్రియాగతుల నాశ్వాసించునే? ఱేఁడు, సం
కలితోగ్రజ్వలితాంతరంగుఁడయి ఘాకన్గూల్పఁడే! జూడఁగన్
తలపంగా సమయోచింతబిదె! మనస్తాపంబుఁజల్లార్ప స
ధిలు నాలోచన"యంచు బేర్కొనఁడె! గుప్తి న్నాంజనేయప్రభూ! 138

ప్లవగుల్గాంచగ నంగదుండు విన, తద్వాగ్రీతిగాదంచు "సం
స్తవశీలోన్నతు భానుజున్గదిసి, విశ్వాసంబుతో సత్యమున్
ప్రవచింపన్" గని యాదరించునని యొప్పన్జెప్పవే! నీవు భూ
ధవభక్తిన్దనరార నప్పుడు మహాత్మా! ఆంజనేయప్రభూ! 139

"పతి సుగ్రీవునియాజ్ఞతీర్పక, తిరోభావప్రకారాప్తిమై
గతిహీనుండుగ సాగుభీరువు, పురస్కారంబుసాధించునే!
యతిదీనంబుగవేడుకొన్నను, మహాత్మా!"యంచు వాక్రుచ్చి, ని
ష్కృతిగా మిత్తినిపొందుటొప్పె"నరె! గస్తి న్నాంజనేయప్రభూ! 140

రవిపుత్రాజ్ఞఁదలంచి యంగదుఁడు, దుర్వారప్రకారార్తిమై
భువిపైఁబొర్లఁడె! వానరుల్గనఁగ, నంభోరాశి వీక్షింప, నా
వివరప్రాంగణమందు మిత్తిగతి యావేశించి బాధింపఁగా,
ధ్రువసంకల్పనిరూఢతత్త్వ! బుధబంధూ! ఆంజనేయప్రభూ! 141

కని యావానరవీరులెల్ల నటులాక్రాంతప్రకారాత్ములై
మనఁగానెంచక, ప్రాణముల్ విడువసంభావించి, ప్రాయోపవే
శనకార్యాప్తి, ధరాతలంబున నిరాశాస్ఫూర్తి మైవ్రాలఁగా,
కనలేదా! కడునార్తిమైఁగదిసి వేగన్నాంజనేయప్రభూ! 142

**ప్రాయోపవిష్టులైన హనుమదాదులకడకు సంపాతి వచ్చుట**

గతపక్షుండు జటాయుసోదరుఁడు కాకన్రాఁడె! సంపాతి, ప
ర్వతగుప్తాంచిత గహ్వరంబెడలి, యాప్రాయోపవేశార్థులై
మతికోల్పోయిన వానరుల్మనెడి శుంభద్భూధరాగ్రస్థలిన్
ధృతినుత్కంఠముతోడ జేరఁగ, శుభాప్తి, న్నాంజనేయప్రభూ! 143

"జనకాజ్ఞన్ శిరసావహించి వనవాసంబొప్ప గావించుటల్
జనకక్ష్మాపజతోడ రాఘవుఁడు, దుష్టస్ఫూర్తి లంకేశుఁడా
వనజాక్షిన్గొనిపోవుటల్, కనిన యప్పక్షీంద్రుఁ, డచ్చోట రా
వణువారించుటఁ"బల్కరే! కపులు దేవా! ఆంజనేయప్రభూ! 144

అల లంకేశునితో జటాయువు సముద్యచ్ఛూరుఁడై పోరుటల్,
చటులస్ఫూర్తిని రావణుండతని ధ్వస్తస్ఫారపక్షుండుగా
ఘటియింపన్, భువిపైఁబడె"న్ననుచు, వైకల్యప్రకారప్తులై
యఁట వాఁక్రాచ్చిరె! వీరవానరులు దేవా! ఆంజనేయప్రభూ! 145

"కలకాలంబుగ నాకలిన్మనుచు, కాకన్బొందు నాకీకపుల్
తలఁపన్నోఁగిరమౌదు"రంచఁటకు, నత్యంతప్రమోదాత్ముఁడై
వలనొప్పన్దగఁజేరి, యయ్యెడల సంపాతి ప్రసన్నాత్ముఁడై
వెలసెన్గాదె! జటాయుగాధ విని దీప్తిన్! ఆంజనేయప్రభూ! 146

గతుఁడైనట్టి జటాయుగాధ నపుడాకర్ణించి, సంపాతి స
న్నుతి గావించి, కపీంద్రులెల్ల కడుసంతోషంబుతోనొప్పఁగా,
ప్రతిగాఁదెల్పఁడె! జానకీసతిని దుర్భావంబుతో రావణుం
డతిహీనంబుగఁ గొంచుపోవుటను, దేవా! ఆంజనేయప్రభూ! 147

కన సంపాతి సముద్రతీరమున నుత్కర్షంబుతోనిచ్చె, త
మ్మునియాత్మోన్నతికై తిలోదకము, లంభోరాశిమిన్నంద, నె
మ్మనముప్పొంగ, కపీంద్రసత్తముల సంభావించి వాక్రుచ్చెడే!
తన వృత్తంబెరుగంగ నీగతిని శాస్తా! ఆంజనేయప్రభూ! 148

**వానరులకు సంపాతి తన వృత్తాంతముఁజెప్పుట**

"వినుఁడయ్యా! కపివర్యులార! విలసద్వింధ్యాద్రి భాగంబునన్,
మునిరాజిల్లు "నిశాకరు"ండనఁగ, శంభూస్ఫూర్తిమైనుంటి న
మ్మునిపాదంబులచెంత సోదరునితో, మోదంబుతోనేగె న
మ్మని, నాకంబున కొక్కమా"రనఁడె! శంభూ! ఆంజనేయప్రభూ! 149

"సురలోకంబున కమ్మునీంద్రుడరుగన్, రోషంబుతోనేను బం
ధుర మాత్సర్యముతోడ నింగికెగురన్, దోర్దర్ప్రతాపాప్తినై
వరపక్షంబులుగాల, (దూలితిని దివ్యంబైన వింధ్యాద్రిపై
హరివీరా"!యని చెప్పెఁబక్షివిభుఁడప్పా! ఆంజనేయప్రభూ! 150

"పరఁగన్వచ్చె మునీంద్రుఁడచ్చటికి, శుంభద్రీతి నాత్మాశ్రమం
బురుశోకస్థితి గోచరింప, కడుదైన్యస్ఫూర్తి నల్లాడు, నన్
గరుణాపూరిత దృష్టిఁగన్గొనఁగ, పక్షద్వంద్వమున్గాలుట
న్నెరుగన్జెప్పితి"నంచు బల్కెఁడె! పురారీ! ఆంజనేయప్రభూ! 151

"ధృతిఁగోల్పోయిన నన్నుగాంచి, మునిసందీపించు చిత్తంబుతో
"గతపక్షస్థితి శక్తివంతమగు, నుత్కర్షాత్ముఁడౌమారుతిన్
నుతిసేయు"న్నని చెప్పెనయ్యెడల, సంతోషంబుతో నిప్పుడా
మతిమంతున్గనినాఁడ" నంచనఁడె! ప్రేమన్నాంజనేయప్రభూ! 152

"నిరతిన్వచ్చితిరయ్య! జానకిని నన్వేషించుచున్ మీరు, నే
నరయన్గంటి మునీంద్రవాగ్గతి, శుభాహ్లాదప్రకారాప్తి సు
స్థిరపక్షస్థితినంత, పావనిసముత్తేజ ప్రకారాప్తి, వా
నరులారా!" యని పక్షిరాజనఁడె! చెంతన్నాంజనేయప్రభూ! 153

తన వృత్తాంతమునిట్లుజెప్పి కపులాప్తస్ఫూర్తిభావింప, న
జ్జనకక్ష్మాపజ లంకనుండుటను విశ్వాసోన్నతిన్దెల్పెఁడే!
కని సంపాతి గుణోన్నతిన్నఁట, సముత్కార్షాత్ములైవానరుల్
వినియగ్గింపరె! వాని నయ్యెడల దీప్తి న్నాంజనేయప్రభూ! 154

"మరణోద్యోగముమాని, మీరిపుడు సామర్థ్యంబు రాజిల్ల, సా
గరమున్దాటి గమించి లంకకు, మహోగ్రస్ఫూర్తి లంకేశుసం
గరమందున్బరిమార్చి, సీతగనుటే కర్తవ్య"మంచొప్పఁగా
నెఱుగన్ఁ జెప్పఁడె! పక్షిరాజు నుతకీర్తి! ఆంజనేయప్రభూ! 155

మునిసేవన్గనినాఁడ సీతయునికిన్, మోదంబుతోమార్గమున్,
"వినుఁడీ! దక్షిణవార్ధితటమునన్, వెల్గొందు దివ్యాద్రి, దా
పున నచ్చోటికి నూరు యోజనము లంభోరాశి దాటంగ, లం
కను గాంచన్గల"రంచుఁ జెప్పెగద! వీఁకన్నాంజనేయప్రభూ! 156

పరగన్సర్వముఁజెప్పిసాగె, నఁటసంపాతి ప్రమోదంబుతో
వరమౌనీంద్రుని యాశ్రమంబునకు, శుంభద్రీతిమైనంత "సా
గరమున్దాటఁగ నెవ్వఁడోర్చు"నని యుత్కంఠబుతోవానరుల్
కరమాలోచన మొప్పఁజేయరె! యఁటవీఁకన్నాంజనేయప్రభూ! 157

## వీరవానరులు దక్షిణ సముద్రతీరముఁజేరుట

వెనువెంటన్జని చేరివారు గడుదీప్తింజెందుదెందంబుతో
ఘనపాథోదధితీరశైలతటి, నుత్కంఠంబుతో నచ్చటన్
కనదుత్తుంగతరంగ భీకరతరాక్రాంత ప్రసారాంబుధిన్
గని నిశ్చేష్టతనొప్పరే! మదిని ఢాకన్నాంజనేయప్రభూ! 158

ధృతిగోల్పోయిన వానరుల్కనఁగ నుద్దీపింపఁగా ఁజేసి, స
న్మతి సంపాతి వచింపఁడే! మిగుల సంభావించి, యవ్వారికిన్
పతియాజ్ఞన్నెరవేర్పఁగాఁ, బ్రగతి సంపాదింపఁగా, నత్తరిన్
స్తుతిగావించుచు, నీవు కన్గొనఁగ బంధూ! ఆంజనేయప్రభూ! 159

"జగముల్ ముంపఁగనొప్పుకైవడి, పయస్సారంబుగారించెడున్
పగతోడన్ గగనంబుమెట్టుగతి, శుంభద్రీతి జృంభించెడున్
శగలొప్పన్ బడబాగ్నిరేగి, సకలాశాతీరముల్ గాల్చెడున్
తెగువన్దాటఁగ నేరికొ"నసరె! దీప్తిన్నాంజనేయప్రభూ! 160

జలధిన్గాంచి కపీంద్రులెల్ల, మదివిశ్వాసంబుఁగోల్పోయి, ని
శ్చలరీతిన్ గిరిమీఁద నుండగ, మనస్థైర్యంబుతోఁబల్కఁడే!
కలితార్తిన్ విడనాడి, సత్వరగతిన్ కర్తవ్యమూహింపఁగా
వలెనంచున్, దగురీతి నంగదుఁడు దేవా! ఆంజనేయప్రభూ! 161

పరివేష్టించిన వీరవానరుల సంభావించి యాధీరుఁ"డీ
కరణీయంబును దీర్చువాడెవఁడు? వక్కాణింపరే! వేగ నా
ధరణీజన్ గనివచ్చు వాఁడెవఁడు? శుద్ధస్వాంతుఁడౌ రాఘవుం
డెరుగన్జెప్పరె"యంచువాకొనఁడె! శూలీ! ఆంజనేయప్రభూ! 162

"మనరాజాజ్ఞనుదీర్చి, జానకిని సంభావించి, శ్రీరాముతో
మనముప్పొంగఁగజెప్పువాడెవఁడు? శుంభచ్ఛౌర్యమేపారఁగా
మనలో"నంచు వచింపఁడే! యపుడు ప్రేమస్ఫూర్తిమై నంగదుం
డనఘాత్మా! సమయోచితంబుగ శివప్పా! ఆంజనేయప్రభూ! 163

"స్థిరసంకల్పులు, కామరూపులు, మహాధీరప్రకారోన్నతుల్
కరణీయాంచిత కార్యధుర్యులు, సాక్షాద్దేవసంకాశులౌ
హరివీరుల్గద! మీరలెన్నఁగ, నసాధ్యంబున్నదే! మీకు"నం
చెరగన్జెప్పఁడె! యంగదుండపుడు శూలీ! ఆంజనేయప్రభూ! 164

"వనధిన్దాటఁగ మీదుశక్తి నిఁక సువ్యక్తంబుగాఁ జెప్పరే!"
యనికోరన్ గని, వీరవానరులు వ్యత్యస్తంబులేకుండ, శ
క్తిని సామర్థ్యముఁదెల్పరే! యిటుల భక్తిన్ మీరు చిత్తంబులన్,
వినఁగానంగదుఁడంత, నీవుకన, దీప్తిన్నాంజనేయప్రభూ! 165

"వినవయ్యా! దశయోజనంపుజలధిన్ వేగంబుగాదాటెదన్"
న్ననిజెప్పెన్ గజుఁడా, గవాంక్షుఁడఁట" "యప్పా! వార్ధిలోనిర్వదై
నను బోనేర్తు"నటంచు వాకొనఁగ, "బంతంబొప్పఁగాముప్పదే
ను"నటంచున్ శరభుండుజెప్పెఁగద! బంధూ! ఆంజనేయప్రభూ! 166

ఋషభుండొప్ప వచించె 'నల్వదని' నిర్ణిద్రప్రకారాప్తిమై
వెసమీరన్జనువాఁడనంచనుచు, దీప్తిన్జెప్పెమైందుండు దీ
మసవృత్తిన్దగ "నేబదం" చపుడు, శుంభద్రీతిమై వానరుల్
పసనంతన్వెలిబుచ్చరే! యచట దేవా! ఆంజనేయప్రభూ! 167

## జాంబవంతుఁడు తనశక్తిని దెల్పుట

ప్లవగోత్తంసులుదెల్ప నీసరణి, శుంభద్రీతి సామర్థ్యముల్
యువరాజత్తరి నాలకింప, కవితోద్యోగస్ఫురన్మూర్తియై
ప్రవచించెన్గద! జాంబవంతుఁడు, సమాక్రాంతప్రకారాత్ముఁడై,
నవరీతిన్ నిజపూర్వసత్త్వగతి, నంతన్నాంజనేయప్రభూ! 168

శతవృద్ధుండగు జాంబవంతుఁడట "విశ్వాసంబుతోఁదొల్లి యా
తతవేగంబున, సప్తవార్ధిగతవిస్తారప్రదేశంబు ను
ద్ధతితోడన్గని దాటుచుంటిని, నిరాతంకప్రకారాప్తి, నేన్
బ్రతిలేనట్లుగ" నంచువాకొనఁడె! దేవా! ఆంజనేయప్రభూ! 169

"జవసత్వంబులు తగ్గినప్పటికి, నాశాస్ఫూర్తి నీనాటికిన్
నవచైతన్యముతోడ నుద్గతిని పంతంబొప్పఁగాసాగెదన్,
ధ్రువరీతిన్దగఁ దొంబదామడలు, సంతోషంబుదైవార నీ
భువనారాధ్యులు గాంచఁగా"ననఁడె! శంభూ! ఆంజనేయప్రభూ! 170

## నలుఁడు నిజశక్తిని వక్కాణించుట

"అలతన్జెందక పోవనోపుదు, ధైర్యస్ఫూర్తి చెన్నొందఁగా,
తలపన్నేనును తొంబదామడల విస్తారప్రదేశంబు"నం
చెలమిన్బేర్కొనఁడే! నలుండపుడు, సంప్రీతి ప్రకారాప్తిమై
కలయన్గాంచఁగ నంగదుండచట వీఁక న్నాంజనేయప్రభూ! 171

## అంగదుండు తన సామర్థ్యమును వచించుట

హరివీరుల్ తమ శక్తియుక్తులను సువ్యక్తంబుగావింప, న
త్తరి తారాసుతుఁ డొప్పఁగానుడువఁడే! తద్ధర్మమూహించుచున్
"పరఁగన్నేనిఁక నూరుయోజనము లుద్భాసిల్లఁగానేగెదన్
మరలన్వత్తునొరానొ!"యంచని మహాత్మా! ఆంజనేయప్రభూ! 172

"ఫలపుష్పాదుల వంటి మమ్మరయఁగా బాలించు మూలంబ, వీ
వల కార్యార్థిఁగ సాగిపోయినతరిన్, బాగొప్పనిచ్చోట మా
కలరన్ మార్గముఁజూపువాఁడెవఁడ"టంచాజాంబవంతుండు తా
నెలుఁగున్రాపడఁబల్కఁడే! యపుడు స్వామీ! ఆంజనేయప్రభూ! 173

శతవృద్ధుండగు జాంబవంతుఁడటు విస్పష్టంబుగాఁబల్క, స
మ్మతిమీరన్హరివీరులెల్ల కడు సంభావించి రమ్మాటలన్,
ధృతితోనంగదుగాంచి, "కష్టగతులన్ దీరాప్తి నీవారమై
నతితోనోర్చెద"మంచు వాకొనరె! యంత న్నాంజనేయప్రభూ! 174

**జాంబవంతుఁడు హనుమంతునిఁగొనియాడుట**

అని భాషించెడి వానరుల్ గనఁగ "నత్యంతప్రపూర్ణాత్ముఁడై,
మనయుద్యోగము జేయఁజాలఁగల సన్మాన్యుండు, మౌనంబుతో
వినుచుండెన్మన రీతుల"న్ననుచు ప్రావిన్ జూపఁడే! నిన్ను, దీ
వెనగావించుచు జాంబవంతుఁడఁట, దీప్తి న్నాంజనేయప్రభూ! 175

"అరయన్వానరవీరులెల్ల తమధైర్యస్థైర్యసామర్థ్యముల్
విరియన్జెప్పఁగ, నీవు పల్కకిఁట, నావేశంబులేకుండఁగా,
నరుదౌరీతిని మిన్నకుండతగునా!, యాత్మీయు లుత్కంఠతోఁ
బరికింప"న్నని పల్కడే! యతఁడు" దేవా! ఆంజనేయప్రభూ! 176

"అనఘాత్మన్ రఘురామచంద్రుఁగని, దివ్యస్ఫూర్తి సుగ్రీవుతో
ఘనమైత్రిన్గలిగించినట్టి పరమోత్కర్షప్రభావుండ, వం
గన సీతాసతిఁ గాంచిరాఁగల సముత్క్రాంతస్ఫురన్మూర్తి వీ
వని, యగ్గింపఁగనేల?" యంచనఁడె! శివప్పా! ఆంజనేయప్రభూ! 177

"మతిమంతుఁడవు, వాయుపుత్త్రుఁడవు, శుంభద్రీతిమై దేవతా
తతిచేనొప్పువరప్రసాదివి, సముద్యచ్ఛౌర్యధైర్యోన్నతి
న్నితరుల్సాటియె, లంకకేగుటన నీకేపాటి! సుగ్రీవు నా
నతి వైదేహినిగాంచి"రమ్మనఁడె! ప్రజ్ఞ న్నాంజనేయప్రభూ! 178

"అరయంగా యువరాజుబాలుఁ డిఁక, నేనత్యంతవృద్ధుండ, వా
నరులెన్నంగనశక్తులైరి, సమయజ్ఞస్ఫారశౌర్యోన్నతిన్
శరధిన్దాటఁగ నీవెదక్షుఁడవు! నీ సామర్థ్యమూహింప మా
తరమే!"యంచనెఁగాదె! భల్లపతి యంతన్నాంజనేయప్రభూ! 179

"ఘనవేగంబును, కామరూపత, సముద్గాఢప్రభావంబు, భా
వనసేయందగు శక్తియుక్తులును, శశ్వచ్ఛౌర్య సామర్థ్యముల్,
కన నెవ్వారికి నున్నవీజగతి? నుత్కర్షంబుదైవారఁగా"
ననియగ్గింపఁడె! నిన్ను భల్లపతి దేవా! ఆంజనేయప్రభూ! 180

"ప్రతిలేనట్లుగ రామభూవరుఁడు సంభావింప, సుగ్రీవు డం
చితమైత్రిన్గొనియాడ, వానరగతిన్ క్షేమంబుమైఁ జూడుమీ!
సతిసీతమ్మను గాంచివచ్చి"యని కాంక్షన్మీర సూచింపఁడే!
నుతిమీరన్నిను గాంచి భల్లపతి బంధూ! ఆంజనేయప్రభూ! 181

శతవృద్ధుండగు జాంబవంతుని మనస్థైర్యంబు పెంపొంద, స
మ్మతిమీరంగ నమస్కరించి, కడుసంభావించుచున్ వానరుల్
ధృతిమీరన్జెలువొంద, నీవఁట సముత్తేజంబుతో దేహమున్
పతఁగున్దాకఁగ పెంపుసేయవె! శివప్పా! ఆంజనేయప్రభూ! 182

## హనుమంతుఁడు స్వీయవృత్తమును దెల్పుట

చదలన్దాకెడు నీదురూపము, మహోశ్చర్యాత్ములైవానరుల్
మదిలోనన్గనుచుండ, మిత్రతతి సంభావించి, నీవృత్తమున్
విదితంబౌగతి చెప్పఁబూనవె! ప్రదీప్తిన్జెంద నీరీతిగా
ముదమొప్పన్దరిచేరి యయ్యెడల శంభూ! ఆంజనేయప్రభూ! 183

"నదముల్జేరెడి పశ్చిమాబ్ధితటి, శాంతస్ఫూర్తి రాజిల్లుచున్,
ప్రథితంబైనప్రభాసతీర్థమమరున్, బ్రహ్మర్షిసంవాసమై,
మదనాగంబులురెండు, సంయములఁగంపంబొంద బాధించెడున్,
కదియన్జేరుచునచ్చ"టంచనవె! కాకన్నాంజనేయప్రభూ! 184

"అలనాదుష్టగజంబు లొక్కదినముద్యద్రీతి జృంభించి, వి
హ్వలఁతన్ బారెడిసంయమీంద్రుని భరద్వాజున్ విదారింప, చం
చలతన్‌జొచ్చెను, గాంచెమజ్జనకుఁడీశస్ఫూర్తి నాదృశ్యమున్,
కలఁగన్‌దానివధించె"నంచనవె! వీఁక న్నాంజనేయప్రభూ! 185

"కని మాతండ్రిని యామునీంద్రుఁడు, సమాక్రాంతోల్లసన్మూర్తియై
"కనఁగానీతఁడు కుంజరాధముల వీకన్‌సింహసంకాశుఁడై
ఘనధైర్యంబున ఁజీల్చిచంపె, మనునింకన్ కేసరిఖ్యాతిమై"
నని దీవించుట దెల్పవే! యపుడు దేవా! ఆంజనేయప్రభూ! 186

మనముప్పొంగఁగ "కేసరీ! కనుము, శుంభచ్ఛౌర్య సంపన్నుఁడౌ
తనయుండొప్పును వాయుసన్నిభుఁడు, శుద్ధస్వాంతుఁడౌ నీకు,"నం
చనియవ్వారు వరంబునిచ్చుటను, భవ్యంబైనచిత్తంబునన్
కనఁగాజెప్పవె! నీదుమిత్రులు వినంగా నాంజనేయప్రభూ! 187

"ఎనలేకుండఁగ కామరూపధరుఁడై యీరేడులోకంబులన్
ఘనసామర్థ్యము రాజిలంగ, విబుధాక్రాంతప్రభావ్యాప్తి నీ
తనయుండొప్పను కేసరీ!"యనుచు సద్ధర్మాప్తి నీతండ్రి, న
మ్మునిదీవించుటఁ దెల్పవే! యపుడు శంభూ! ఆంజనేయప్రభూ! 188

"కనఁగానట్టి వరప్రభావమున వీఁకన్నంజనాదేవికిన్
తనయుండైజనియించి"తిన్ననుచు నుత్సాహంబుతోఁదెల్పవే!
ఘనులవ్వారలు నాలకింప కడుసక్తస్వాంతులైయచ్చటన్
జనభావాంచిత కార్యధుర్య పరమేశా! ఆంజనేయప్రభూ! 189

"గిరివర్గంబులు సంచలింప, ఁగడువ్యాకీర్ణంబులై మేఘముల్
పరఁగన్, భూమియు దిర్దరన్దిరుగ, శుంభద్రీతి నంభోనిధిన్
వరవేగంబునదాటి లంకకిఁక దుర్వారప్రకారాప్తి నే
నరుఁగన్నేర్తు"నటంచు వాకొనవె! దేవా! ఆంజనేయప్రభూ! 190

"ధరణీచక్రముచుట్టివచ్చెద, సముద్యద్వేగవిస్ఫూర్తి, బం
ధురపాథోదధులేడుదాటెదను, సంతోషంబుదైవరఁగా,
నరయన్లంకకు నేగుటెంతపని? సీతమ్మన్ నిమేషంబులో
పరఁగన్గన్గొనివత్తు"నంచనవె! దేవా! ఆంజనేయప్రభూ! 191

హరివీరుల్ భవదీయ భాషణము లుద్యచ్ఛక్తి పూర్ణాత్ములై
పరిపూర్ణంబుగ నాలకించి, కడుసంభావించి, నీతోడ సుం
దరమైనట్టి మహేంద్రపర్వతము చెంతన్ జేరఁగా సాగరే!
పరగన్దక్షిణ వార్ధితీరమున దేవా! ఆంజనేయప్రభూ! 192

మహితాత్మున్ కడుశక్తిమంతు పరమాత్మస్ఫూర్తిమచ్ఛిత్తు, నిన్
రహిమీరన్ గని, వీరులెల్లఁగడుధైర్యస్ఫూర్తి చెన్నొందఁగా
సుహితప్రీతి మహేంద్రశైలతల మచ్చోజేరరే! స్వామి! యి
మ్మహియెల్లన్గొనియాడి గాంచగ, మహాత్మా! ఆంజనేయప్రభూ! 193

మనసారన్ వినుతించి రాఘవుని, సంభావించి యాదిత్యునిన్,
వినయస్ఫూర్తిని తల్లిదండ్రులకు, సంప్రీతి ప్రకారాప్తిమై
ఘనమౌరీతి నమస్కరించి, యరుగంగానెంచవే! లంకకున్,
జనకక్ష్మాపజఁ గాంచితెచ్చుటకు, శాస్త్రా! ఆంజనేయప్రభూ! 194

అరుణుండొప్పఁగ బ్రాక్తటీకలితగాఢాసక్తుఁడై, పర్వతా
వరణంబొప్పఁగ రాగరంజితగతిన్, దివ్యప్రకారాప్తి బం
ధురుఁడై గంధవహుండు ముందెసఁగ, నత్యుత్సాహివై లంకకున్
స్థిరశౌర్యోన్నతి సాగనెంచవె! ప్రదీప్తిన్నాంజనేయప్రభూ!

తెనుగున్జేసెను వత్సగోత్రుఁడిల భక్తిప్రాభవోపేతుఁడై
నినుసేవించుచు శ్రీనివాసకవి సందీప్తాంతరంగంబుతో
ఘన కిష్కింధపురాప్తగాధను లసత్కాండంబుగానొప్పఁగన్
జనభావాంచిత కార్యధుర్య! పరమేశా! ఆంజనేయప్రభూ!

సమాప్తమ్

శుభం శుభం శుభమ్

స్వస్తి

